# ప్రతిభాహారతి

ప్రతిభా మూర్తులు
తెనాలి రామకృష్ణుడు, పానుగంటి లక్ష్మీనరసింహారావు
విశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీ ల
సాహిత్య వ్యక్తిత్వాల దర్పణం.

ప్రసిద్ధాంధ్ర సాహిత్యాచార్యులు
ర్తి నారాయణాచార్యులు, దాశరథి, మధునాపంతుల
రాయణ శాస్త్రి, ఆచార్య దివాకర్ల వేంకటావధాని,
జి. వి. సుబ్రహ్మణ్యంగారల ఉపన్యాస మంజరి.

ప్రచురణ




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# PRATHIBHAA LAHARI

A Collections on Lecturers of
SRINADHA, TENALI RAMAKRISHNA, PANUGANTI LAXMI NARASIMHA RAO, VISWANADHA SATYANARAYANA AND SRI SRI.

By
Sri Puttaparthi Narayana Charyulu, Sri Dasarathi,
Sri Madhunapanthula Satyanarayana Sastry,
Prof. Divakarla Venkatavadhani and Dr. G. V. Subrahmanyam.



యువభారతి

ప్రచురణ: 30.

ప్రథమ ముద్రణ: ప్రతులు 15,200

1 డిసెంబర్, 1974

ముఖచిత్ర రచన ; అక్షరాలంకరణ : శీలా వీర్రాజు

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
విస్టాన్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003.

లేదా

యువభారతి కార్యాలయం
ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు—500001.

వెల : రూ. 6-00

యువభారతి సాహితీ మిత్రులకు ఉచితంగా అందజేయబడింది.

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL

# ప్రేరణ




"ఆలోచన - నా ఉనికికి సూచన"

ఆలోచన, ఉన్న స్థితితో అసంతృప్తిని కలిగించి, ప్రశ్నించడం నేర్పుతుంది. ప్రశ్నించడం అన్వేషణకు కారణమౌతుంది; అధ్యయనానికి ప్రేరణ అవుతుంది; ప్రగతికి పునాది అవుతుంది.

ఆలోచనలో పొదుపు-ప్రగతికి ప్రతిబంధకము. చేతలో పొదుపు-మనుగడకే ముప్పు. మాటల్లో పొదుపు-బహుశః కవితలో అందంకావచ్చుకాని, ఆలోచనా విత్తనాలను వెదజల్లే మాటల్లో పొదుపు పురోగతికి, ప్రతిబంధకమైన అడుపుగా తయారవుతుంది. అల్పాక్షరాలలో అనల్పార్థాలను పదిలంగా పొందుపరచగల మేధావుల ప్రజ్ఞా విశేషాలను మనస్ఫూర్తిగా అభినందించవలసినదే; కానీ— జనసామాన్యం అంతా, అంతటి సూక్ష్మగ్రాహులు, నిశితపరిశీలకులు, కుశాగ్రబుద్ధులు కారన్న విషయాన్ని విస్మరించడం; తొందరపాటే అవుతుంది. ప్రగతికి అవసరమైన సమస్త విజ్ఞానమూ, వీలున్నంత ఎక్కువ మందికి, వీలైనంత తక్కువధరకు అందుబాటులో ఉండేలా, సమాజంలోని వివిధ వర్గాల నాయకులు, ఆలోచనాపరులు పూనుకొన్నప్పుడే, ప్రగతి రథం కదులుతుంది. జాతి మనోరథం ఈడేరుతుంది. ప్రజాస్వామ్యం పదిలంగా ఉంటుంది. సమసమాజస్థాపనకు దోహదం కాగలుగుతుంది.నిర్మాణాత్మక ఆలోచనలను కలిగించే ప్రేరణలను, మానవతా విలువలను మన్నించే ఉత్తమ సంస్కారాన్ని, ఉన్న తాదర్శాలవైపు పయనించే సంకల్పబలాన్ని జాతిప్రగతికి దోహదం చేయగల సేవా నిరతిని. అవినీతిని ఎదిరించి నిలువగల ఆత్మస్థైర్యాన్ని ఉద్యమవేగంతో ప్రేరేపించగలగాలి. పట్టిపీడిస్తున్న నిద్రమత్తును విదిల్చికొట్టాలి. జాతి నిదురలేచి, ఒక్క వ్యక్తిగా సంఘటితమై కదలాలి. శ్రేయోరాజ్యస్థాపనకై సత్వరమే కృషి ప్రారంభం కావాలి.

ఆలోచనలను ప్రభావితంచేసి, ఆలోచనా పరిధులను విస్తృతపరచగల సాహిత్యం ఇప్పటి తరానికి అవసరం. కేవలం ఉబుసుపోకకోసం సాగే రచనలను అభిమానించి, ప్రోత్సహించే, పాఠకుల ఆలోచనలను మరోదారి మళ్ళించడం ఎంతైనా అవసరం. యువభారతి ప్రచురణలు కొంతవరకైనా ఈ కృషిలో సాఫల్యం చెందగలగాలని మా ప్రయత్నం, మనిషిలోని మానసిక బలహీనతలను రచ్చకీడ్చినట్లు

రెచ్చగొట్టే రచనలకు ఆచరణ లభిస్తే, జాతి కుళ్ళిపోయేందుకు విషబీజాలు బలంగా నాటబడతాయి. మనిషిని సంస్కారహీనుడిగా; కేవలం ఒకప్రాణిగా, నెత్తు పురుగుగా ఆలోచనా రహిత క్రిమిగా, ధ్యేయరహిత కీటకంగా మార్చే ప్రమాదం ఇందులో ఇమిడి ఉంది సమాజంలో ఉన్న ప్రతివాడూ—"ఈతంటా నాకెందుకని?", "బాధ్యత నాదికాదు నాదికాదు!" అని "నేనొక్కడినీ ఏం చేయగలననీ?" ప్రశ్నిస్తూ కూర్చుంటే ఎలా? ఎవ్వరూ పట్టించుకోకుంటే ఎలా? ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, కొద్దోగొప్పో ప్రతి ఒక్కనికీ ఇందులో భాగంఉంది; అందుకే బాధ్యతఉంది. అలా ఉందనుకొని కృషిచేయగలిగినప్పుడే ముందుగతి ఉంది. ప్రజాస్వామ్య విలువలపై నమ్మకమున్న చైతన్యపూరితమైన జాతి, ప్రభుత్వ వర్గాల్లో, మరింకెవరో ఏదో చేస్తారని, నిరీక్షిస్తూ కూర్చోవడం ఆరోగ్యకరమైన లక్షణంకాదు. ఆలోచించండి. సర్వే సర్వత్రా వ్యాపించుకొని ఉన్న ఈ కాలుష్యాన్ని కడిగివేయడానికి పూనుకోండి. ఉడుతా భక్తిగానైనా ప్రయత్నం ప్రారంభించండి.

మీ ఆదాయంలోనుండి, నిత్య అవసరాలకై కేటాయింపులు జరిపినట్లే, నెలకొక మంచి పుస్తకం అయినా, తప్పనిసరిగా కొనాలనే సంకల్పానికి అంకురార్పణచేయండి. ప్రతిరోజూ కనీసం ఒక్కపేజీ అయినా చదువనిదే ఆ రోజు జీవించినందుకు న్యాయం చేకూర్చనట్లు భావించి, చదువడం ఆరంభించండని విన్నపం. మీలో సహృదయులైన చాలా మందికి ఈ మాటలన్నీ అనవసరమని మాకు తెలుసు దయచేసి, ఒక్కసారి చుట్టూరా చూడండి, నేటి యువతలో అత్యధిక సంఖ్యాకులు ఎలా జీవితం గడిపేస్తున్నారో గమనించండి. ఈ వేదన వాళ్ళకోసం. వెర్రెక్కుతున్న ఆవేదన ఇంకా మారని వాళ్ళకోసం. బహుశః ఇప్పటికీ మారిన మీకోసం కాదు. ఇంకా మారని, మారాలని తెలుసుకోలేని అత్యధిక సంఖ్యాకుల కోసం ఈ నివేదన.

"నిన్న"లో ఏం లేదని, అదంతా 'సున్న'అనేవర్గం ఓవైపూ- 'నిన్న'నే అన్నిటికన్నా 'మిన్న' అనేవాదం మరోవైపూ-సమాజాన్ని రెండువర్గాలుగా విభజించి-'రేపటి' గురించి అసలు ఆలోచన పారకుండా, ఏమీ చేయనివ్వకుండా, అస్పష్ట స్థితిని సృష్టించి, ఆ అయోమయస్థితినే ప్రగతివైపు పయనిస్తున్నందుకు చిహ్నంగా భావించేలా చేస్తున్నాయి.

అవసరాన్నిబట్టి ఆరంభమై, అవకాశాన్నిబట్టి ఎదుగుతూ, కాలానుగుణంగా పరిణామం చెందుతూవచ్చిన "నిన్న"టి గురించి పరిశీలన అవసరమే. కానీ- నిజా

నిజాల అంతుచిక్కదు. ఇజాల రంగుకళ్ళద్దాలతో చూడటం సమంజసనీయం కాదు. "నిన్న" నేటి కాలమానం ప్రకారం నేర్పిన గుణపాఠాలను నేడే నేర్చుకొని కలలు గంటున్న "రేపు" కోసం నేడే పునాదులు వేయగలగాలి సమన్వయ దృక్పథం కావాలి. సౌమనస్యం ఎరిగిన సంస్కారం కావాలి. కేవలం తనకోసం, తన కుటుంబ సభ్యులకోసం తాను బ్రతుకుతున్నాననే భావాన్ని మొదలంటా తుడిచిపెట్టే నూతన వాతావరణాన్ని సృష్టించాలి. ప్రతివ్యక్తీ ప్రతిక్షణం ఈ మానవ సంఘంకోసం పాటు పడేలా చేయాలి.

తన కున్నదేదో ప్రత్యేకమనే అహంభావం ఒకటి, తనకు లేనిది మరొకరి కున్నదనే అసూయ మరొకటి- ఈ రెండూ కలిసి- సమాజ అవసరాలదృష్ట్యా సగటు మనిషిని, పనికి రానివాడిగా చేస్తున్నాయి. తన గురించి తనకు తెలిసి ఉండటం- అవ సరమే. ఆత్మవిశ్వాసాన్ని కలిగించగలగాలి కాబట్టి తనలో లేనిదేదో తెలుసుకోవాలి. ఆరోగ్యకరమైన ఆలోచనతో, పట్టుదలతో లేనిది సాధించ పూనుకోవాలి కాబట్టి. అహం భావం, అసూయ కొద్ది మోతాదులో కృషిని ప్రేరేపిస్తాయి. మించిన మోతాదులో- మంచితనానికి ముప్పుగా పరిణమిస్తాయి. విద్యావిధానంలో మార్పుతో ఆరంభమై సమాజపరమైన అవసరాలకై సృష్టించిన అనేకానేక సంస్థల వ్యవస్థల ఉన్నత నైతిక ప్రవర్తనలో ప్రస్ఫుటమై, మనిషి మనసులోఉన్న మంచిని పెంచగలగాలి. కోట్లాదిజనం, మంచివాళ్ళయి ఒక్కసారిగా కదిలినప్పుడు- ఇక సాధించలేనిదంటూ ఏముంటుంది? ఈ బృహత్కార్యానికి ఎప్పుడో అప్పుడు, ఎప్పుడో అక్కడ, ఏదో ఒక ఎత్తున, ఏదో ఒకరూపంలో అంకురార్పణ జరుగుతూనే ఉంటుంది. కానీ ఉత్సాహమున్న ఒకరిద్దరి చుట్టూ-నిరుత్సాహపరిచే వందలాది జనం- ప్రోత్సహించని వాతావరణం నీరు కారి పోయేలా చేస్తూవచ్చింది. మరింత పట్టుదలతో ముందుకు సాగాల్సిన సమయం. అందుకే- కేవలం చిన్నఎత్తునే అయినా- యువభారతిలో మేం పూనుకుంటున్నాం. సక్రమంగా ఆలోచించే పద్ధతిని, అందంగా, శక్తిమంతంగా, అర్థవంతంగా మాట్లాడ గలిగే సామర్థ్యాన్ని, రచించగలిగే నైపుణ్యాన్ని, ఎదుటివారి అభిప్రాయాలను సహ నంతో వినే సహృదయాన్ని ఆలోచనను రేకెత్తించి వివేకాన్ని ఉద్దీపింప చేయగలిగే అధ్యయన శీలతనూ, అలవరించేందుకు విభిన్నదృక్కోణాలతో రూపొందించిన కార్య క్రమాలను మా పక్షసమావేశంలో నిర్వహిస్తున్నాము. కనీసం ఓ పాతికమందైనా ఈ పద్ధతిలో సుశిక్షితులై ఈ సమాజానికి చేయగలిగినంత సేవచేయగలుగుతే- ఈ చిన్న దీపం అక్షయంగా వెలుగు నివ్వగలిగితే- యువభారతి కృషికి సార్థకత చేకూరినట్లే.

ఇది తెరవెనుక కథ. మా మనస్సులో అనుక్షణం మెదిలే ఆలోచన, మేం పడే తపన; ఆలోచనలేని శక్తినంతనూ జడమైన అచ్చుసిరా, అందించలేదు గదా! ఈ కృషివెనుక నున్న ఆలోచనా స్రవంతిని సహృదయులైన మీ కెరుకపరుస్తే- మీలో ఏ కొందరైనా కదిలి, ఈ కృషిని ప్రోత్సహించపూనుకుంటే మరింత వేగంతో మరిన్ని విజయాలను సమాజాభివృద్ధికై సాధించవలెనన్న స్వార్థం ఇందులో లేకపోలేదు.

జంటనగరాలలోనున్న సాహితీ బంధువులకు యువభారతి వార్షికోత్సవ సమావేశాలను తిలకించే అవకాశం ఉండటంవల్ల- యువభారతిలోని క్రమశిక్షణనూ, సేవానిరతినీ గమనించే అవకాశం ఉంటుంది. దారాలు పోగుపెడితే- అది బట్టకాదనీ క్రమపద్ధతిలో నేతవెయ్యవలసి ఉంటుందనీ మీకు తెలుసు. పూలను రాశిపోస్తే, అది మాలకాదనీ, అందంగా పూలను మాలకట్టవలసి ఉంటుందనీ మీకు తెలుసు, ఇటుకలను గుట్టగాపేరిస్తే, అది గోడకాదనీ, సిమెంటుతో క్రమప్రకారం పేర్చి నిర్మించాలని మీకు తెలుసు. రాళ్ళను చెక్కితేకానీ శిల్పాలుకావనీ మీకు తెలుసు; మౌనం విడనాడితే కానీ మాటకు సంగీతానికి తావులేదని మీకుతెలుసు; మత్తువదిలితే కానీ ఆలోచనకు తావులేదని మీకు తెలుసు; ఆలోచన ఉన్నచోటే కృషి, కృషి ఉన్నచోటే ప్రగతి, ప్రగతి ఉన్నచోటే జాతికి గతి, ఉంటుందని మీకు తెలుసు. ఈ ఆలోచనల తోరణాలే—ఆహ్వానితులకు గులాబీలనిచ్చి, అత్తరునిచ్చి ఆహ్వానించాలనీ సమయానికే ప్రారంభించి, క్రమశిక్షణను పెంచాలనీ, పుస్తకాల ముద్రణ అందంగా ఉండేలా చూడాలనీ, కష్టనష్టాలనెన్నైనా భరించి (ధరలు విపరీతంగా పెరిగినా) మాటఇచ్చిన మేరకు పుస్తకాల నందించటానికి పూనుకోవాలనీ, మా చేత అనేకానేక అంశాలను గురించి ఆలోచింపచేసి, మాకు చేతైనంతలో, అందంగా, నిజాయితీగా, క్రమశిక్షణతో పట్టుదలతో, త్యాగబుద్ధితో, సహనంతో, కృషిసల్పేలా చేస్తున్నాయి. మా సత్సంకల్పమే మాకు పెట్టనికోట. మా సేవానిరతి మాకు శ్రీరామరక్ష.

ప్రతి సమావేశానికి దాదాపు రూ. 1700 ఖర్చు అవుతుంది. ఇక్కడ లెక్క చెప్పడం నా అభిమతం కాదు. ఈ డబ్బు ఎక్కడనుండి తేవాలని మేం ప్రశ్నించుకున్నప్పుడు—ఇబ్బంది కలుగుతుంది. పుస్తకాలను, అధిక ధరలకు అందించడం లేదు. అందులో లాభాలు చాలా స్వల్పం. అదీగాక సాహితీమిత్రులకు 25 శాతం తగ్గింపు సదుపాయం. అందుకనే - ఉదారులనుండి విరాళాలు, ఈ పుస్తకాలలో వ్యాపారసంస్థల ప్రకటనలకై ప్రయత్నిస్తున్నాం. ఆ మేరకు కొంతయినా వనరులు సమీకరించుకోగలమని, అందుకే అర్థిస్తున్నాము—మీ పరపతిని వినియోగించి, యువ

భారతి ప్రచురణలలో వ్యాపార ప్రకటనలు సేకరించి సాయపడండని, మరిన్ని మంచి పనులు మా చేత చేయించండని సేపచేయడానికి, కొద్దిపాటి అనుభవం పట్టుదల, క్రమ శిక్షణ సేవానిరతి, అందంగా చెయ్యాలన్న ఆలోచన మాలో ఉన్నాయని సవినయంగా మనవి చేస్తున్నాము.

, దూరాననున్న సాహితీ బంధువులకు కేవలం మా ప్రచురణలే పరిచయం. అయినా, ఎందరో మాకు సహకరిస్తున్నారు. కానీ—అవసరమైనంత ప్రమాణంలో, అందవలసిన తరుణంలో అందిరావడం లేదు. ప్రయోగాత్మకంగా చేస్తున్న పనుల్లో ఈ అనుభవం కొత్త కాదనే విషయం స్వానుభవంలో ఉంది కానీ, ఈ బాలారిష్టదశను దాటి, సుస్థిర భవిష్యత్తుకై కృషిచేయనివ్వండని, ఈ ఉద్యమంలో మీ సహకారం మనస్ఫూర్తిగా అందించండని విన్నవిస్తున్నాము. మీ మిత్రులతో, బంధువులతో— యువభారతి ప్రచురణల విషయం ముచ్చటించండి. ప్రతి తెలుగింటిలో కనీసం పదైనా మంచి పుస్తకాలు ఉండేలా చూడండి. అందులో ఏ ఒక్కటైనా యువభారతి పుస్తకం అయ్యేందుకు కృషిచేద్దాం.

కావ్యలహరితో ప్రారంభమై, చైతన్యలహరితో కొత్త చైతన్యాన్ని పుంజుకొని వికాసలహరితో వికసించి, ప్రతిభాలహరితో ప్రభావితమై, కవితాలహరివైపు పయనిస్తోంది యువభారతి. మా ప్రచురణల గురించి, భావి కార్యక్రమాల గురించిన వివరణలు ఈ ప్రతిభాలహరిలో ప్రస్తావించాము. మీ సూచనలను అందజేయండి. ఇది కేవలం యువభారతిది అని కాక, ఇది అందరిదనీ ఈ జాతికోసం ఈ కృషి జరుగవలసిన అవసరం ఎంతైనా ఉందనీ సహృదయులైన మీరందరూ గుర్తించినదే. ఐనా మరోమారు గుర్తుచేస్తున్నామని విన్నవిస్తున్నాము

ఇది యువభారతికి పదకొండో వసంతం. ఈ సంవత్సరంలో మూడు పుస్తకాలను పునర్ముద్రించడం, పదమూడు పుస్తకాలను ప్రచురించడం జరిగింది. సహృదయుల సహకారంతో ఇప్పటికి 32 ప్రచురణలను, 2 లక్షలకుపైగా ప్రతులను సరసమైన ధరలకు అందించగలిగాం. యువభారతి వ్యాపారసంస్థ కాదు. మాకున్న పెట్టుబడి మీ హృదయంలో మీ రిస్తున్న స్థానమే తెలుగుభారతికి, మరిన్ని మణిహారాలను వీలున్నంత త్వరగా, వీలైనంత ఎక్కువగా సమకూర్చాలనే మా ప్రయత్నాలకు మీ అందరి ఆదరణా, మనఃపూర్వక సహకారమూ అందగలవన్న ఆశతో, నిరీక్షణతో—

1—12—1974

వంగపల్లి విశ్వనాథం
సమావేశకర్త, యువభారతి



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 32 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే - యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 7,500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. ఈరోజు నుండి ఈ ప్రణాళిక కొత్తరూపు దాలుస్తున్నది. ఇందులో కూడా సహృదయులు చేరి తమ సహాయ సహకారాలు అందజేస్తారని ఆశిస్తాము. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా దాదాపు 450 మంది, భారతీ భూషణులుగా 50 మంది చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వం-ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని ఆకాంక్షిస్తూ —

1-12-1974

అధ్యక్షుడు

# భవిష్యత్తులో....




మేం నిర్వహిసున్న సాహిత్యోద్యమం మరింకింత ప్రభావోపేతంగా రూపొందా లనే ఆశయంతో క్రొత్త పథకాలను, పెద్దఎత్తున క్రొత్త ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టుతున్నాము.

1 **నూతన సాహితీమిత్ర పథకం** : డిసెంబరు 1, 1974 వ తేదీన ఆరంభింపబడు తున్న క్రొత్త సాహితిమిత్ర పథకం ప్రకారం పదిరూపాయలకు తక్షణమే కోరు కున్న పుస్తకాలు, రిజిస్టర్డు పోస్టులో పంపబడుతాయి. 'నందిని' పేరిట చిన్నమాస పత్రిక, 12 నెలలపాటు సాహితీమిత్రులకు ఉచితంగా అందించబడుతుంది.

2. **నందిని** : తెలుగులో అచ్చవుతున్న సాహిత్యంనుండి, మంచిని ప్రోవుచేసి, సంక్షిప్తంగా నయినా చదువరులకు సత్వరమే అందించగలిగితే, సాహిత్యానికి, పాఠకులకు మధ్యగల దూరాన్ని తగ్గించగల మనేభావంతో ఇంగ్లీషులో ఉన్న Readers' Digest లాంటి పత్రిక తెలుగుసాహిత్యంలోని ఈ లోటును తీర్చగలదనీ,అలాంటి పత్రికను యువభారతి సుదూర భవిష్యత్తులో ప్రచురించవలెనని మా సంకల్పం. 'నందని' ఆ ఊహకు చిన్నఎత్తున తొలి ప్రయత్నం. 'నందిని' ఆనంద సంక్రాంతి నుండి వెలువడుతుంది.

ఇలా చిన్నఎత్తున ఆరంభింపబడుతున్న మాసపత్రిక 'నందిని' అటు యువ భారతికి, ఇటు సాహితీ బంధువులకు సేతువుకాగల దని, సాహితీపరమైన బాంధవ్యాలను పెంపొందింప గలదని ఆశిస్తున్నాము. క్రొత్త సాహితీమిత్ర పథకంలో చేరే సహృదయులందరకు 'నందిని' చేరిన నాటినుండి ఒక సంవత్సరం పాటు ఉచితంగా అందుతుంది. ఆలోచనలను రేకెత్తించే రచనలకు, సాహితీ వ్యాసంగాన్ని పటిష్టం చేసుకునే పద్ధతులకు 'నందిని'లో ప్రాముఖ్యం ఉంటుంది.

3. **కవితాలహరి** : 1975లో మేము రూపొందించిన ఉపన్యాసమంజరి కార్యక్రమం. ఈ లహరిలోని కవితామూర్తులు.

1. నాచనసోముడు
2. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు
3. జాషువా
4. దేవులపల్లి కృష్ణశాస్త్రి
5. దాశరథి

4 జనవరి 14, 1975 సంక్రాంతి నాటికి వెలువడనున్న ప్రచురణలలో ముచ్చటైన మూడు :

1) మరపురాని మనీషి : 'ఆంధ్రప్రభ' సచిత్ర వారపత్రికలో కొన్నాళ్ళ క్రితం శ్రీ తిరుమల రామచంద్ర ప్రచురించిన తెలుగు మనీషుల పరిచయాత్మక వ్యాసాలు, శ్రీ సత్యమూర్తిగారి రేఖాచిత్రాలతో.

2) సాహిత్యపు విలువలు గలిగి, పది కాలాలపాటు ప్రజాదరణ పొందగలిగిన డా॥ సి. నారాయణరెడ్డి సినీగీతాలతో కొన్నింటికి పుస్తకరూపం

3) 25 ప్రసిద్ధమైన తెలుగు నవలలను పరిచయంచేసే ఇంగ్లీషు వ్యాసాల సంపుటి 'Telugu Novel'

5. 'యువత' గోష్ఠి కార్యక్రమము 1975 లో నిర్వహించే ప్రయత్నాలను తీవ్రతరం చేస్తున్నాము.

6. మహానుభావుల మహితభావాలను ఏర్చి కూర్చి ఒక బృహత్‌గ్రంథంగా రూపొందించి ప్రచురించడానికి ప్రణాళికను సిద్ధంచేశాము.

7. సాహితీవాహిని : ఈ పరంపరలో త్వరలో వెలువడుతున్న పుస్తకాలు.

| | |
|---|---|
| 1) నన్నయ కవితావైభవం | ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు |
| 2) పెద్దన కవితావైభవం | డా॥ పల్లా దుర్గయ్యగారు |
| 3) రాయల కవితావైభవం | డా॥ నాయని కృష్ణకుమారిగారు |
| 4) తిమ్మన కవితావైభవం | డా॥ బి. వి. కుటుంబరాయశర్మగారు |
| 5) ధూర్జటి కవితావైభవం | డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు |
| 6) మొల్ల కవితావైభవం | డా॥ పి. యశోదారెడ్డిగారు |
| 7) వేమకూర కవితావైభవం | డా॥ ఎమ్. కులశేఖరరావుగారు |
| 8) ఉర్దూ కవితాసౌరభం | దాశరథిగారు |
| 9) చాటువులు | ఆరుద్రగారు |
| 10) శరత్-స్త్రీ | రామలక్ష్మి ఆరుద్రగారు |
| 11) తులసీదాసు కవితావైభవం | డా॥ భీమ్‌సేన్‌'నిర్మల్'గారు |
| 12) గోరాశాస్త్రీయం | గోరాశాస్త్రిగారు |
| 13) కన్నడ కవితాసౌరభం | గడియారం రామకృష్ణశర్మగారు |
| 14) శతక సౌరభం | |

భవిష్యత్తులో ప్రణాళికలు సిద్ధం చేసుకుంటున్న మరికొన్ని ప్రచురణలు:

1) కవితా నిర్వచనాలు
2) వాల్మీకి, కాళిదాసు, దండి, భవభూతి, భారవి, బాణుడు మొదలైన సంస్కృతకవుల కవితావైభవాలు.
3) తెనాలి రామకృష్ణుడు, నన్నెచోడుడు మొదలైన తెలుగుకవుల కవితా వైభవాలు.
4) సాహిత్యేతరమైన విషయాలకు సంబంధించినవి.
5) మహాకవి శ్రీదాశరథి 50వ జన్మదినోత్సవ సందర్భంగా (1976) ఆయన కవితల నన్నింటిని ఒక సంపుటంగా యువభారతి వెలువరించ ప్రయత్నిస్తున్నది.
6) చదువదగిన పుస్తకాలుగా పేర్కొనదగిన పుస్తకాలను పరిచయం చేసేందుకు ఒక పుస్తకాన్ని ప్రచురించి—ఇదిగో! ఇవీ చదువదగిన పుస్తకాలని చదువరులకు సన్నిహితం చేద్దామని మా సంకల్పం.

సాహిత్యాభిమానుల సహకార సౌహార్దాలతో మే మీ కార్యక్రమాలను జయప్రదంగా నెరవేర్చగలమనే దృఢవిశ్వాసాన్ని ప్రకటిస్తున్నాము సహృదయుల భాషాభిమానమే మాకు పెట్టుబడి.

జనసామాన్యానికి ఉత్తమసాహిత్యాన్ని అనువైన పద్ధతిలో అందిస్తున్న యువభారతి సాహిత్యకృషికి సహృదయులైన మీ సహకారం మనస్ఫూర్తిగా అందించండని అభ్యర్థిస్తున్నాము

డా|| జి.వి. సుబ్రహ్మణ్యం
ప్రధాన సంపాదకులు
యువభారతి ప్రచురణలు



# ప్రతిభాలహరి

ఉపన్యాసమంజరి కార్యక్రమాల వివరణ

స్థలం : ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనము
తిలక్ రోడ్, హైదరాబాదు - 500001

సమయం : సాయంకాలం గం. 5-30 లు

**మొదటి సమావేశం 6-10-1974 ఆదివారం**

ప్రతిభామూర్తి : 'కవిసార్వభౌమ' శ్రీనాథుడు

ఉపన్యాసకులు : శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు

అధ్యక్షులు : శ్రీ ఆకెళ్ల అచ్యుతరామంగారు
భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ ప్రధాన ఆర్థిక సలహాదారులు

ఉపన్యాసకులు : శ్రీ దేవులపల్లి రామానుజరావు
ఆం. ప్ర. సాహిత్య అకాడమీ కార్యదర్శులు

ముఖ్యఅతిథులు : గౌ॥ శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడుగారు
మధ్యతరహా నీటి పారుదల శాఖామాత్యులు

"శ్రీనాథ కవితావైభవం" "మేం"-పుస్తకాల ఆవిష్కర్తలు :
డా॥ పాటిబండ మాధవశర్మగారు

**రెండవ సమావేశం 20-10-1974 ఆదివారం**

ప్రతిభామూర్తి : తెనాలి రామకృష్ణుడు

ఉపన్యాసకులు : శ్రీ దాశరథిగారు

అధ్యక్షులు : శ్రీగుంటూరు శేషేంద్రశర్మగారు

ముఖ్యఅతిథులు : గౌ॥ శ్రీ పి. బసిరెడ్డిగారు
పరిశ్రమల శాఖామాత్యులు

మూడవ సమావేశం 3-11-1974 ఆదివారం

ప్రతిభామూర్తి : శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు
ఉపన్యాసకులు : ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు
అధ్యక్షులు : ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు
ముఖ్యఅతిథులు : గౌ॥ శ్రీ పిడతల రంగారెడ్డిగారు
ఆం. ప్ర. ఆర్థిక శాఖామాత్యులు

నాలుగవ సమావేశం 17-11-1974 ఆదివారం

ప్రతిభామూర్తి : కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు
ఉపన్యాసకులు : ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు
అధ్యక్షులు ; 'విశ్వనాథ కవితావైభవం' ఆవిష్కర్తలు :
ఆచార్య డా॥ బి. రామరాజుగారు
ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖాధ్యక్షులు
ముఖ్యఅతిథులు : న్యాయమూర్తులు శ్రీ కోకా రామచంద్రరావుగారు

ఐదవ సమావేశం 1-12-1974 ఆదివారం

ప్రతిభామూర్తి : మహాకవి శ్రీశ్రీ
ఉపన్యాసకులు : డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు
అధ్యక్షులు ; 'కొత్త సాహితీమిత్ర పథకం' ఆవిష్కర్తలు :
శ్రీ కె. వి. గోపాలస్వామిగారు
ఆంధ్ర విశ్వవిద్యాలయ మాజీ రిజిస్ట్రార్
ముఖ్యఅతిథులు ; "ప్రతిభాలహరి" ఆవిష్కర్తలు :
గౌ॥ శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు
విద్యాశాఖామాత్యులు

సిందూరం, శిఖరాలూ-లోయలు, భావన, మెరుపులు,
తిక్కన కవితావైభవం—పుస్తకాల ఆవిష్కర్తలు :
శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు
అధికారభాషా కమీషన్ అధ్యక్షులు

# ఆశంస

## -ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం

యువభారతివారి ప్రతిభాలహరికి ఆశంసలు అందచేయడం ఈమాటు నావంతైనందుకు సంతోషిస్తున్నాను. కాళిదాసు శ్లోకాన్ని-పురాణమిత్యేవ- అనేదాన్ని వ్యత్యస్తం చేస్తే - 'పురాణమిత్యేవ సాధుసర్వమ్ - తథైవ కావ్యమ్ నవమేవవద్యమ్' ఈ విధంగా తయారు కావచ్చును. తెలుగు సామెత 'క్రొత్త ఒహవింత-పాత ఒహరోత' అని ఉండనే ఉంది. ఈ విధంగాఉంది నేటి పాఠకలోకం అభిరుచుల భూత అద్దం. పాఠకలోకమేకాదు యువరచయితృ వర్గం వారి దృక్ సప్తవర్ణికూడా రంగులను వ్యత్యస్తంగానే చూపిస్తూంది. ఇల్లాంటి సాహిత్య కల్లోలంలో యువభారతివారు ఆలోచనాపరులకు 'నిలువ ఇమ్మగు దీవిగా' నిలవడానికి ప్రయత్నిస్తున్నారు. కొంతవరకు కృతకృత్యులవుతున్నారు. ఎక్కడ వీరి కృతకృత్యత అంటే- పాత అంతా చెత్త-క్రొత్త కొంగుబంగారము' అనే మనస్తత్వాన్నుంచి యువసమాజాన్ని మళ్ళించి, ప్రాతలోనూ మేలిమి ఉన్నది. క్రొత్తలోనూ వేలిమిఉన్నది' అనే సమన్వయ మనస్తత్వాభిముఖంగా ప్రస్థానం చేయుంచడానికి కృషిచేస్తున్నారు. ప్రాత క్రొత్తల మేలుకలయికలోనే జీవిత రహస్యం ఉన్నదని వ్యంగ్యంగా ఉద్బోధిస్తున్నారు. ఇదే యువభారతి సందేశం. ధ్యేయం. క్రియాసరణి.

ఈ యుద్దేశంతో వీరు బహువర్ణకిర్మీరితమైన కార్యక్రమాన్ని అమలు పరుస్తున్నారు. నా వంటి పేద జ్ఞాపకశక్తి కలవానికి నిత్యమూ మారే ఆపేర్లు గుర్తుంచుకోడం కూడా కష్టంగానేఉంది. మన కళ్ళముందర లేచిపడుతూన్న జీవనతరంగాలు చాలవా? పాతవాటి బెడదఎందుకు అంటారు యువతరంవారు. నిజమే నాయనా! ఈ జీవనతరంగాలు ఇప్పుడేకాదు, సృష్ట్యాదినుంచీ ఇల్లాగే ఎగిరిపడుతున్నాయి. మానవజీవిత నౌక అనాదినుంచీ మనబ్రతుకు డింగీలమల్లేనే అతలకుతలమయింది అటువంటి ప్రమాదాల్లోంచి ప్రాచీన నావికులుఎల్లా తప్పించుకొని బయటపడ్డారో చెప్పడమే ప్రాచీనసాహిత్య

లక్షణము. ఆ సాహిత్యాన్ని చేతులారా ఎందుకు విసర్జించడము? అంటారు యువ భారతివారు. అది మనకు సులభంగా అర్థముకాదుగదాండి. తలచిట్లంకట్టేటట్టు దానిని చదువకపోతేమీ అంటారు నవతరంవారు. ఆ శ్రమ మీకు కొంత తగ్గించటానికే ప్రతిభాలహరివంటి ఉపన్యాస పరంపర. రుచితెలిస్తే మీరు దానిని వదలరని యువభారతి వారు ఎరుగుదురు. 'జాతాస్వాదః' అని కొంటెమాటను కాళిదాసు జారవిడిచాడు. ఇంకోరహస్యం. ఈ నాడు యువకవి-ప్రియుడు ప్రియురాల్ని గురించి కల్పించే ఉపమానాలు సరిక్రొత్తవి కాదు. వేలకొలది సంవత్సరాల క్రితం వైదికకవి వాసన చూసి విడిచినవే. చూడండి పెళ్ళికొడుకు పెళ్ళికూతురితో సప్తపదిసందర్భంలో ఏమంటున్నాడో—ఆసాత్వంద్యౌరహం పృథివీత్వగ్ం—మనో హమస్మివాక్త్వగ్ం—సామాహిమస్మిఋక్త్వగ్ం" నేను దివిని, నీవు భూమివి. నేను మనస్సును, నీవు వాక్కువు. నేను సామమును, నీవు ఋక్కువు'. ఈ నాడు ప్రేమ గిలిగింతలూ పెట్టగా వ్రాసే యువ కవిమాత్రం ఏమంటున్నాడు. 'ఓ ప్రియురాలా! నేను కలమును, నీవు వ్రాత సాధనమవు' అంటూ జాలు వార్చే కవిత్వం అంత సరిక్రొత్తదా? కొంత నవ్యత ఉండకపోదు. నిజమే అయినా మానవమేధ వేల ఏండ్లనుంచీ రాగద్వేషాల్లో ఇంచుమించు ఒకలాగే పలుకుతూంది. ప్రవర్తిస్తూ ఉంది. ప్రాచీన మానవుని భావావేశము, దాన్ని ఆతడు వ్యక్తీకరించిన భాషా విచ్ఛిత్తియేకదా ప్రాచీన వాఙ్మయము. కొంతకష్టానికి ఓర్చి అయినా దాన్ని అవగతం చేసుకోవడంలో ఆనందంలేదూ? యువభారతి వారి మహోద్యమం ఇదే. దానికి నా హృదయపూర్వక ఆశంసనములు, ప్రతిభాలహరి ఉపన్యాస పరంపర మనకు అందించిన ప్రతిభావంతులను గూర్చి వేరువేరుగా చెప్పడం అధిక ప్రసంగమవుతుంది. వారంతా విద్వాంసులు. భావనాబలమూ, వాక్పాటవమూ కలవారు. ఆయా కవులను గురించి అందంగా సమగ్రంగా చెప్పారు. ఆ కవుల్లో ప్రాచీనులు ఉన్నారు. నవీనులూ ఉన్నారు. ఉభయుల్నీ ఆస్వాదించి తరించండి. *

ప్రతిభాలహరి

# అనుక్రమణిక

# శ్రీనాథుడు

## శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

శ్రీనాథుడు - ఎంత చక్కని పేరు! ఈ పేరు పెట్టిన మారయ్య గొప్ప సంస్కారియై యుండవలెను. తండ్రిని గూర్చి శ్రీనాథుడు "విద్యారాజీవభవు"డని వ్రాక్రుచ్చెను. అనగా విద్యలకు బ్రహ్మ వంటి వాఁడు; చాల పెద్దమాట! ఆ కాల మున విద్యలనగా శాస్త్రములు. మారయ్య సాహిత్యమునకు తోడు శాస్త్రవ్యాసంగము కూడ జేసియుండెనేమో! అతని పేరిట కావ్యమేదియును లేదు; అతడు వ్రాయనే లేదేమో! లేక వ్రాసిన కావ్యము కనపడుటలేదో. చదువుకొన్నంత మాత్రమున రచన చేసి తీరవలెనను నియమ మేమున్నది? చక్కగా చదివికొని కీర్తికండూతి లేని వారిని యెందఱినో నే నెఱుగుదును. మారన్న యట్టివాడేమో! తాతను మాత్రము శ్రీనాథుడు చాల గొప్పగా జెప్పికొనెను. అతడు "వినమత్కాకతిసార్వభౌముడు." "కవితా విద్యా ధరుడు". ఇది బిరుదమో, పొగడ్తయో తెలియదు. "కనకక్ష్మాధరధీరుడ"ట! వారిధి తటమునందున్న క్రాల్పట్టణమును పరిపాలించుచుండిన వాడు. "పద్మపురాణము"ను సంగ్రహీకరించి కవిత్వ మల్లెను. గడచిన దశాబ్దములలో శ్రీనాథుని జన్మస్థాన చర్చలు రేగినవి; 'మచిలీపట్నము'నకు గొంద రీడ్చిరి. కొందరు 'కర్ణాటము'న బడవేసినారు. శ్రీనాథుడు మావాడని నెల్లూరివా రందురు; కొండవీటి రెడ్లు నెల్లూరినుండి తరలి పోయిన వారట! ఆ యభిమానముతో - శ్రీనాథుని తెరకెక్కించి యాడించిరట, ఇంతకు నతడు - దన స్వగ్రామమున నుండెనో లేదో! చూచెనో లేదో! ఒకడెవడో- మర్కటబుద్ధి-శ్రీనాథుని పేరు 'సీనయ్య'యై యుండుననియు - ప్రసిద్ధుడైన తరువాత శ్రీనాథుడుగా మారెననియు వ్రాసినట్లు గుర్తు. ఇది యాశిఖాంతము కొంటెవాదము. సీనయ్య శ్రీనివాసు డగునేగాని, శ్రీనాథుడు గాలేదు.

దగ్గుపల్లి దుగ్గన నాసికేతో పాఖ్యానములో శ్రీనాథుని పాండిత్యము నిట్లు చెప్పి నాడు.

సీ॥ "సంస్కృత ప్రాకృత సౌరసేనీముఖ్య
భాషాపరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమ భాషిత మహా
భాష్య విద్యాసమభ్యాసబలము
నక్షపాద కణాద పక్షిలోదీరిత
న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతి పురాణాగమ స్మృతిసాంఖ్య సిద్ధాంత
కబళన వ్యుత్పత్తి గౌరవంబు

పూర్వకవి ముఖ్య విరచితా పూర్వకావ్య
భావరస సుధాచర్వణప్రౌఢతయును
కందళింపంగ కాశికాఖండ నైష
ధ ప్రముఖ వివిధప్రబంధము లొనర్చి"

పై పద్యములో మహాభాష్య ప్రసక్తి వచ్చినది. ప్రాచీన నవీన తర్కములు చదివిన వాడు. పూర్వోత్తర మీమాంసలు పరిశోధించియుండెను. కొంత వేదాధ్యయనమును.

ఇవన్నియు నట్లుండగా - సంస్కృతములోని ప్రౌఢకవులనందరిని జీర్ణించికొన్నాడు. నన్నయ్యగారి 'ఉభయ వాక్ప్రౌఢి' స్వాధీనమైనది. తిక్కన్న 'రసాభ్యుచిత బంధమును' పసికట్టినాడు; ప్రబంధ పరమేశ్వరుని 'సూక్తివైచిత్రి' దక్కినది. వేములవాడ భీమకవి యొక్క 'యుద్దండలీల' యతని జీవితములో నే యొక భాగము. సంస్కృతములో బాణుడు-మయూరుడు-బిల్హణుడు - ఒకదేల-ప్రౌఢకవులందరును శ్రీనాథుని నాల్కపై నాడుదురు. నైషధములో "మాఘ భారవి వచోమకరంద నిష్యంద మాధుర్యమునకు సమ్మదము నొంది" అన్నాడు; భారవి శ్రీనాథున కందడు. అతడు మహా సంయమన శీలి. మాఘుడు భారవి ననుసరించుటకు యాతన పడిన వాడు. అనుసరింపలేని వాడు. 'హరవిలాస' మందలి కిరాతార్జునీయ కథకు భారవితో సంబంధము లేదు. శ్రీనాథుడు సర్వాంగీణ కీర్తి ఖర్జువు. ప్రతిభకన్న - పాండిత్యమెక్కువ. పై జెప్పిన చదువంతయు శ్రీనాథునకు సుమారిరువదియైదేండ్ల లోపుననే ముగిసి యుండును. ఆ జీవితము ననుసరించి-ఆ చదువు లబ్బుట నా డబ్బురముగాదు. వేదాంత దేశికులు "వింశత్యబ్దే విశ్రుత నానావిధవిద్యః" అని తామే చెప్పికొన్నారు. చదువు తరువాత-శ్రీనాథుడు సంచారము బయలుదేరినాడు. జీవితమంతయు నొకటే ఘర్షణ. స్వాభావికముగా- శ్రీనాథుడు కొంత కచ్చిపోతు. తన ప్రక్కన-తనంతటి వా డొక డుండరాదు. కాశీఖండములో-వింధ్యముతో - శ్రీనాథు డీపద్యము లనిపించినాడు :

తే॥ "శాస్త్ర మాచార్యసన్నిధిఁ జదువఁడేని
నిద్ధ బోధంబు మది సంగ్రహింపఁ డేని
తెగువమీఁటి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతిజయ మందఁ డేని తజ్జనుఁడు జనుఁడె?

ఉ॥ కంటికి నిద్ర వచ్చునె? సుఖం బగునే రతికేళి? జిహ్వకున్
వంటక మిూదునే? యితర వైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబు గల యట్టి మనుష్యున కెట్టివానికిన్
గంటకు; డైన శాత్రవు డొకండు తనంతటివాడు గల్గినన్."

ఈ రెండు పద్యములును సందర్భములో నదుకలేదనుట స్పష్టమే. ఎప్పుడో వ్రాసినవి జోడించినాఁడు. అతని కీ యలవాటు కద్దు. కొండవీటిలో వామనభట్టబాణు డుండెను. అతఁ డొక యుద్ధతుఁడు. శ్రీనాథుఁ డచట నున్నపు డాతనితో స్పర్థ తప్పి నది గాదు. వామనభట్టబాణుడు విద్యానగరమునుండివచ్చి రెడ్డిరాజుల నాశ్రయించి నాడు. అతనికి డిండిములపై నభిమానము; శ్రీనాథుడు డిండిములతో వాదించుట కిదియు నొక కారణము; కవిసార్వభౌముడు రెడ్ల విద్యాధికారి; బహుదేశబుధులతో సంభాషణము. భాషణ మనగా ఘర్షణయే. శాస్త్రము చదువుకొన్నవారి వ్యవహారము చిత్రముగా నుండును. వారి సంభాషణమే పూర్వపక్షములో నారంభమగును. తరువాత కుశలప్రశ్నలు, మర్యాదలు; తాము పరిశ్రమించిన శాస్త్రములందు-వారి యభినివేశము గూడ మూర్ఖము. మనకు నవ్వువచ్చును. ఏ శాస్త్రమును పూర్తిగా రాదు గనుక; ఇంతకును-మొదటి పూర్వపక్షము సల్లాపము మాత్రమే. జెట్టు పరస్పరము భుజములు రాచికొన్నట్లు. జయాపజయముల నిర్ణయము సభలలో; పండితుల యెదుట: రాజునెదుట; సల్లాపములలో "క్రోడపత్రము"ల రహస్యములు బయట బెట్టరు. వానిని విప్పుట వాదములందే. సల్లాపములలో-శాస్త్రసామాన్యవిషయములపై - చర్చ లుండును. భారతములో విరాటపర్వములో నొక ఘట్టము వచ్చును. గోగ్రహణము నకు వెడలిన యర్జునుడు-భీష్మగురుకృపుల చరణములఁ బడ రెండు బాణములు వేసి నాడు. అది నమస్కారము. రెండేసి బాణములు కర్ణముల దూసిపో నేసెను. అది కుశలప్రశ్న. వీరుఁ డిదిగాక మరియేమి సేయును? శాస్త్రకారులు గూడ నంతే; వారును వీరులే. తిరుపతిలో కపిస్థలం దేశికాచార్యపాదు లుండిరి. వారు మహా మహోపాధ్యాయులు. క్రోడపత్రములకు నిధి. అవి లేనిది వాదివిజయము కష్టము. శ్రీనాథుని తలలో నా క్రోడపత్రము లెన్ని యుండెనో? ఇది వాదమునకు పెట్టుబడి. పైని ప్రతిభ. దానికి మెఱుగువెట్టు సమయస్ఫూర్తి; ఇర్వురు పండితులు వాదించునపు డొక మధ్యవర్తి యుండును. అతఁడు వీరిర్వురికంటె కాగవలెను. ఇరువైపులను వారి వారి శిష్యవ్రజముండును. వీరు 'పిన్‌పాటగాండ్రు'; రెండు వైపుల - తాళపత్రగ్రంథముల కుప్పలు; సాధారణముగా శాస్త్రచర్చలు వాచో విధేయములే. అవసరమైనప్పుడు

గ్రంథములనుండి తోడిపండితులా ధారము నెత్తి చూపుదురు. వాదములు సంస్కృతము లోనే; నడుమ నడుమ బూకరింపులు, అఱపులు, పరస్పరావహేళనములు; కొందరి వాదవైఖరి మహాచిత్రముగా నుండును. వారికి సిద్ధాంతగ్రంథములకంటెను పూర్వ పక్ష గ్రంథములపై గొప్ప యధికారము. ఉత్తరాదిమఠస్వాములు సత్యధ్యానతీర్థు లుండిరి. వారు ద్వైతులు. దానశూరులు. వారి కాదిశంకరుల గ్రంథములు కొట్టిన పిండి. వాదములలో శాంకరగ్రంథములలో పరస్పర వైరుధ్యములు జూపెడివారు. పూర్వపక్షమునకే యవకాశమివ్వరు. పీసు జూపించు విరోధముల నెత్తి పోసికొనుట లోనే ప్రతివాదులకు సరిపోవును; ఇది యొక మహా ప్రతిభ. కళాశాలాధ్యక్షులు సుబ్బరావుగా రుండిరి. అదియొక జ్ఞానప్రధానావతారము. వా రే శాస్త్రములో పూర్వ పక్షము జేసినను-సమాధానము వారు చెప్పవలసినదే. అట్టి వాదసభలు కాళిదాసన్నట్లు 'కాంతం క్రతుం చాక్షుషం', అంతే. నే డా వ్యాసంగములు లేవు. ఉన్నవానికి కూడు లేదు. నేడు చదువనగా శబ్దసంచయ సంగ్రహణము. వ్యాసంగమనగా కవిత్వము. నాల్గు పద్యము లల్లినచో జన్మ ధన్య మైనట్లే. నాటి శాస్త్రవాద పద్ధతిని రాయ లిట్లు వర్ణించెను.

సీ॥ "అందులో నొకమేటి కభిముఖుండై యాత
దనిన వన్నియును మున్ననువదించి;
తొడగి యన్నిటి కన్ని దూషణంబులు, వేగ
పడక, తత్సభ యొడవడగ బల్కి
ప్రక్క మాటల నెన్న కొక్కొక్క మాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి
క్రందుగా రేగిన గలగ కందర దీర్చి
నిలిపి, యమ్మొదలి వానికినె మగిడి

తే॥ మరిశ్రుతి స్మృతిసూత్రసమాజమునకు
నైకకంఠ్యమ్మ గల్పించి యాత్మమతము
జగ మెఱుంగగ రాద్ధాంతముగ నొనర్చి
విజితు గావించి, దయ వాని విడచిపుచ్చి.

కం॥ నీవే మంటిని రమ్మం
చావలివానికిని మగిడి, యట్లనె వానిన్
గావించి, యొకడొకడు రా
నా విప్రుడు వాదసరళి నందర గెలిచెన్"

శ్రీనాథు డిట్టి వివాదము లెన్ని జేసెనో! ఈ ఘర్షణలచే నాతని విద్య నిత్య నూతన మైనది. ప్రౌఢదేవరాయల సభలో డిండిమునితో వాదమయ్యెను. సామాన్యము

గాదు. "ఉద్భట" వివాదము. మధ్యవర్తి - చంద్రశేఖరక్రియాశక్తిరాయలు; ఆరు మాసములు వాదము నడచెనట! ఇన్ని దినములు కవిత్వముతో నేమి పోట్లాడుదురు! వారి విహారభూములు శాస్త్రములే. కడపట కవిత్వము. "మధురాంతం సమాపయేత్" అన్నట్లు. నాటి మధ్వపర్తులు కేవలన్యాయైక దృక్కులు. ఒకసారి యక్షోభ్యతీర్థులకు విద్యారణ్యులతో వివాదము. అక్షోభ్యులు మధ్వాచార్యులకు నేరుగా శిష్యులు. మధ్వవర్తి దేశికులు. విద్యారణ్యులు దేశికుల సహాధ్యాయులు. వారిద్వరు కంచిలో చదువు కొన్నారు. వాద మెంతకాలము నడచెనో కడకు దేశికు లిట్లు నిరూప మిచ్చినారు.

"అసినాతత్త్వ మసినాపరజీవ ప్రభేదినా
విద్యారణ్య మహారణ్య మక్షోభ్యముని రచ్ఛినత్"

విద్యారణ్యులతోడి చెలిమి దేశికుల తీర్మానమున కడ్డురాలేదు. శ్రీనాథునినాడు చంద్రశేఖరక్రియాశక్తి వీరశైవపండితులలో మేరుశిఖరము. ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులను మఠములు మూడు-వీరశైవులకు ప్రధానములు. మొదట డిండిమకవితో దేశికులకు కూడ వివాద మేర్పడినది దేశికులు మొదట డిండిముని నోడించిరి. కాని డిండిమము బగులగొట్టించువరకు పోలేదు. వారు విరక్తులు; శ్రీనాథుడు రాజసము గలవాడు. బిరుదు డిండిమము బగులగొట్టించిననే యాతనికి దృప్తిగల్గినది. ఈ విజయ మాతని జీవితములో మట్టమధ్యాహ్నము. శ్రీనాథుడు 'కర్ణాటదేశ కటకపద్మవన హేళి' యైనాడు. బ్రహ్మాండముగా కనకాభిషేకము సాగినది; ఇంతకు చెప్పవచ్చిన దేమనగా శ్రీనాథుడు శాస్త్రములలో గూడ గొప్పవాడై యుండును. మరి యాతడు శాస్త్రగ్రంథ మేదైన వ్రాసెనో! లేదో! తెలియదు.

విద్యాధికారియైన శ్రీనాథునకు దానశాసనములు వ్రాయుటయు నొకపని. ప్రభువుల యాజ్ఞ ననుసరించి యో తన యనుకూలమునుబట్టియో యవి సంస్కృతము నందో తెనుగునందో యుండును. ఆతని దృష్టిలో రెండు భాషలకును భేదమంతగా లేదు. ఆంధ్ర రచనలోని సాహసవిశంకటతలే సంస్కృతమందును. రెడ్డిరాజు వ్రాసిన "మాళవికాగ్ని మిత్ర", "గాథాసప్తశతి", "అమరుకాది" వ్యాఖ్యలలో శ్రీనాథుని కైవాడముండి యుండును. కవిసార్వభౌముని చాటువులు కోకొల్లలు. వేమన పద్యముల తర్వాత శ్రీనాథుని చాటువులకే ప్రశస్తి ఆ చాపల్యములు మనకు గూడ నున్నవి గనుక; కారణ మేమైననేమి! ఆతడు తెనుగు దేశ మంతయు జుట్టినాడు. ఒకసారి కనకాభిషేకము; ఒకసారి కంచములో జొన్నకలి; ఒకనాడు దక్షపురి సాని కూతురు; ఒకనాడు అంకెకురాని దాసరి దాని వక్షోజములపై చూపు; జీవితములోని యెచ్చుతగ్గుల నాత డంతగా మనస్సునకు బట్టించికొనెడి వాడు గాడేమో! ఏ సన్నివేశము గనిపించినను-అన్నిటికన్నను ముందు-పద్యము 'నేనున్నా'నని దూకును. కవిత్వమును జీవితములో నింతగా నడికించికొన్న కవి మరి యొకడు లేడు. అందమే గాదు-అసహ్యము గూడ నాతనికి కవితా వస్తువే. "అగ్గిపుల్లా", "సబ్బుబిళ్లా" యున్నట్లు.

తాత్కాలిక భావము తోచినది తోచినట్లుగా నతనికిఁ దెలియక యే గద్దకు వచ్చును. నేను కవిసార్వభౌముడను గదా! ఈ భావము నా పేర నుండవచ్చునా! ఇతరులు నన్ను గూర్చి యేమనుకొందురు! ఈ జంకుకొంకు లాతని జాతకమునకే లేవు. ఒక వేళ నెవడైన నాక్షేపించినచో-జవాబు తెన్నాలివాడు "ఒకని కవిత్వ మందెనయు నొప్పులు తప్పులు" అన్న బాపతు. రామయమంత్రి భోజన పరాక్రమముపై పద్య మున్నది. "దూడ రేణము", పసిబాలుర శౌచము, రచనల కెక్కినవి. జంగము రాలి వక్షోజముల మధ్య నిఱికికొని బాధపడు లింగమూర్తి రచన యైనాడు. తిరిపెమున కిద్దరాండ్రా! యని సవాలు. భోగము దానికి గాక "మగనాలికి నింత విలాస మేటిక"ని యభావేర్ష్య. "లోని శృంగార మొకింతలేద"ని యతృప్తి. ఇంక నెన్నెన్నో! తా నిత రులను గడుసుగా నన్నపుడు- వారు నొచ్చుకొందురేమో! పాప! మను భావము గూడ నాతని కున్నట్లు లేదు; శ్రీనాథుని దృష్టిలో మగడు చచ్చిన మగువ బ్రదుక రాదు. వారి ప్రస్తావన వచ్చినపుడంతయు 'ముండదీవెన' యనును. 'తలకు మాసిన ముండల'ని చీదరించికొనును. 'విధవ చన్ను'లని వెకిలిగా నవ్వును. కర్ణాటమున నాతడు బడిన పెద్ద కష్టములలో 'విశ్వస్త వడ్డించుట'యు నొకటి; నేను చదివినప్పు డంతయు నొప్పి పడు నొక ఘట్టము గుణనిధి (కా.ఖం. 4.76) కథలో వచ్చును. యజ్ఞదత్తుడు బ్రాహ్మణుడు. అతనికి గుణనిధి కొడుకు. తల్లికి వాడు 'గొడ్డువీగి కన్నకొడుకు'. వాడు చెడి చెటాకులయ్యెను. జూదములు మరిగినాడు. తండ్రి 'గృహ కార్యాంతర వ్యగ్రుడు'. కొడుకును సరిగా విచారించికొనడు. కుమారుని సరిదిద్దుటకు తల్లి యెంతయో ప్రయత్నించెను. వాడు వినడు. పలుమారు బ్రతిమాలినది. కన్న కడుపు. తండ్రికి దెలిసెనా! అగ్గిరాముడు. మేనిరవణము లమ్మి యప్పులకు గట్టెడిది. ఒకసారి తన యుంగర మొక జూదరి వ్రేలి నున్నది. యజ్ఞ దత్తు డిది 'యెక్కడిద'ని ప్రశ్నించినాడు. వాడు నీ కొడుకు జూదమున నోడె నన్నాడు. ఇంటికి వచ్చి 'నా యుంగర మేద'ని బ్రాహ్మణుడు భార్య నడిగెను. సత్యము గద్దకు వచ్చినది. తండ్రి భయముతో అంతకుముందే కుమారు డిల్లు వదలినాడు. బ్రాహ్మణుడు వెంటనే "యొక శ్రోత్రియుని పుత్రిం బెండ్లి యాడి గృహస్థ ధర్మంబు నిర్వర్తించె"ను. కథ కంచికి పోయినది. ఆ తల్లినిగూర్చి యొక మాటా బ్రాహ్మణు డాడ లేదు; అనగా శ్రీనాథుని మనసులో సానుభూతి లేదు. విశంకటములై ధూర్తములైన యాతని చాటువులలో నెన్నియో రమ్యముగా నుండును. ఈ క్రింది దొకటి.

"పంచారించిన నీపయోధరము లాస్ఫాలింతునో! లేక బొ
మ్మంచున్ క్రొంజిగురాకుమోవి బిశిధాత్వర్థం బనుష్ఠింతునో!
పంచాస్త్రోపనిషద్రహస్యపరమ బ్రహ్మస్వరూపంబు నీ
కాంచీదామపదంబు ముట్టుదునొ! యోకర్ణాట తాటంకినీ!"

పద్యము మదగజగమనముతో సాగినది. "ఆస్ఫాలింతునో!" అనుక్రియ కొట్టవచ్చినట్లు "శ్రీనాథుడు" "శ్రీనాథుడ"ను చున్నది; వేసిన దీర్ఘసమాసములోని

యర్థమెట్లున్నను-కూర్పు రమణీయమై అర్థము మరచి, చదువుద మనిపించుచున్నది. చిరకాలముగా నిలుచు తన రచనలో నిట్టి సమాసమును వేయుసాహసము శ్రీనాథుడు-అతనివంటి వారికే యుండును. కవిసార్వభౌముని వ్రాతలలో ప్రధానమైన గుణములు మూడు; వినయము సంయమనములేని సమాస ఘటనము-లాక్షణికములైన ప్రయోగములు-చిత్రములైన క్రియా పదములు; "కులుకు ప్రాయంపు నూనూగు కొదమ యెండ" అను చోట నెండలో కులుకుప్రాయము నూహించుట కష్టమే. "నూనూగు ప్రాయము"ను సరిగా నడుకదు. ఇన్ని చెప్పి మరల 'కొదమ' యెందుకో ! తెలియదు. కాని-అతడా లోచింపడు. మనల నాలోచింప నివ్వడు; ఆ విచిత్రమైన బంధములో మనము కొట్టుకొనిపోదుము. "శిఖల నెన్నడుములు" అనుటయు నిట్టిదే. 'మధ్య' యని యర్థము. 'చిన్నారి పొన్నారి చిఱుత కూకటి' ఇది మరి యొకటి. లాక్షణిక ప్రయోగములు-శ్రీనాథుని జీవనౌషధములు చాలనందుకు "ఆస్ఫాలించు", "పిసాళించు", "అత్తమిల్లు", "జొత్తమిల్లు" ఇత్యాదులు తరుముకొనివచ్చును. శ్రీనాథుని చాల చాకచక్యముగా, సమర్థముగా వాడుకొన్నవారు పెద్దనామాత్యులు; తమ సంయమనమును వదలక శ్రీనాథుని శైలికి లాలిత్యమును జోడించినారు. కల్పనా పాఠము నేర్పినారు. ఆంధ్ర కవితా పితామహులైనారు. పెద్ద నామాత్యుల పశిత్వము-తెనుగులో చాలమందికి లేదు. అది యట్లుండె; కవి సార్వభౌముడు ముఖ్యముగా వాచ్యకవి; ఒక్కొక్కసారి తా నేయు బాణమెవ్వరికిఁ దగులునో గూడ గమనింపడు. ఈ క్రింది పద్యము జూడుఁడు.

శా॥ "కుల్లా యుంచితి, కోక గట్టితి, మహా కుర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్, తిలపిష్టమున్, మెసవితిన్, విశ్వ స్తవడ్డింపగా
చల్లాయంబలి ద్రావితిన్, రుచులు దోసంబంచు పోనాడితిన్
తల్లీ ! కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా ! నేను శ్రీనాథుడన్"

శ్రీనాథుఁడు రాయల దర్శనమునకు పోయెను. చాలకాలము వరకును సన్నిధి చిక్కలేదు; కన్నడమున కర్ణాటదేశాచారము లనుసరింపవలసి వచ్చినది. తలపై తపారము పెట్టినాడు. అంగీ వంటి యొక దుస్తును వేసికొనెను. కన్నడ రాజ్యలక్ష్మితోఁ దన కింతకుముందుఁ బరిచయమున్నట్లెమో చనవుగాఁ జెప్పుచున్నాడు. మంచిదే ఇక్కడ "తల్లీ" యనుచునే, నేను శ్రీనాథుఁడన్ అనిముగించుచున్నాడు. ఒక యశ్లీలార్థము స్ఫురించుచున్నది. ఇది యాత డూహించి యుండడు. ఏదో ధోరణిలో ననివేసినాడు. ఇక్కడతోచు నశ్లీలమును-స్వారస్యముగా గూడ వ్యాఖ్యానించెడు పిచ్చివారిని నేనెఱుగుదును. శ్రీనాథుఁడు మాత్ర మాయర్థమును ముమ్మాటి కూహించి యుండడు. కూడు లేక నానాతిప్పలు పడుచున్నాడుగదా! ఇంతకుముందటి పద్యములో 'పంచారించు' అచ్చముగా రాయలసీమ పదము. "బొమ్మంచు" కంచి పంచెలకు వాడుదురు. అది యెట్లగనే యుండును. "ణిసిచుంబనే" అని ధాతువు. అనగా చుంబింతునా!

యని యర్థము. ఇంతమాత్రమున కీకొండపీడు చేత్రాడవసరములేదు. ఇంతపద మెందు కంటిమా! శ్రీనాథుడు వచ్చినట్లే శబ్దములలో "హితమిత ప్రయోగము" అతని పుట్టుకకే లేదు. శ్రీనాథుని రస వాదమంతయు శాబ్దికమే. "కర్ణాటతాటంకినీ" యనుచున్నాడు. కర్ణాటదేశ స్త్రీలకు వజ్రాలకమ్మలు ప్రత్యేకత. నేడు గాకున్ననాడు. వారికి "వజ్రకరూరు" నందును కృష్ణానది,లోయలయందును పుష్కలముగా వజ్రములు లభించెడివి. శ్రీనాథుడే మరియొకచోట "కర్ణాటకామినీ కర్ణహాటకరత్న తాటంకయుగధాళధాళ్యములకు" అనుచున్నాడు. ఇంత తెనుగు దేశమంతయు చుట్టినను శ్రీనాథునికి - ఎక్కడో లోపల దాక్షిణాత్య స్త్రీలన్నను, కర్ణాటకులన్నను కొంత మంపర మున్నట్లున్నది.

"వసివాళ్వారుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనన్‌గంటిరే!"యని తాను చూచినది చాలదన్నట్లు అందరిని చూడమనుచున్నాడు. తనకుఁ గనకాభిషేకము జరిగిన నేల! ఆ గౌరవముతో నిక్కడ ననేక సామంత దండనాథులతోఁ బరిచయము. మాటిమాటికిని జెవినిబడిన కన్నడపుఁ బలుకుబడులు; అచటినుండి తాను గిల్లుకొన్న క్రియాపల్లవములు; కుమారవ్యాసుని భారతమును గూడ శ్రీనాథుడు జూచియో-వినియో యుండునని నా యనుమానము; ప్రౌఢదేవరాయల కాలమునాడు కుమారవ్యాసు డొక చక్రవాత్య. శ్రీనాథ కుమారవ్యాసుల శైలి నాకేమో వరస్పరమందికొన్నట్లుండును. చూడుడు; తాను భారత మెందు కేరికొన్నాడు? దానికి 'గదగుకవి' సమాధానము.

"తిణికి దనుఫణిరాయ, రామా
యణ దకవిగళ భారదలి, తిం
తిణియ రఘువర చరితెయలి, కాలిడలు తెరపిల్ల
బణగుకవి గళలెక్కిపనె, సా
కెణిసదిరు, శుకరూపనల్లదె
కుణిసి, నగనే! కవికుమారవ్యాసనుళిదవర;
అరసుగళిదువీర, ద్విజరిగె
పరమవేదదసార, యోగీ
శ్వరరతత్వవిచార, మంత్రిజనక్కెబుద్ధిగుణా
విరహిగళ శృంగార, విద్యా
పరిణత రలంకార, కావ్యకె
గురువెనలు, రచిసితకుమారవ్యాసభారతవ"

అల్పకవుల నూరక నవ్వినజాలదు. కుణిసి నవ్వవలె (1.17.18) నట! ఆదిశేషుడు - రామాయణకవుల భారముతో 'తిణికి'నాడట! పురిటినొప్పులు పడినాడని యర్థము; "రాయరహెణి తిహెత్తరె ఊరెల్లతిణుక బేకో!" యని సామెత, సైరంధ్రి - సుధేష్ణ యంతిపురము వైపుగా వచ్చుచున్నది. తిక్కన సైరంధ్రి పోకలేవేరు. అదియన

న్యాదృశము; - కుమారవ్యాసుని సైరంధ్రినిజూచి - "అళుకిదరయమనమ ధనగరుడియ, బరవె గారరు," అంతమాత్రమేగాదు.

"సరసి జాయతదందవనుమో
హరిసి ముంచు పద్మగు యుగవనం
దరసి బీరుతబందు హొక్క శురాజమందిరవు."

సైరంధ్రి కనులు పద్మములకన్న నందముఖగా నున్నవి. భావ మిది. ఇట్టి యల్పతృప్తి యాతనికిఁజాలదు. 'సరసిజముల విశాలమైన యందమును మోహరించి ముంచునవట! యామెలోచనములు; ఏది చెప్పినను వెక్కసముగా చెప్పి కోలాహలము చేయవలెను; శ్రీనాథునకును యీ గుణము సమృద్ధిగా నున్నది. ఎక్కడఁబట్టిన నక్కడ దొరకును. ఒక్క లక్ష్యమును మాత్ర మిత్తును. ఈ క్రిందిపద్యము హరవిలాసములోనిది; "ఉభయ భాషాకవిత్వ ప్రయోగకుశలు" అని మాత్రమే చెప్పికొని తృప్తిపడిన నాల్కనుండి వెడలినది. చిఱుతొండనంబి యింటికొక మిండజంగము వచ్చెను. అతడు తూమెడిక్షు రసముతో శివున కభిషేక మొనర్చునట! దానికిఁ గావలసిన చెఱకు మోవులు చిరు తొండఁ డెత్తి కొనివచ్చుచున్నాడు. బరువు; మోయలేక తికమకలాడుచుండెను. శంక రుడు సాయ మొనర్చినాఁడు. భారమునకు దానును జెమర్చెను. ఈ సన్నివేశ మిట జరుగు చున్నపుడు శివుడు కైలాసమున నుండెను. అచ్చర లాడుచున్నారు. అపు డక్కడను శివుని మేను చెమర్చినది. అప్సర స్త్రీలపై యాసగొన్నాడని పార్వతి యనుమానము; జగజ్జననికిని యసూయ దప్పలేదు. అప్పుడు —

చ॥ "అమరవరేణ్య! ప్రేంకణము లాడెడు వేలుపులేమ జూచి యే
చెమరిచి తంచుఁగేళి సరసీరుహమెత్తి ప్రతాపమొప్పగా
హిమగిరిరాజనందన మహేశ్వరు మొత్తె మధూళికాపరా
గములు శశాంకశేఖరుని కన్నుల మూటను జిందునట్లుగన్."

ప్రతాప మొప్పగా మొత్తిన గిరిజప్రేటునకు శివునకు మూఁడుకన్నులును మంట కెత్తినవి. ఆమె కొంచెము మెల్లగాఁగొట్టి యుండవలసినది. పాపము! కాశీ ఖండము లోను పతివ్రతా ధర్మములలో - మరల నామాటయే యనుచున్నాడు. "మగడు తన్మొత్తిన మార్మొత్తు నలివేణి" ఎపుడైన విసుగుతో కొట్లాడుకొను భార్యా భర్తలను జూచితిమేగాని - కొట్టుకొనుట జూడలేదు; శ్రీనాథుడు జూచె నేమో! అంతమాత్రముతో నాగక మొత్తులాడుకొనువరకు వచ్చినచో - దేవుడే దిక్కు. చెప్పిన దేదియు లేకున్నను ఏదో గొప్పగా చెప్పినా రనిపించు కనికట్టు విద్యయే యీతని రచన. కాళిదాసు నందుకొనవలెనని గంపెశాస. కాని సాధ్యముగాదు; అతనిది సున్నితమైన వీణాగానము. వీణయైనను వితంత్రియైన దట్టుకొనలేదు. శ్రీనాథునిది "ఆర్గన్" వాద్యము. పైపై ననుసరింప వలయుచే దప్ప కాళిదాసు జీవ

నాడి కవిసార్వభౌమునకు జిక్కడు; ఇక భవభూతి తపస్వి. నిలుకడలేని శ్రీనాథున కాతఁ డామడ దూరము; ఎక్కడో యొకచోట, ' గద్గద నదద్గోదావరీవారి'గా - తెర మఱుగు బొమ్మ భవభూతి. ఇక మురారి మొదలైన వారిని, ' వ్యామ గ్రాహ్యము'గా బట్టికొన్నాడు. ఈ క్రింది పద్యము చూడుడు

శా॥ "చంచల్లీలల హస్తకంకణ మణిచ్ఛాయల్ విసాళింప బూ
జించున్ వేమ మహీ విభుండు నవరాజీవంబులన్ కల్వలన్
ప్రొంచత్కాంచన పుష్పకేసరములన్ ప్రాసాద పంచక్షరిన్
మంచుంగొండ యనుంగు పెండ్లికొడుకున్ మధ్యాహ్నకాలంబునన్."

పై పద్యములో నేమియున్నది ? మధ్యాహ్నకాలమున అల్లవేమ విభుడు శివుని పూజించుచున్నాడని యర్థము. శివునకు ' మంచుకొండ యనుంగు పెండ్లికొడు 'కని బారెడు మాట. ఇంక తక్కినవి పుష్పముల పేర్లు ' హస్తకంకణ మణిచ్ఛాయ'లొక సొమ్ము. ప్రాసస్థానములో "చంచల్లీలలు" ఈ పద్యములో పైన పటారము లోన లొటారమని యందరికిని తెలియును. కాని నేనుగూడ యీ పద్యమును బలుమారు చదివికొందును. శ్రీనాథుని రసవాద మిదియే. ఇట్టిదే రాయల దొక పద్యమున్నది.

మ॥ "సొరిదిన్ జేర్చిన తీగమల్లియలు ఖర్జూరంబులున్ పుష్పమం
జరులన్ మామిడి గుత్తులున్ గుసుమముల్ సంపెంగలున్ పచ్చగ
న్నెరులున్ బాళలుగల్గి, రాజనపుఁగాంతిన్ తారుముల్వాపిచే
లరుదార న్నగు పూవుదోటల బలాకానీక దంభంబునన్."

శ్రీనాథునికన్నను గొప్ప చమత్కారమే ; కొన్ని పూవులు, కొన్ని చెట్లు. ఇవన్నియు వడ్లే; జాతులుగూడ, 'రాజనాలు' వడ్లలో నొకరకము. వానికి ముండ్లుండును ; త్రాసు నకును నడుమ ముల్లుండునుగదా ! బరువైన వైపునకది వంగును. చేలకును - పూవు దోటలకును పోటీ పడినది. తక్కెడలోఁ బదార్థములు పెట్టి తూచినారు. రాజనాలు చేలలో నున్నవి. తోటలలో లేవు. అందుచే ముల్లు చేలవైపు వంగినది. పూవుదోట లోడిపోయినవి. ఓడిన తోటలను చేలు 'బలాకానీకదంభము'తో హాస్యమాడు చున్న దట. శ్రీనాథుకు వ్రేలు జూపగా హస్తమునే దిగమ్రింగిన శిష్యులు విజయనగర కవులు. వారికిఁ గవి సార్వభౌమునిపై వలపుగద్దు. తమవాడని కవిసార్వభౌముని పెట్టు బడిపై నొక్కొక డొక్కొక్క వ్యాపారము జేసెను ; శ్రీనాథుని పద్యము జెప్పికొని యానందించినట్లుగా రాయలవారి రచనను వల్లెవేయమే ! యేల ? ఆ కిటుకు బంధ సౌభాగ్యములో నున్నది; అది కొఱవడుటచే కల్పనా సౌగంధ్యమున్నను మన్నన సేయము. ఇట్టిదే భీమఖండములోనిది.

మ॥ హిమవద్భూధర సార్వభౌమవరవిశ్వేశోపహారక్రియా
క్రమ సంతాడిత ఘంటికా ఘణఘణత్కారంబు విన్నట్టి యు
త్తమ పుణ్యుండు, వినండు, ప్రాణ పవనోత్క్రాంతివ్యధావేళ, దు
ర్దమవైవస్వత వాహ్యఘోర మహిషగ్రైవేయ ఘంటాధ్వనుల్.

శివపూజా సమయ ఘంటానాదము విన్నవాడు – యమమహిష ఘంటికానాదము వినడు. ఇది యసలు సంగతి. కాని యీ పద్యములో వాడు జచ్చుచున్నట్లు లేదు. దొడ్డ వివాహ సంరంభము; సైనిక కోలాహలము; అర్థగాంభీర్యములేదని యెవ్వ రెఱుగరు! ఎరిగియు – మాటికిఁ జదివికొందుము, సంతసింతుము. మాయయని తెలిసియు సంసారము ననుభవించినట్లు; అవచితిప్పయ్య కంచిలోనుండెనుగదా! ఆ స్నేహముతో నీతడు పలుమారు కంచికిబోఁయి యుండును. అచటి కంచి యఱవతలను చాల సారులు చూచినాడు. పండ్లు పులిసి యెన్నడో యీ పద్యము వ్రాసిపెట్టుకొన్నాడు.

సీ॥ "ముడువంగ నేర్తురు మూలదాపటికిరా
చికుర బంధములీగ జీరువార
పొన్నపూవుల బోలు పొక్కిళ్ళు బయలుగా
గట్టనేర్తురు చీరకటిభరమున
తొడువంగ నేర్తురు నిడువ్రేలు జెవులయం
దవతంసకంబుగా నల్లిపూవు
పచరింప నేర్తురు పదియారు వన్నియ
పసిడి పాదంబుల పట్టుచీర

గీ॥ పయ్యెదముసుంగు పాలిండ్ల ప్రాకనీక
తరచు పూయుదు రోలగందంపుఁ బసుపు
బందికత్తెలు, సురత ప్రసంగవేళ
కంచి యరవతల సమాస్త్ర ఖడ్గలతలు." (కా· 3. 110)

దీనిని పోగొట్టి కొనుటకు శ్రీనాథున కిష్టములేదు. సమయమును చూచి కాశీఖండములో దూర్చినాడు. దానికి పై, క్రింది, పద్యములతో సంబంధము లేదు. ఒంటి స్తంభము మేడవలె నున్నది. పాండ్యభూపాల శుద్ధాంతములను దాక్షిణాత్య స్త్రీలను చాల చోటులలో నాతడు దడలెను. శ్రీనాథుకు జీవితములో, రచనలో – నెక్కువ లౌల్యము కలవాడనుటకు బట్టిన ప్రతి పద్యమును సాక్ష్యమే. పదలాలస కతడు పెట్టినది పేరు. ఒక మంచిపదము మనస్సులో భాసించినచో – ఒక సమాసము రూపుకట్టికొన్నచో దాని నెట్లైనను పద్యములో బంధింపవలెనని యాతని యుబలాటము. తక్కిన పదములు దానికి పరివార గ్రహములు. ఇక జీవితమందో మహోద్ధతుడు. ఆతని కదృష్టమట్లు కలిసి వచ్చినది. తాను శృంగార ప్రియుడనని ముక్తకంఠముతో

తానే పలుమారు చెప్పికొన్నాడు. వీరభద్ర భూపాలుడు తన్ను బిలిచి నిండుసభలో నిట్లు పొగిడినాడట :

శా॥ "ఈక్షోణి న్నిను బోలు సత్కవులు లే రీనేటికాలంబునన్
దాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ గంధసార ఘుసృణ ద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించన్ గవిసార్వభౌమ ! భవదీయ ప్రౌఢసాహిత్యముల్."

శ్రీనాథుడు దీనికి సంకోచింపలేదు. తన రసికతపై ప్రభువుల నిరూపము బడినదని సంతోషము. కప్పిన జోడుశాలువలలో - నిది మూడవశాలు వనుకొన్నాడు. సమయము దొరికినపు డంతయు - దీనిని బిరుదుగా వాడికొన్నాడు. 'కర్ణాటాంధ్రాధిపుడైన' సాంపరాయఁడు దనకుఁ దారసిల్లినప్పుడు కవి సార్వభౌముడు ఘంటాధ్వనితో—

"అక్షయ్యంబగు సాంపరాయని తెలుంగాధీశ ! కస్తూరికా
భిక్షాదానము సేయురా ! సుకవిరాడ్ బృందారకస్వామికిన్
ద్రాక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించు నవ్వాసనల్."

అని యఱచి చెప్పెను మనకు శ్రీనాథునిపై కోపమెందుకు ? నాటి యభిరుచి యది. శుభశకునములను గూడ గాణిక్యపరముగా (ఆము. 1-18) నన్వయించిన కాలమది. పోయినచోటనంతయు నేయాడుని గనుపించినను దిక్కులేకున్న బహిరంగముగా - దిక్కున్న చాటుగా - చాటు పద్యములు చెప్పిన మనుష్యుడు శ్రీనాథుఁడు ఇట్టివానిని కొందరు "ఛీ ఛీ. శ్రీనాథుడు పరమ శివభక్తుడు. వీరమహేశ్వరుడు. ఏకపత్నీవ్రతుడు. ప్రాణము పోయినను పరకాంతల మొగమును జూడనివాడ"ని వసిష్ఠ వామదేవాదులలోఁ గలుపుటకు మొదలు వెట్టినారు. మరి కొందరిది మధ్యేమార్గము. ఇతడు చెప్పిన చాటువులన్నియు గంధర్వాంగనల పైననేయట ! సంసారి స్త్రీపై చెప్పిన పద్యమొక్కటియు మచ్చునకును దొరుకదట ! చెప్పిన చాటువులన్నియుఁ దప్పక దొఱకినట్లు ; అందువలన - సానుల వరకేగాని - సంసారుల జోలికే బోలేదని యొక సాక్ష్యము. మన సమాజమును నాడును - నేడును జూచుచునే యున్నాము. ఈ కితాబుతో చచ్చిన శ్రీనాథునకుగాని - బ్రతికిన వీరికిగాని లాభమేమో తెలియుటలేదు. ఆ శ్రీనాథుడే దిగి వచ్చి 'నేను మీరనుకునేటంతటి పెద్దమనిషిని కానయ్యోయ్' అని మొరపెట్టికొన్నను - చాలులే నోరు మూసికొమ్మని వీరు గద్దించునట్లున్నది. నారదుడు తీర్థయాత్రల కేగెను. అతడు ఒంటిగా పోలేదు. శ్రీనాథుడు పోనిచ్చునా ? మహతిని ధరించుట కెవ్వరో కావలెనట : పురాణములలో నాతడు మహతిని తానే నిరంతరము ధరించి హరినామ స్మరణ చేయుచుండునని విన్నాము. కళాపూర్ణోదయాది కావ్యములలో నప్పుడప్పు డాతనికి విశ్రాంతి కావలసి వచ్చినది. మగశిష్యులన్నచో-నారదున కిబ్బందిలేకున్నను

శ్రీనాథునకు రోత ; అందుచే ఒక 'తనుమధ్య'ను వెదకి తెచ్చినాడు. ఆ వాఙ్మయముతో శ్రీనాథుని శృంగారము వెల్లివిరిసినది.

సీ॥ "త్రసరేణు పరిమాణ ధాతుధూళీపాళి
యలికంబులకు వింతచెలువ మొసగ
ఘనమైన రారాపు చనుదోయి రాయిడి
నిఱుపేద నడిమికి వెఱపుచూపఁ
దొలుకాఱు మెఱుపు దీగెలబోలు కన్నులు
వడదాఁకి యొక్కింత వాడఁబాఱ
సిందూర తిలకంబు చెమట చిత్తడిఁదాఁకి
యలికభాగంబునం దసలుకొనఁగఁ

తే॥ గనకమేఖల జఘన చక్రమునఁ జాఱ
నీలి బంధంబు నాభిపై నెమ్మివదల
మహతి ధరియించి యొకతనుమధ్య తన్ను
ననుచరించుచు గాంధర్వ మభ్యసింప."

ఆవిడ గాంధర్వ మభ్యసించుకొనుచు వచ్చుచున్నది, నడచుచు నమరముచెప్పి కొన్నట్లు. శ్రీనాథుని యగస్త్యుడు గూడ శ్రీనాథునివంటి వాడేనేమో ! తపస్సేట్లున్నను " మెఱసి లోపాముద్ర మెఱుఁగు పాలిండ్లపై పవళించుట " మాత్రము మఱచినదే లేదు. భీమఖండములో కాశిపై కోపముగొన్న వ్యాసునకు విశాలాక్షి దర్శన మిచ్చినది. ఆమె ' పంచాశద్వర్ష దేశీయ ' ఆమెవర్ణనమిది—

" ఆసమయంబునఁ గాశికానగర సోమవీధికా భవన వాటికా మధ్యంబున నొక్క యింటిమచ్చకంటి పంచాశద్వర్ష దేశీయ పలితసారంబైన వేణికా భారంబు గైవడ, ముదుసలి చక్రవాకంబులతో నెకసక్కెంబాడు వీగుచన్నుల వ్రేగుదనంబునఁ దనతనూ వల్లి జలదరింప గంకణ ఝుణ ఝుణత్కారంబు దోరంబుగా గ్రక్కున గోపుర ద్వారంబు బోరుతలుపు వాయందట్టి, యందియల రవళి తోడంగూడి మట్టియల మ్రోత త్రిభువనంబులు నురుజగొనందేరు గడు పయోలం జరణ పల్లవంబు జూచి, యనంగ ధ్వజ పటకఠోర పాఠీరచ్ఛాయాదాయాదంబులైన వెణదకన్నులు తలచుట్టునుం బలిసి పొలయ, కలమధురవీణాక్వాణ పాణింధమంబైన యెలుంగునెత్తి యో బ్రాహ్మ ణోత్తమా ! శాపము సంహరించి యిటురమ్మని నన్నుఁ జేరబిలిచిన " దట!

శ్రీహర్షుడు నైషధములో నిట్లన్నాడు.
"ఉపసనామేత్య పితుస్స్మరజ్యతే
దినేదినే సాఽవసరేషు వందినాం
పఠ త్సుతేషు ప్రతిభూపతే నలం
వినిద్ర రోమాఽజని శృణ్వతే నలం."

తండ్రి సభలో వంది చారణులు నలునిగూర్చి వర్ణించుచుండగా దమయంతి విన్నది. ఆమె ' వినిద్రరోమ ' యయ్యెను. శ్రీహర్షు డంతలో తృప్తిపడినాడు. శ్రీనాథున కామాట చాలలేదు. ఆతడిట్లు తెనిగించెను.

మ॥ "జనకున్ గొల్వగ వచ్చినప్పుడు తదాస్థానంబులోఁ బాఠకుల్
వినుతప్రౌఢి వసుంధరాధిపతులన్ వేర్వేఱ కీర్తించుచో
వనితారత్నము వీరసేన తనయున్ వర్ణింపగా నున్నత
స్తన భారంబు కెలంకులన్ నినుచు జంచల్లీల రోమాంచముల్."

అట్లే మరియొకచోట హర్షుడు—

"ప్రాణయే బలరిపోరథ భైమీ
శీతకోమల కర గ్రహణార్థం
భేషజం చిరచితాశనివాస
వ్యాపదా ముపదిదేశరతేశః" అన్నాడు.

దీనిని

మ॥ "పవిసంగంబున దాపమొందిన శచీప్రాణేశు కెంగేలికిం
జివురుం గైదువుజోదు వైద్య ముపదేశించెన్ రహస్యంబుగా
నవనీహారపయోమిళన్మలయజస్నానార్ద్రపర్యంతమై
యివతాళించు విదర్భరాజతనయాహృద్య స్తనద్వంద్వమున్."

అని పరివర్తించినాడు. శ్రీనాథుని నైషధములో ప్రసిద్ధమైన పద్య మీక్రిందిది. చాల మంది ' లేసు లేస 'ని చెప్పికొందురు.

చ॥ "పనివడి, నారికేళఫలపాకమునం జవియైనభట్ట హ
ర్షుని కవితానుగుంభములు సోమరిపోతులు కొందఱయ్య లొ
నని కొనియాడనేర; దది యట్టిద; లేజవరాలు చెక్కు గీఁ
టిన వసవల్చు బాలకుఁడు డెందమునం గలగంగ నేర్చునే?"

దీనికి మూలము శ్రీహర్షునిదే. ఆతని శ్లోకమిది.

"యథా యూన స్తద్వ త్పరమ రమణీయాపి రమణీ
కుమారాణామంతః కరణ హరణం నైవ కురుతే
మదుక్తి శ్చే తశ్చేన్మదయతి సుధీ భూయ సుధియః
కిమస్యా నామస్యాదరసపురుషానాదర భరైః."

శ్రీనాథుని శృంగార ప్రియత్వమునకు - లాలసతకు - ఇచ్చిన యుదాహరణములు చాలుననుకొందును.

కాశీఖండ మెట్లున్నను - శ్రీనాథునికి కవులలో పెద్దగద్దె వేసినది శృంగార నైషధము. శ్రీహర్షుడు దీని మూలకర్త. కాశ్మీర నృపసఖా కమల హేళి; చింతామణీ మంత్ర చింతనఫలముగా - కావ్యముచు నిర్మించిన వాఁడు. 'కవికులాఽ దృష్టాఽ ధ్వగమనుధ్వనీనుడు. కాన్యకుబ్జ నగరాధీశునివద్ద నీతనికి తాంబూల ద్వయ గౌరవ ముండెనట ! విద్వద్యోగ్యమగు నాసనప్రాప్తియు; కేవల లౌకిక మర్యాదలతోనే యాతడు దృప్తిపడలేదు. సమాధి శూరుడు గూడ; సాధారణముగా సంస్కృత విద్యార్థులు లఘుత్రయిని, బృహత్త్రయిని చదువుదురు. 'లఘుత్రయిని' యనగా— రఘువంశ కుమార సంభవ మేఘదూతములు. బృహత్త్రయిలో మొదటిది భారవి. రెండవది మాఘము చివరది నైషధము. బృహత్త్రయిలో గూడ హర్షరచనమునకు బెద్దపేరు.

'తావద్భా, భారవే ర్భాతి, యావన్మాఘస్య నోదయః
ఉదితే నైషధేకావ్యే క్వమాఘః, క్వచ భారవిః!'

అని పండితులమాట. ప్రయత్నించి శ్రీహర్షుడు తనగ్రంథములో - వ్యాసునివలె గ్రంథుల నుంచెనట ! ప్రాజ్ఞమ్మన్యులు దనజోలికి రాకుండుటకు; ఆంధ్రమునకు దించిన శ్రీనాథుడు గూడ - దానికించుమించు - అట్టి గౌరవమునే నిలిపినాడు, అనువాదము - పద్యమునకుఁ బద్యముగా నడచినదిగాదు. " మాతృకాను సారంబుగఁ " జేయబడిన రచన. విద్యార్థి దశలోనే శ్రీనాథున కామూలాగ్రము నైషధము బాఠమై యుండును. తరువాత నెంతయో కాలము - దానిని దీరికెగా మననజేసెను. చేసిచేసి - సర్వాంగ సౌష్ఠవముతో బయలువెడలిన యుద్గారము; అందుచే నిది స్వతంత్రకావ్య గౌరవ మందికొన్నది. పినవీరభద్రుఁడు గాబోలు 'శృంగార నైషధము 'ను జూచి 'మా, డు, ము, వు, లు మాకిచ్చి మీ సంస్కృతమును' తీసికొమ్మన్నాడట ! అనగా డు, ము, వు, లు తప్ప తెనుగేమియు లేదని పరిహాసము. శ్రీనాథునిలో తెలుగులేకేమి? యున్నది; కాని యది భారత కవుల తెనుగుగాదు. కన్నడవుఁ బరువము సంతరించుకొని - కనులు మెఱయించు జవరాలు. శ్రీనాథుడు 'ప్రౌఢిమ' వలచువాడు. పలుకగలవాడు. కవిసార్వభౌముడు దప్ప - మరెవ్వరు నైషధమునకుఁ జేయివేసియుండినను - అది కోతిపిల్లయై యుండెడిది శ్రీనాథుడే తన కావ్యమందు 'శబ్దము ననుసరించియు' అనునొక ముక్క వాడికొన్నాడు. అనగా సాధ్యమైనంతవరకు సంస్కృతములోని ప్రయోగములను వదలక - అట్లట్లే దించినాడన్నమాట ! ఒక్కొక్కసారి యాతని యాంధ్రీకరణ శక్తి మనకాశ్చర్యము కలిగించును. హర్షనైషధములో నీశ్లోకమున్నది.

" అక్రాంతశ్రుతి పాఠపూతరసనా విర్భూత భూరిస్తవా
సాది బ్రహ్మముఖౌఘ విఘ్నితనవ స్వర్గక్రియాకేళినా
పూర్వంగాధి సుతేనసామి ఘటితా, ముక్తాను, మందాకినీ
యత్ప్రాసాది దుకూలవల్లి రనిలాందోళై రఖేలద్దివి. "

పూర్వము త్రిశంకునికొఱకు విశ్వామిత్రుడు నూతన స్వర్గమును నిర్మింప నారంభించినాడు. ఇంతలో బ్రహ్మదేవుడువచ్చి మొరపెట్టెను. అలుకమానిన గాధి నందనుఁడా ప్రయత్నమును – అర్థమునకే వదలెను. కుండిన పురమునందలి ప్రాసాదములపై ధ్వజపటములున్నవి. అవి తెల్లగా నాకాశమున నూర్ధ్వ ముఖముగా నెగురుచుండెను. ఆ దుకూలములు విశ్వామిత్రు దర్థము సృష్టించి వదలిన మందాకినీ ప్రవాహమువలె నున్నవట! ఈ శ్లోకము నాంధ్రీకరింపవలెను. తెలుగులో యతిప్రాసల గొడవ యుండనేయున్నది. ఆ పదములే సాధ్యమైనంతవరకు వాడవలెను; మూలములోని రెండవ పాదమును శ్రీనాథుడు గమనించినాడు. హర్షుడు 'యతి'ని గూడ సమకూర్చి యుండెను. వెంటనే 'ద' కారప్రాసముతో రచన యారంభింతమనుకొన్నాడు. 'ప్రాసాద' గాధినందన శబ్దములుండనే యున్నవి. 'ఆవిర్భూత' శబ్దమును యతి స్థానమున కుదింపవచ్చును. 'శార్దూలమే' యిందుకుఁ దగినదని-హర్షుని శాసనము. వెంటనే

శా॥ "వేదాభ్యాస విశేషపూతరసనావిర్భూత భూరిస్తవా
సాది బ్రహ్మముఖౌఘ విఘ్నిత నవ స్వర్గక్రియాముకేళిచే
నాదిన్ గాధి తనూజుచే సగము సేయంబడ్డ మిన్నేఱు ప్రా
సాద స్వచ్ఛదుకూలకైతవమునన్ జాలంగ నొప్పున్‌బురిన్!"

అన్నాడు. ఈ పద్యమును చూచినప్పుడు కొంతనిలిచి నిదానముగాఁ జేసిన రచన యనిపించును. ఇట్టి యుదాహరణములు చాలా జూపవచ్చును. హర్షుడు నలుని వెంట్రుకలను గూర్చి చెప్పుచు-

"స్వవాలభారస్య, తదుత్తమాంగజైః
స్వయంచ మర్త్యేవ తులాభి లాషిణః
అనాగసే శంసతి బాలచాపలం
పునః పునః పుచ్ఛవిలోల నచ్ఛలాత్—"

అన్నాడు. చమరీ వాలములు నలుని వెంట్రుకలతో సామ్యము నిచ్చించినవి. అది ఎన్నటికిని కుదురదు: బాల్యచాపల్యము మాత్రమే. చమరీ మృగములు తమ తోకలను శిశువులను "మీకా కోర్కె తగదు"ని పుచ్ఛవిలోలన వ్యాజముచే బుజ్జగించి పోరు మాన్పించుచున్నవట! హర్షుడే మరల దమయంతీ చికురములను గూర్చి ప్రస్తావించుచు నిట్లు చెప్పెను—

"చికురప్రకరాజయంతితే
విదుషీ, మూర్ధనిసాభిభర్తియాన్
పశునాప్యపురస్కృతే నత
త్తులనా మిచ్ఛతి చామరేణకః"

దమయంతి గొప్ప విదుషి. ఆమె చికురములను తలపైదాల్చి గౌరవించు చుండెను. చామరములు పశువుచేత గూడ పురస్కృతి నందలేనివి. పురస్కృతి శ్లిష్టపదము. అట్టి చామరములను దమయంతి శిరోజములతో నెవడు పోల్చును? ఈ పద్యమును శ్రీనాథుడు సమర్థముగా తెనుగున కుదించినాడు.

గీ॥ "విదుషి యాయింతి తలదాల్చు వెండ్రుకలకు
నహహ యబ్బంగి సాటి సేయంగవచ్చు.
పశువుచేత పురస్కృతి బడయలేక
చాపలంబున వర్తించు చామరములు."

'చాపలంబున' అనునది కవిసార్వభౌము డొనర్చిన గుణాదానము. మరి మొదటి శ్లోకము గతి యేమి? దానిని శ్రీనాథుఁడు వదలి వేసెను. వదలి మరియొక రీతిగాఁ జెప్పినాడు. అది యిది.

క॥ "తలవెండ్రుక లెగఁ గట్టెడు
కొలఁదియు నాన్నృపకుమారకుడు కడిమిమెయిన్
నలుదెసలఁ గరుల గండ
స్థల ఫలకములన్ లిఖించె జయశాసనముల్."

చిత్రవిచిత్రములైన కల్పనలకు, దూరాన్వయ క్లిష్టాన్వయములకు హర్ష నైషధము పెన్నిధి. ఒకసారి యా యలంకారములకుఁ దలయుఁ దోకయు నుండదు. హర్షుని రసనాకండూతితో బోల్చదగిన కండూతి సంస్కృతమున మరి యెవ్వరికిని లేదు. అడుగడుగునను అమృతాంజనము రాచుకొనవలసిన భావములకు హర్షుడు భోషాణము. కాని శాస్త్రనిధి నైకసంప్రదాయమర్మవిజ్ఞాత. అతని వాక్కు 'ఫణిభాషిత భాష్యఫక్కికా విషమ; అనేక తావుల కుండలీకరణమే. తెనుగు కవులలో శ్రీనాథునకు విపరీతమైన నాలుక దురద; కాని యా గురువుముం దిది పనికి రాలేదు. అనేక చోటులలో హర్షుడు యీడ్చియీడ్చి వర్ణించిన ఘట్టములను తలవిదిర్చికొని శ్రీనాథుడు కుదింపవలసియే వచ్చినది. 'శిష్యా దిచ్ఛే త్పరాజయమ్మను'- సామెత శ్రీహర్షున కోడిపోయినది. గురువు గురువే. శిష్యుడు శిష్యుడే.

# తెనాలి రామకృష్ణుడు

## శ్రీ దాశరథి

శృంగార రసాలింగిత
రంగత్కవితానదీ తరంగము. హృదయ
త్వంగద్భుజంగమాంగద
లింగమ్ము తెనాలిరామలింగము దలతున్

—సరస్వతీ సోమయాజి
(పృథుచరిత్రము)

లింగనిషిద్ధు కల్వలచెలిం గని, మేచకకంధరుం త్రిశూ
లిం గని, సంగతాళిలవలిం గని, కర్దమదూషితన్ మృణా
ళిం గని, కృష్ణచేలుని హలిం గని నీలకచన్ విధాతృ నా
లిం గని రామకృష్ణకవిలింగనికీర్తి హసించు దిక్కులన్

—రచయిత (?)

ఉదయం, బస్తనగంబు, సేతువు, హిమవ్యూహంబునున్ జుట్టి రా
విదితం బైన మహిన్ మహాంధ్రకవితావిద్యాబలప్రౌఢి నీ
కెదు రేరీ సరసార్థబోధఘటనా హేలాపరిష్కార! శా
రద నీరూపము రామకృష్ణకవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా!

—విరూరి వేదాద్రి
(పాండురంగ మాహాత్మ్యము)

ప్రతిభామూర్తి యైన తెనాలి రామకృష్ణునిగూర్చి ప్రసంగించ మని యువభారతి వారు కోరగా నేను "రామలింగము తలతున్" అనే పద్యంతో నాప్రసంగం ప్రారంభించడంలో ఔచిత్య మేమి? అని ఎవరైన అనవచ్చును. నావరకు నేనే ఆప్రశ్న వేసికొనవచ్చును. "రామలింగ" నామంలో శివకేశవ అభేదభావం ద్యోతకం కావడం వల్ల ఆ పేరు నాకు ఎక్కువ ఇష్టం. "శివాయ విష్ణురూపాయ, శివరూపాయవిష్ణవే." ఈ అభేదాధ్యవసాయము తిక్కననాటినుండి తెలుగుసాహిత్యంలో కనిపిస్తున్నది.

"కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్

కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదుః వద ప్రభోః మే"

ఈ శ్లోకం తిక్కనగారు చెప్పగా భక్తవత్సలుడైన హరిహరనాథుడు ఆయనదెస దయాళుడైనాడు.

రామలింగశబ్దము రాముడు పూజించిన లింగమని గాక రాముడు మరియు లింగడు- ఈ యిద్దరి సమాహారముగా భావించినచో హరిహర మగును. నాకు కావలసిందీ అదే.

నిజానికి బారసాలనాడు తండ్రిపెట్టినపేరు రామలింగము. 1485 ప్రాంతమున జన్మించిన రామలింగమునకు 1543 ప్రాంతంలో రామకృష్ణనామం వ్యాప్తిలోకి వచ్చింది. అనగా సుమారు అర్ధశతాబ్దం పాటు "రామలింగ" నామంతోనే ప్రసిద్ధుడీ కవి.

అంతకాలం శైవుడుగా వుండి అప్పుడు వైష్ణవమతం స్వీకరించినా అతడు వీరవైష్ణవుడై శైవులను ద్వేషించ లేదు. రామకృష్ణుడై పాండురంగ మాహాత్మ్యము రచించిననాడునూ అతడు శివవిష్ణ్వభేదమును మరువలేదు. పాండురంగమాహాత్మ్యంలో తొలిని 'శ్రీకృష్ణప్రార్థన' 'లక్ష్మీప్రార్థన' 'బ్రహ్మస్తుతి' తరువాత 'శివ,పార్వతీస్తుతులు' చేశాడు. కథాప్రారంభం కాశీపురవర్ణనతో చేశాడు;

"శీతాహార్యసుతాశినీ వికచరాజీవంబు, విశ్వేశ్వర
జ్యోతిర్లింగవిశుద్ధరత్నఖని, మోక్షోపాయదుగ్ధాబ్ధివే
లాతీరావని, డుంఠినామకగజాలానంబు, గంగామృత
స్రోతోనిస్సృతి చంద్రగోళ మన మించుం గాశి శ్రీరాశి యై"

క్షేత్రం, తీర్థం, దైవతం— ఈమూడు ఒకచోట గల పుణ్యస్థలాన్నిగూర్చి— పౌండరీకక్షేత్రమునుగూర్చి - శివుడే పార్వతికి వివరించాడు. "బాలవిధూత్తంసుడు పల్కు మాధవకథాశ్లాఘాసుఖాసక్తుడై." శివునిచే వైష్ణవక్షేత్ర మాహాత్మ్యం చెప్పించిన రామకృష్ణకవి సంకుచితమతతత్త్వం కలవాడు కాడు. నిజానికి శ్రీకృష్ణదేవరాయలవారు తమ "ఆముక్త మాల్యద" ప్రారంభమున శివ, పార్వతులను స్తుతించలేదు. మరి రాయలవారూ, రామకృష్ణుడూ వైష్ణవమతావలంబులే కదా ! తనకావ్యంలో శివస్తుతి చేయనంతమాత్రాన రాయలవారు శివ, శైవద్వేషికానే కాదు. పరమత సహనానికి ఆయనది పెట్టిందిపేరు. ఆయన ఆస్థానంలో శైవకవు లెందరో ఉండేవా రన్నది సువిదితమే కదా! ధూర్జటిని మరువలేంకదా!

ఇంకా లోతుగా ఆలోచేస్తే రామకృష్ణుడు తన పాండురంగ మాహాత్మ్యంలోను, ఘటికాచలమాహాత్మ్యంలోను పాండురంగవిట్ఠలుని వర్ణించునప్పుడు శ్రీమత్పరమ

హంస పరివ్రాజకాచార్య శ్రీ మచ్ఛంకరాచార్య విరచిత పాండురంగాష్టకమును దృష్టి యందుంచుకున్నా దనడానికి కొన్ని ఉదాహరణలు పరిశీలించనగును.

"వెడదకన్నులవాని వెయినామములవాని
త్రేతల వలపించు వెరవువాని,
చిప్పకూకటివాని, చిన్నినవ్వులవాని,
చెరివిన మంచి పించియమువాని
పులుగు తత్తడివాని, పొడవులతుదవాని,
పొక్కిటి వెలిదమ్మిపూవువాని
మినుకుటూర్పులవాని, మిసిమిమేతలవాని,
మెరుగుచామనచాయమేతవాని,
దిస్సమొలవాని; పసికానద్రిప్పువాని,
మురళిగలవాని, మువ్వంకమురువువాని
విట్ఠలాధీశు దలచి తద్విపులమహిమ
నొడువు బ్రామజ్జ్రికీనిడవిడిద్రిపోడ"

—పాండురంగ మాహాత్మ్యము

"చిప్పకూకటిరేక నొప్పు నౌదల మీద
చలిది చిక్కము వింత చెలువు గులుక,
త్రేతలవలపు గొల్పెడు దిస్సమొల హత్తి
గచ్చకాయలతిత్తి రచ్చ సేయ,
మువ్వంకమురువుతో మురళియూదెడు నిండు
సొగసుగోముల చుక్క సొక్కజేయ,
చిరుతనవ్వులడాలు చేనున్నవలమురి
గలమురివెమునకు గళుకునింప,
భైమిదక్షిణదిక్తటప్రాంతభూమి
సకల దివిజులతోడ సాక్షాత్కరించి
పుండరీకుని మనిచిన పాండురంగ
విట్ఠలాధీశు, కోటిరవిప్రకాశు"

—ఘటికాచల మాహాత్మ్యము

ఇవి శంకరాచార్యులవారి పాండురంగాష్టకానికి ఎంత సన్నిహితంగా వున్నవో ఈక్రింది శ్లోకాలు చదివితే తెలుస్తుంది.

"మహాయోగపీఠే, తటేభీమరథ్యా
వరం పుండరీకాయ దాతుం మునీంద్రైః

సమాగత్య తిష్ఠం తమానందకందం
పరబ్రహ్మలింగం భజే పాండురంగం.

తటిద్వాససం నీలమేఘావభాసం
రమామందిరం సుందరం చిత్ప్రకాశం
వరంత్విష్టికాయాం సమస్యన్తపాదం
పరబ్రహ్మలింగం భజే పాండురంగం

ప్రమాణం భవాబ్ధే రిదం మామకానాం
నితంబః కరాభ్యాం ధృతో యేన తస్మాత్
విధాతు ర్వసత్యై ధృతో నాభికోశః
పరబ్రహ్మలింగం భజే పాండురంగం.

శరచ్చంద్రబింబాననం చారుహాసం
లసత్కుండలాక్రాంత గండస్థలాంగమ్
జపారాగబింబాధరం కంజనేత్రం
పరబ్రహ్మలింగం భజే పాండురంగం

కిరీటోజ్జ్వలత్సర్వదిక్ప్రాంతభాగం
సురైరర్చితం దివ్యరత్నైరనర్ఘైః
త్రిభంగాకృతిం, బర్హమాలావతంసం
పరబ్రహ్మలింగం, భజే పాండురంగం.

విభుం వేణునాదం చరంతం దురంతం
స్వయం లీలయా గోపవేషం దధానం
గవాం బృందకానందదం చారుహాసం
పరబ్రహ్మలింగం, భజే పాండురంగం.

'పాండురంగాష్టకం' ఆదిశంకరులరచన కాదేమో! అని శంక వెలిబుచ్చా రొకరు! 'ఆముక్తమాల్యద' రాయలరచన కాదనేవారు లేరా! రామలింగడు రామకృష్ణుడు వేరు వేరనే వారూ మొన్నమొన్నటిదాకా వున్నారు.

చిత్తశుద్ధితో, వైష్ణవముపై గల మక్కువతోనే రామలింగము వైష్ణవం స్వీకరించాడు. ప్రభువులు వైష్ణవులని, వారిప్రాపు గోరి మతం మార్చుకున్నాడనేది నమ్మరాని మాట. ధూర్జటి మతం మార్చుకోలేదే! అతని నెవరు చిన్నచూపు చూశారు? కర్మ, జ్ఞానయుక్తమైన భక్తియోగమును ప్రబోధించిన శ్రీమద్రామానుజ సిద్ధాంతం రామలింగణ్ణి ఆకర్షించింది, ఆభక్తియే ముక్తికి మార్గ మని దృఢంగా విశ్వసించాడు.

మతం మారాడు. అంతే. అయితే రామకృష్ణుడు కవి. మతగురువు కాడు. మతబోధకుడు కాడు. స్వతంత్రుడు. అతని ఆలోచనలను మతసూత్రాలు బంధించలేదు. శ్రీవైష్ణవమతావలంబి అయి కూడా, రామానుజులవారి సిద్ధాంతములను నమ్ముతూ కూడా, తాను తన రచనలలో కాస్త స్వైరవిహారం చేశాడు. రాధాకృష్ణుల ప్రణయాన్ని వైష్ణవం అంగీకరించదు. అయినా ప్రవేశపెట్టాడు.

వల్లభాచార్యుడు తెనాలిరామకృష్ణుని సమకాలికుడు. ఈయన రాయల ఆస్థానంలో కనకాభిషేకం పొందాడనీ అంటారు. గోపికాకృష్ణప్రేమ మోక్షానికి దారి నివ్వగలదని ఈయన సిద్ధాంతం. తెనాలి రామకృష్ణుడు తన పాండురంగమాహాత్మ్యంలో చెప్పిన ముక్తకేశినీకథ ఇందుకు తార్కాణం. ఆవిడ గోపికగా కృష్ణునికై తపమాచరించి సాలోక్య, సామీప్య సారూప్య సాయుజ్యములను పొందింది.

"రాధ్నోతి సకలాన్ కామాం
స్తస్మా ద్రాధేతి కీర్తితా"

రాధామాధవసంగమం ప్రకృతిపురుషుల సంగమం. శ్రీవైష్ణవులు ఆమోదించని రాధామాధవ ప్రణయానికి రమణీయమైన కావ్యత్వాన్ని ప్రసాదించి, తాను ఏదో ఒకే సిద్ధాంతానికి బానిస కాదని రామకృష్ణుడు నిరూపించుకున్నాడు.

అసలు పాండురంగ దెవడు? ఇతడు వైష్ణవదేవుడా? హేమచంద్రుని వాదం ప్రకారం పాండురంగడు శివుడు (పాండురాంగుడు!). మరి ఈ విఠలుదెవరు? శ్రీ R. G. భండార్కర్ విష్ణుతత్త్వం గురించి విపులంగా చర్చించాడు. విఠలుధి పర్యాయపదంగా పాండురంగడు మారాడు. కృష్ణుని అవతారంగా పాండురంగడు రూపొందాడు. పాండురంగడు శుద్ధసత్వానికి ప్రతీక. కనుకనే -

"యెన్నికల్పంబు లరిగిన యేనయేండ్ల
వెలయు ప్రాయంబుగల కౌయ్యవిట్ఠలయ్య"

యెన్నికల్పాలు గడిచినా పాండురంగని వయసు అయిదేండ్లే! మరి ఈ "కౌయ్య" యేమిటి? తెనాలి రామకృష్ణుడు దర్శించిన విఠలుడు దారునిర్మితమూర్తియా? జగన్నాథు డంతేకదా! మరి ఇప్పటి విఠలుడు శిలామూర్తి.

అస లీవిట్ఠలశబ్దం ఎక్కడినుంచి వచ్చింది! పుండరీకుడు మాతాపితృభక్తి పరాయణుడు. అతని భక్తికి మెచ్చి ఆ కృష్ణుడు పుండరీకుని ఇంటికి ఒకనాడు హఠాత్తుగా వచ్చాడట. అప్పుడు పుండరీకుడు తండ్రిపాదసేవలో నిమగ్నుడై ఉన్నాడట. తాను తపిస్తున్నస్వామి వచ్చాడనే ఆనందం మనసులో వున్నా పితృసేవ విడనాడలేక- అక్కడవున్న ఒక ఇటుకను విసరివేసి, దానిపై కృష్ణుని నిలుచోమన్నాడట. మరాఠిలో 'విట్' అంటే ఇటుక- ఇష్టిక. 'ఠల' అంటే నిలుచు అని అర్థం. అలాగే

వుండిపోయాడు పాండురంగడు. అసలీ ఇటుక యెక్కడిది? వృత్తుడనే రాక్షసుడు ఇంద్రుణ్ణి ఇటుకవు కమ్మని శపించాడు. ఆశాపం ప్రకారం ఇంద్రుడు డిండీరవనంలో ఇటుకై అవతరించాడు. ఆ ఇటుకమీదనే విఠలుడు నిలుచున్నాడు. పాండురంగ మాహాత్మ్యంలో నింబార్కుని సనకసంప్రదాయంకూడా కనపడుతుంది. నింబార్కుడు ద్వైతానికీ, విశిష్టాద్వైతానికి రాజీ కుదిర్చాడు. రామానుజులవారు చెప్పిన ఉపాసనకు బదులు ఈయన శుద్ధభక్తికి ప్రాధాన్యం ఇచ్చాడు. ఇతని సిద్ధాంతం ప్రకారం జీవాత్మ పరమాత్మ ఒకటిగా వుంటూ కూడా పరమాత్మ తన భిన్నత్వాన్ని కోల్పోడు. ఇదే సనకసిద్ధాంతం. రాధామాధవప్రణయాన్ని నింబార్కుడు ప్రబోధించాడు. చింతలపాటి యెల్లనార్యుని రాధామాధవ ప్రబంధం ఈసిద్ధాంతంతో వ్రాసిందే అనవచ్చు. పాండురంగ మాహాత్మ్యంలో ఈసిద్ధాంతప్రభావం కనిపిస్తూనే వుంది.

రామకృష్ణుడు వైష్ణవుడైన పిదప కూడా శివద్వేషి కాలేదనడానికి ఎన్నో నిదర్శనా లున్నాయి. ఆతనిలో వైష్ణవం మరీ ముదిరిందనిపించే ఘటికాచలమహాత్మ్యంలో సప్తర్షిపర్యులకు యోగలక్ష్మీనృసింహస్వామి ప్రత్యక్షమైన ఘట్టం వినండి-

"రత్న రాజిప్రదీపవిరాజమాన
మైన యొక్కవిమానంబు గానబడియె"

"వా రంత దద్విమాన
ద్వారము సొత్తెంచి నిలువ దక్షిణదిశగా
చేరి వెసం బ్రసవాయుధ
వైరి నిరీక్షించి ప్రమథవైభవ మెసగన్..."

మరి నృసింహస్వామితో శివు డెందుకు వేంచేసినట్లు? శివవిష్ణువుల కభేదతను చెప్పుటకే కవి ఇక్కడ శివుని ప్రవేశపెట్టాడు.

ఇదంతా నేను చెప్పింది — రామలింగము శైవుడైననాడు విష్ణువును మరువలేదు; వైష్ణవుడైననాడు శివుని మరువలేదు అని నిరూపించుటకే.

ఉద్భటారాధ్యచరిత్రలో ప్రథమాశ్వాసమున మూడవపద్యం :—

"స్వీకృత తల్పరూపు డగు శేషఫణామణికాంతి పర్వి ని
త్యాకరరత్నగైరికమహోద్యుతి బొల్పగు నీలశైలమున్
డీకొనుమేను మేటి జగతీధరధారి, మరాళవాహనున్
సాకిన బొడ్డుతమ్మిగల శౌరి యలర్చుత దేవధీనిధిన్."

ఇది విష్ణుమూర్తిని గూర్చినది. ఎనిమిదవ పద్యం "కలశాంభోనిధి యాడుబిడ్డ"ను గూర్చినది.

"కలశాంభోనిధియాడుబిడ్డ, శశికిం గారాబుతోబుట్టు; వి
ద్యలదేవేరికి నత్త, యజ్ఞపురుషుం డౌ విష్ణునిల్లాలు, శ్రీ
జలజాతేక్షణ ప్రోచుగాత నిరతైశ్వర్యం బకార్యంబుగా
నలఘుప్రాభవు నూరయన్నవిభు దేచామాత్యు నిత్యోన్నతున్."

"ఉద్భటారాధ్యచరిత్ర" తృతీయాశ్వాసంలో ముంజభోజు డంటాడు :—

"విష్ణు డన రుద్రు డనగ వాగ్విభు డనంగ
దగిన నామాంతరంబులు దాల్చి నీవు
భ్రమము సమకూర్తు వెఱుగని ప్రాకృతులకు
నీమహత్వంబు చిత్రంబు, నీలకంఠ !"

ముంజభోజుని మాటలు మన రామకృష్ణునివే. అతనికి త్రిమూర్త్యాత్మకపరబ్రహ్మము ఒక్కడే.

## శృంగారము - హాస్యము - భక్తి

త్రిమూర్త్యాత్మకపరబ్రహ్మమువలెనే త్రిరసాత్మకం తెనాలిరామకృష్ణుని కవిత. ఇతడు కవి. మతప్రవక్త కాడు. ఈనాడు కవికి ఏదోఒకవిధమైన రాజకీయాభిప్రాయ మున్నట్లు ఆనాడు కవికి ఏదోఒకమతముపై ఆసక్తి ఉండడం సహజం. ఈనాడు రాజకీయాలనుండి తప్పుకోలేనట్లే, ఆనాడు మతమును తప్పుకొనగలవారు అరుదు.

రామకృష్ణుడు ఉద్భటారాధ్యచరిత్రములో శైవసిద్ధాంతమును ప్రవచించినా, పాండురంగమాహాత్మ్య, ఘటికాచలమాహాత్మ్యములలో వైష్ణవభాగవతోత్తముల కథలు చెప్పినా, అతడు ప్రథమతః కవి. అతనిప్రతిపద్యంలో కవిత ఉట్టిపడుతుంటుంది.

ప్రతిభామూర్తియైన రామకృష్ణుడు ఏవిషయము తీసుకొని పద్యం చెప్పినా అందు కవిత విద్యుత్తు వలె జిగేలున మెరుస్తుంది.

రామకృష్ణుడు 'లింగపురాణము', 'హరిలీలావిలాసము', 'కందర్పకేతువిలాసము', 'పాండురంగవిజయము' వ్రాసినట్లు చెబుతారు. వానిలోనుండి కొన్నిపద్యాలే అక్కడక్కడా ఉదాహృతాలు. అతని కవితాజీవితంలో మైలురాళ్ళవలె కనిపించేవీ, ఈనాడు లభ్యమవుతున్నవీ మూడే ప్రబంధాలు. (1) ఉద్భటారాధ్యచరిత్రము (2) పాండురంగమాహాత్మ్యము (3) ఘటికాచలమాహాత్మ్యము. 'ఆదిపురాణము', 'ప్రతిపద్యశిరఃకంపము' అనురచనలనుకూడా ఇతనికి అంటకడతారు కొందరు. అవి అలభ్యములు.

ఈమూడు ప్రబంధాలలోను శృంగార, హాస్య, భక్తిరసాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తూనే వుంటాయి. శృంగార, హాస్యములను రసాలుగా అంగీకరించడంలో ఎవరికీ పేచీ లేదు. కాని భక్తి, రసమా ? భక్తి రసం కాదనే వారు చాలామంది వున్నారు

మమ్మటుడు భక్తి, రసం కాదనీ భావమేననీ సిద్ధాంతీకరించాడు. జగన్నాథుడు భక్తికి రసత్వమును ప్రతిపాదించడానికి అనుకూలమైన వాదం లేవనెత్తి ఆఖరికి కిందికి దోశాడు. కాని "ఉజ్జ్వలనీలమణి" కర్తయగు రూపగోస్వామి, మధుసూదనసరస్వతి - ఈఇరువురు భక్తికి రసత్వాన్ని స్థాపించారు.

ఇప్పుడు మనకు అందుబాటులో వున్న మూడుప్రబంధాలలో పాండురంగ మాహాత్మ్యమే విశిష్టమైనదిగా అంతా అంగీకరిస్తారు.

ఉద్భటారాధ్యచరిత్రలో కోమలత్వము హెచ్చు. పాండురంగమాహాత్మ్యములో ప్రౌఢత్వము హెచ్చు.

ఉద్భటారాధ్యచరిత్రలో "ముక్తికామినీ చంచలదృగ్విలాసములు" "ముక్తి కురంగలోచనా కోమల దృగ్విలాసములు" అంటూ కన్నులవద్దనే ఆగిన రామలింగం, పాండురంగమాహాత్మ్యంలో "ముక్తికామినీకఠినకుచద్వయీచలితకాంచమాలిక"వరకు వెళ్ళాడు. కన్నులనుండి చన్నులవరకు ప్రయాణం చేసిన ఆతనిప్రౌఢత్వం పాండురంగ మాహాత్మ్యంలో నిండుగా కనిపిస్తుంది.

అయితే శృంగార, హాస్య, భక్తిరసాలు ఈమూడుప్రబంధాలలోనూ కొంచెం యెక్కువ తక్కువపాళాలలో ఉండనే ఉన్నవి.

## ఉద్భటారాధ్యచరిత్రము-శృంగారము

ఇదిభక్తిరసప్రధానమైన కృతి అయినప్పటికీ శృంగారం ఇందులో మదాలసుని కథ ఆధారం చేసుకుని ప్రవేశించింది :—

"జలరుహగంధి ; నీవదనసన్నిధి పెన్నిధి; నీమనోహరా
త్యలసకటాక్షవీక్షణవిహారము, హారము; నీసుధామిళ
త్కలమృదువాక్యవైఖరులగర్వము సర్వము; నీకపోలని
స్తులకళచెల్మికల్మి యయి తోచెడు నా కిక నెన్నిరీతులన్."

మదాలసుడు, కనకలతకోసం చెందేతాపం ఈపద్యంలో మనోహరంగా వర్ణించబడింది. ఇది విప్రలంభం.

ఈమదాలసునికథకు ప్రాతిపదికలు శ్రీనాథునికాశీఖండంలోని గుణనిధికథ, శివరాత్రిమాహాత్మ్యంలోని సుకుమారునికథ అని చెప్పవచ్చును.

ఈమదాలసుని కథే పాండురంగమాహాత్మ్యంలో నిగమశర్మకథకు ప్రాతిపదిక అయింది.

క్లుప్తంగా మదాలసునికథ యిది :—

కుంతలదేశంలో రత్నగర్భపురికి చంద్రకేతువు, రాజు. ఆ పురిలో ధీనిధి అనే బ్రాహ్మణుడు. అతడు సాక్షాత్తు ధీనిధే. అతని భార్య "మింటిదయ్యముల నేలకు దెచ్చి కుమారుగాంచె." వాడికి మదాలసుడని పేరుపెట్టారు. అతడు పెరిగి పెద్దవాడై శాస్త్ర క్రీడచాలించి కామక్రీడలలో పడ్డాడు. భార్యయైన చంద్రకళతో సంసార సుఖం కాంక్షింపడు. జూదమాడడం, కోడిపుంజులను పోరాడించడం, కామశాస్త్ర ప్రసంగాలు చేయడం వానిపని. ఒకనాడు ఆవూళ్ళోని శివాలయంలో చొరపడి స్వామివారి విభూషణావళులు దొంగిలించి కన్యాకుబ్జానికి పారిపోయాడు. అక్కడ ఒక బేహారికి ఆ సొమ్ములమ్మి డబ్బు చేసుకున్నాడు. ఆ వూళ్ళో వొక సానిబిడ్డ వుంది. దానిపేరే కనకలత. ఆవిడ "విలాస రసదేవత."

చ॥ "చదివెం గామకళారహస్యములు శిక్షం గాంచె వీణాదులన్,
బదిలంబయ్యె సమస్త నాట్యకలనా పాండిత్యహేలన్ మదిన్
గదియించెన్ గరువంబు జాణతనమున్, గాంభీర్యమున్, సిగ్గునన్,
బొదలెన్ బాలిక కేలికాజితమరుత్పూర్ణేందుబింబాస్యయై."

అలాటి కనకలతమీద కన్నువేశాడు మదాలసుడు. ఆవిడకోసం విరహం అనుభవించాడు. ఆ బాధకు అంతులేదు. తన యిష్టసచివుడైన పరభావవేదిని 'మాయాప్రకారభూత'యైన 'కనకలత మాత' వద్దకు రాయబారం పంపాడు. రాయబారం నెగ్గింది. కనకలత కన్నెరికం తనకు దక్కించుకున్నాడు మదాలసుడు. తనవద్ద గల డబ్బంతా ఇచ్చేశాడు. 'లంజియతల్లి' సంతోషపడింది.

"ఉడుగని కామతంత్రముల నూని, మనోజ్ఞము పల్లవింపగా
గడగి వశావశేభపతి కైవడి మత్తమరాళి కాతలిం
బుడికెడు రాజహంస పతిపోల్కి మదాలసు డమ్మృగాక్షితో
నొడబడియుండె సంతతము నొండుతెరంగుల నుజ్జగించుచున్.'

ఇందు సంభోగశృంగారము వర్ణితము.

తనవద్దగల డబ్బంతా అయిపోగా—"కనక మార్జింతు నెన్నిమార్గములనైనను" అనుకొని బయలుదేరాడు. అడవిలో వెళుతున్నాడు. అతడు కడు సుకుమారుడు. అలసిపోయాడు. సొమ్మసిల్లి పడిపోయాడు. ఆదారినే వెళ్ళుతున్న విద్యాపాలుడనే ఒక విద్వాంసుడు మదాలసుణ్ణి చూసి చల్లని నీళ్ళు ముఖాన చల్లి సేదదీర్చాడు. విద్యాపాలునివెంట అతని కుమారుడు కూడా వున్నాడు. తనను మూర్ఛనుండి తప్పించి ప్రాణం కాపాడిన విద్యాపాలుని వద్ద ధనంమూట వుందని కనిపెట్టి, కృతఘ్నుడై తండ్రికొడుకులను చంపి ధనం దొంగిలించి కన్యాకుబ్జము దారిపట్టాడు. కనకలత ఆ ధనం చూచి సంతోషిస్తుందనుకున్నాడు. ప్రయాణంలో దారితప్పి వారణాసి చేరు

కున్నాడు. పురపరిసరాలలోని అడవిలో ఒక పొదలో అలసి పడుకున్నాడు. పాము కాటేసింది, చచ్చాడు. శివుడు ప్రత్యక్షమై మదాలసుని కుడిచెవిలో తారకమంత్రోప దేశం చేశాడు. యముడు పాపియైన మదాలసుణ్ణి నరకానికి తీసుకుపోవడానికి రాగా శివుడు అడ్డువచ్చి "కాశీనగరంలో చచ్చినవాడు నన్నుపోలు"నన్నాడు.

"తేటి ముక్కంట పువ్వు తదీయ రూప
మొందుగతి, సిద్ధరసమున నూని యినుము
కాంచనంబైన క్రైవడి కాశి నీల్గి
పాపకర్ముండు తనుఁబోలు, భానుతనయ!"

ఇక భక్తి:—

"కేతువు నీట ముంచి, తమకించి ధనుర్లత మళ్ళబెట్టి, వి
ఖ్యాత బలంబు చెట్టులకు గట్టి, గుణంబునగల్గు పక్షముల్
వే తలలించి, యంపగమి వేడుక మూలకు ద్రోచి, యమ్మనో
జాతుడు తత్పురిం గలుగు శైవులపై జననోడు నెంతయున్."

"వాసనలేని పూవు, రసవర్ణనలేని కవిత్వ రేఖ య
భ్యాసములేని విద్య, జలజాప్తుడులేని దినంబు, చంద్రికో
ల్లాసము లేని రాత్రి, కమలస్థితి లేనికొలంకు చూవె, కై
లాసనివాసు నాత్మల దలంపని, మూఢుల జన్మ మారయన్."

"వాలుక లెన్నవచ్చు, నుడువర్గము లెన్నగవచ్చు, భూరజో
జాలము లెన్నవచ్చు, నతిచంచలవార్థివికీర్ణవీచికా
మాలిక లెన్నవచ్చు, బుధమండల కర్ణపుటామృతంబు తా
బాలశశాంకశేఖరుని భవ్యచరిత్రము లెన్నవచ్చునే!"

"శైవులగువారు చెప్పిన జాడలందు
నడువనేరదు మూఢుల గడుసు బుద్ధి;
వానపై వాన కురిసిన నానునొక్కొ
సహజకాఠిన్య ముడిగి పాషాణకులము?"

రామలింగమునకు కాశీక్షేత్రములోని హర్మ్యములు సైతము ఈశ్వరరూపముగా కనిపించినవి:

"వలదింద్రోపలఖండదీధితులచేవల్ కంఠహాలాహలం
బులు, సున్నంబులు భూతి, వెల్లపడగల్ మూర్ధస్థిత స్వర్ధునీ
జలపూరంబులు, లోన గ్రుమ్మరుసతుల్ సాబాలుమైగొన్న యా
యలరుంబోడుల యొప్పునై తగు బురిన్ హర్మ్యేశ్వర శ్రేణికిన్"

ఈ కావ్యమంతయు భక్తిరసప్రధానము.

ఇక హాస్యము :—

ఇంతటిభక్తి ప్రధానమైన ఉద్భటారాధ్య చరిత్రములో హాస్యములేకపోలేదు. కనకలత తల్లిని లంజియతల్లి యన్నాడు రామలింగడు. ఆ లంజియతల్లి

"పగలు రాతిరిసేయ, పరగంగ రాతిరి
పగలు సేయగ, గాడ్పు తగిలిపట్టి
నిప్పుక లొడికట్టె నెటిసందు గలిగిన
సావడికొట్టంబు చంకబెట్ట
మున్నీరు తెగనీడ, మన్నుమిన్నుగూర్ప
మంచును గొలువ ధూమంబు దివియ
కన్నుండగా లోనికనపాప వెడలింప
బిట్టుశేషాహివాకట్టుగట్ట
జాతతైలంబు పుట్టింప, చేతిలోన
సకల జగముల నొక్కట సవదరింప
జాలి, యేప్రొద్దు విటులకు జాలి యొసగు
కలకలతమాత మాయాప్రకారభూత"

కనకలతమాత యొక్క అఘటితఘటనాసమర్థత మనకు అచ్చరువు కలిగించుటయే గాక నవ్వునుగూడ పుట్టించును సహస్రఫణముల శేషాహి నోరుసైతం కట్టగలరీతి వాగునట! సందు దొరికితే సావడికొట్టంబు చంకపెట్టగలదట! ఇక ఆవిడ కేకలు మరింత నవ్వు తెప్పించగలవి.

"నేపాళేంద్రుడు మాళవేశ్వరు, దవంతిస్వామియున్ మున్నుగా
భూపాలోత్తము లెందఱేని ధనమింపుంబెంపు దీపింప
రీ పద్మాననకిచ్చి పొందుగొనుకో నేమేమొయంచున్న వా
రా పృథ్వీపతు లిచ్చునీవిదెస నాకాంక్షలేదింతయున్"

యేమికోతలు! నిజంగా అంతటిరాజు ధనమిస్తామంటే కాదంటుందా? దీనికి జవాబుగా 'పరభావవేద' అనేమాట మరీ నవ్వు కలిగిస్తుంది.

"మంచిపనిచేసితివి నీవు, మహిజనుతుల
తోడిజడ్డకు జొలక యో తోయజాక్షి!
మనము సంసారులముగాన మనకు తగిన
వారితోడను పొందు భావ్యంబు సేయు"

'మనము సంసారులము' అంటున్నాడు విటుని చెలికాడు, విటభల్లికతో; 'సమకూర్చున్ నీకు నైశ్వర్యముల్' అని పరభావవేది అనగానే ఆవిడ ఒప్పేసుకుంది. మరి ఐశ్వర్యం రాజులిస్తామనలేదా? ఇక - ఈప్రబంధ నాయకుడైన ఉద్భటుడు శివమానస పుత్రుడు, శాపగ్రస్తులైన గంధర్వులను ముక్తులను చేయుటకై అవతరించిన దయాశాలి తన చితాధూమంతో వారికి మోక్షప్రదానం చేశాడు, కృతిభర్తయైన దేచమంత్రి గురువైన చంద్రశేఖరారాధ్యులవారి వంశ మూలపురుషుడు ఉద్భటుడు.

ఇంతటితో కుమారభారతి బిరుదుగల రామలింగముకథ ముగించి—

"ఉదయం బస్తనగంబు సేతువు, హిమవ్యూహంబునన్ జుట్టిరా
విదితంబైన మహిన్ మహాంధ్రకవితావిద్యాబలప్రౌఢి నీ
కెవు రేరీ? సరసార్థబోధఘటనాహేలాపరిష్కార! శా
రద నీరూపము' రామకృష్ణకవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా"

అని విరూరి వేదాద్రి మంత్రిచే స్తుతింపబడి-

"పలుకుందొయ్యలిమోవికాంతి కెనయే బాగాలు నయ్యొంతిచె
క్కులబోలుం తెలనాకు లయ్యెవిదపల్కుల్వంటికప్రంపు ప
ల్కులతోగూడిన వీడియము" వేదాద్రి

"పద్మనాభార్చనా కలనాపావనహస్తకంకణఝుణత్కారంబు"తో ఈయగా అందుకొని "పాండురంగమాహాత్మ్య"ను మహాప్రబంధం రచించిన శారదారూపుని, తెనాలి రామకృష్ణునివద్దకు వద్దాం.

తెలుగు పంచకావ్యములలో పాండురంగ మాహాత్మ్య మొకటి. ఆంధ్ర సాహిత్యంలో మరపురాని మహాకావ్యం ఇది. రామకృష్ణుని ప్రతిభ శతపత్రమై ఈప్రబంధంలో విప్పారింది. 'నవ్యకవిత్వకళాకలాపం' ఇందు అడుగడుగునా కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. 'పాండురంగ సుకవిపద్యంబుహరువు' ఈ ప్రబంధంలో అంతటా సాక్షాత్కరిస్తుంది.

ఇందు పాండురంగక్షేత్ర మాహాత్మ్యం చెప్పబడింది. ఈ క్షేత్రం రామానుజులవారి సంప్రదాయమునకు చెందినద కాదు. ఇది ద్వైతులయిన మాధ్వులక్షేత్రం. 'కృతిభర్త, కృతికర్త వైష్ణవులై కూడా ఈ అవైష్ణవక్షేత్ర మాహాత్మ్యమునకు ముగ్ధులగుటకు కారణం ఆనాడు విట్ఠలునికి దేశంలో గలవైభవమే. మహమ్మదీయుల దండయాత్రలలో విట్ఠలేశ్వరు దేమైపోవునోయని వెరచి శ్రీకృష్ణదేవరాయలవారు ఆస్వామిని విజయనగరమునకు తరలించినట్లు చరిత్ర చెబుతున్నది.

జ్ఞానేశ్వరుని సమకాలికుడైన నామదేవ్ అనేభక్తకవి విట్ఠలుని 'కన్నడదేవుడు' గా పేర్కొన్నాడు.

''కానడావిఠ్ఠలవో ఉఖాభివరేతీరే''

(కన్నడవిఠ్ఠలుడు భైమీతీరమున నిలచియున్నాడు)

నిజానికి కన్నడుడైనహొయసలరాజు పండరీపురంలో విఠోబాను ప్రతిష్ఠించాడు. విష్ణువర్ధనరాజు (బిట్టిదేవ) హొయసలవంశంవాడు. అతడు తన జైనమతం విడిచి రామానుజులవారి బోధనలవలన వైష్ణవుడైనాడు. అతని సోదరుడైన వీరబల్లాలుడు భీమానదీతీరందాకా హొయసలరాజ్యాన్ని వ్యాపింపజేశాడు. విష్ణువర్ధనుడు మన పాండురంగ మాహాత్మ్యనాయకుడైన పుండరీకుని పండరీపురంలో కలుసుకుని అతని కోరికపై విట్ఠలాలయం నిర్మించడం అసంభవంకాదు. ఆలయనిర్మాత పేరిట ఆలయం వెలయడం ఆనాటి సంప్రదాయం కనుక ఆలయనిర్మాతయైన విష్ణువర్ధనుడు (బిట్టిదేవ) ఆస్వామికి 'విఠ్ఠల' అని నామకరణం చేసివుంటాడు.

ఇది చారిత్రకాంశం. ఇక పౌరాణికంగా చూస్తే పద్మపురాణంలో పండరీపురాన్ని గూర్చి, విఠ్ఠలుణ్ణిగూర్చి ఒకకథ వుంది.

ఒకనాడు విష్ణుమూర్తి తనమందిరోద్యానంలో ఒక సంధ్యాసమయాన విహరిస్తున్నాడు. దూరాన ఒక స్త్రీ కనిపించింది. ఆవిడ తనదగ్గరగా వచ్చింది. తీరా చూస్తే శచీదేవి "ఏమిటీ? ఇలా వచ్చావు? ఇంద్రుడేడీ?" అని అడిగాడు విష్ణువు. "నీపైనమరులుగొనివచ్చాను" అన్నట్లు తనవ్యామోహాన్ని వ్యక్తపరచింది. ఇంద్రుని ధర్మపత్నిని తాను లేవతీసుకుపోవడమా? విష్ణువు ఆశ్చర్యచకితుడయ్యాడు. మనస్సును చిక్కబట్టుకున్నాడు. "ఇది జరిగే పనిగాదు. పరభార్యాహరణం నావల్లకాదు" అన్నాడు. కాని ఆమెలోని తపన అతన్ని కదల్చివేసింది. ఆమెను శాంతింపజేయడంకోసం ఒక పథకం వేశాడు. నీవు మరోజన్మలో రాధవై పుడతావు. నేను కృష్ణుణ్ణయి నీకు విధేయుణ్ణవుతాను" అన్నాడు.

ఆప్రకారమే శచి, రాధగా అవతరించింది. కృష్ణుడు రాధను ప్రేమించాడు. వారు బృందావనంలో వెన్నెలరాత్రులు గడుపుతున్నారు. ఒకరిని విడిచి ఒకరు ఉండలేకపోతున్నారు. ఇది రుక్మిణి పసికట్టింది. చిన్నతనంలో మధురలో కృష్ణుడు రాధతో చనువుగా వుండేవాడని ఆవిడకు తెలుసు. కాని ద్వారకలోసైతం వారిప్రేమకలాపం దినదినాభివృద్ధి గాంచుతుందనీ అనుకో లేదు. కాని అనుకోనిదే జరిగింది. ఆకోపంతో ఆవిడ డిండీరవనానికి వెళ్ళి తపస్సు ప్రారంభించింది. అంతఃపురంలో రుక్మిణి కనపడకపోయేసరికి కంగారుపడి వెతకడంప్రారంభించాడు. ఆఖరికి డిండీరవనంలో తపస్సుచేస్తున్న రుక్మిణిని చూశాడు. ఆవిడ నిమీలితనయనయై పద్మాసనంలోవుంది. అతనిరాకను గుర్తించనేలేదు. కృష్ణుడు నచ్చచెప్పడానికి చాలాప్రయత్నించాడు. లాభించలేదు. తపస్సుకు ప్రతితపస్సు తాను ప్రారంభించాడు. నడుముపై చేతులుపెట్టుకుని రుక్మిణిపైనే

దృష్టినిగిడ్చి నిలుచుని వుండిపోయాడు. అలా ఇరవైయెనిమిదియుగాలు నిలుచునే వున్నాడు. పుండరీకుడు కలుగజేసుకోకపోతే అతపస్సు ఇంకా యెంతకాలం సాగేదో!

"అహం భక్తపరాధీనో
హ్యస్వతంత్ర ఇవ ద్విజ!"
(శ్రీమద్భాగవతం)

భక్తునిమాట వినకతప్పలేదు.

శ్రీకృష్ణదేవరాయలవారు పాండురంగవిఠలుణ్ణి విజయనగరానికి తరలించినట్లు ఇంతకుముందు పేర్కొనివున్నాను. మహమ్మదీయదండయాత్రలకు గురికాకుండా కాపాడడంకోసం భద్రమైనచోట స్వామినిఉండవలెననే ఉద్దేశ్యంతో విజయనగరంలో చక్కని విఠలాలయం నిర్మించి అందు ప్రతిష్టించారు. అయితే ఒకరోజు పండరీపురవిఠలదేవాలయంలో ఉదయం స్వామిదర్శనార్థం భక్తులురాగా గర్భగుడి చిన్నబోయివున్నది. స్వామి లేడులేడని భక్తులు ఆక్రోశించారు. కృష్ణదేవరాయలవారు ఎత్తుకుపోయారని వదంతులు పుట్టాయి. భానుదాసనేభక్తుడు "నేను విజయనగరం వెళ్లి స్వామిని తిరుగా తీసుకువస్తాన"ని బయలుదేరాడు. వృద్ధుడు విజయనగరంచేరడానికి పదిహేనుదినాలు పట్టింది. స్వామి ఆలయంలో ప్రవేశించి ఆయనపాదములపైపడి ఏడ్చాడు. పండరిపురంరమ్మని బ్రతిమిలాడాడు. స్వామి చిరునవ్వుతో భానుదాసునిమెడలో తులసీమాలవేసి అతన్నిఓదార్చాడు. పండరిలో భక్తులు నిద్రాహారములు మాని స్వామికై పరితపిస్తున్నారు. నిజమే. కాని రాయలవారుకూడ తనభక్తుడే. ఎట్లా వెళ్లడం? విశ్రాంతితీసుకోమని భానుదాసుకు సలహా ఇచ్చాడు. భానుదాసు, తనకు స్వామి కనిపించాడే అనేఆనందంతో తృప్తుడై ఆలయం వెలుపట పరున్నాడు. ఇంతలో పూజారులు వచ్చిచూడగా, స్వామివారిమెడలో రత్నహారంలేదు. ఎవరో దొంగిలించారని వెతుకుతుండగా భానుదాసుమెడలో కనిపించింది. నేరస్తుడుగా నిర్ణయించి రాజు భానుదాసును శూలానికి దిగవేయమని ఆజ్ఞాపించాడు. భటులు భానుదాసును శూలంవద్దకు తీసుకొనిరాగా, అది కొమ్మలతో, ఆకులతో, పూలతో విరాజిల్లసాగింది. ఆసంగతి రాజుకు తెలిసి భానుదాసు నిజమైన విఠలభక్తుడనిగుర్తించి, తనతప్పిదానికి చింతించి, భానుదాసునకు సాష్టాంగప్రణామ మాచరించి నవరత్నఖచితమైనపల్యంకికలో స్వామివారివిగ్రహాన్ని వేంచేపుచేసి ఏకాదశినాటికి చేరేలాగున పండరీపురానికి పంపించాడు. ఇప్పటికీ ప్రతిఏకాదశినాడూ - స్వామివారు పండరికి తిరిగి వచ్చిన జ్ఞాపకార్థం ఉత్సవం జరుగుతున్నది.

పదహారవశతాబ్దపు కన్నడసాహిత్యంలో పండరిపురాన్నిగురించి, విఠలుణ్ణి గురించి చెప్పబడివుంది. కన్నడము, తెలుగు ఆనాడు అక్కచెల్లెళ్ళవలెఉన్న భాషలు కనుకను: పరిపాలకులైన తుళువాన్వయరాజులకు విఠ్ఠలుడు అభిమానదైవమగుటవలనను, ఇరుప్రాంతములప్రజలకు విఠ్ఠలునిపైభక్తి, ప్రపత్తులు హెచ్చుగా నుండుటవలనను, పండరిమధ్య సంప్రదాయక్షేత్రమైనను వైష్ణవులు విఠ్ఠలుని కృష్ణునిగా, విష్ణువు అపరావ

తారముగా స్తుతించిరి. వీరూరి వేదాద్రియు. మనరామకృష్ణుడును, వైష్ణవ మతావలంబులు గనుక సాక్షాత్తు కృష్ణుడే ఆయన విఠ్ఠలుని చరిత్రమును వ్రాయుమని కృతిభర్తకోరుట. కృతికర్తరచించుట సమంజసము.

## విఠోభావిగ్రహం

షుమారు నాలుగడుగులయెత్తైన శిలావేదిక పై స్వామివిఠ్ఠలుడు నిలిచివున్నాడు. నల్లనిరాతి, మూలవిరాట్టు మూడున్నరఅడుగులయెత్తుండును. అది సున్నితమైనశిల్పము కాదు. నున్నదనము లేదు. స్వామివారితలపై శివలింగముండును. కంఠసీమను కౌస్తుభ మాల, వక్షస్థలమున శ్రీవత్సలాంఛనము, శివలింగము తలపాగావలె నుండును. కిరీటము పలెనుండదు. చెవులకు పెద్దపెద్దమకరకుండలములు. స్వామి ద్విబాహువు. వామ హస్తము, శంఖము, దక్షిణహస్తమున కమలనాళము రెండుచేతులు నడుముపై నిలిపి యుండును. నితంబః కరాభ్యాం ధృతః.

## పాండురంగమాహాత్మ్యము

ఈవైష్ణవప్రబంధం శివుని నోట వెలువడినదే. కాశీవర్ణనతో ప్రారంభమౌతుంది. అగస్త్యుడు దక్షిణదిగ్యాత్రచేస్తాడు సభార్యుడై. తుంగభద్రవద్దకు వస్తాడు.

"నటనోద్భటుడైన మహా
నటుని జటాజూట మురిలినం దొరగు మరు
త్కటకనది యిది యనుచు జని
యట గనియెన్ తుంగభద్రనఘముఖముద్రన్."

శివునిజటాజూటంనుంచి పడిన ఆకాశగంగవలె ఉన్నదట తుంగభద్ర!

"గంగాసంగమ మిచ్చగించునె, మదిన్ కావేరి దేవేరిగా
అంగీకార మొనర్చునే, యమునతోనానందమున్ బొందునే!
రంగత్తుంగతరంగహస్తముల నారత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించునేని గుణభద్రా! తుంగభద్రానదీ!

శివునిభార్యయైన గంగను సముద్రుడు కోరడు; కావేరి సాక్షాత్తు అగస్త్యునిభార్య. కనుక ఉపాదేయము కాదు. యమున కృష్ణునికి సంబంధించినది, పైగా అది గంగలో కలిసిపోయి నది. సముద్రందాకా వెళ్ళదు, అసలు తుంగభద్ర సముద్రం దాకా వెళుతుందా? వెళ్ళదు. కృష్ణలోలీనమైపోతుంది. రామకృష్ణుడికి తుంగభద్రఅంటే చాలామక్కువ.విజయనగరం తుంగభద్రాతీరముననేకదా ఉన్నది!

"ఓపున్ భూపదిధిం గల, యాపగలకు బాహ్యతాప మాపగ! నీవే
యోపుదుగా యంతర్గత, తాపత్రయ మడపనోయుదన్వన్మహిళా!"

"అన్నినదులు బాహ్యతాపమునుమాత్రమే ఆర్పగలవు. నీవో! అంతర్గతతాపత్రయ మడపగలవు" అంటున్నాడు కవి. తుంగభద్రకు విశిష్టతను చేకూర్చినాడు కవి.

## పుండరీక మహాముని చరిత్ర

"చలిచీమనేనియు చాద్రొక్క శంకించు" అహింసామూర్తిపుండరీకుడు. "నిగమ ఘంటాపథైకాధ్వనీనబుద్ధి" వేదమార్గాన్ని అనుసరించి నడిచేవాళ్ళలో ముఖ్యుడు. మాతాపితరుల సేవించువాడు. "పితృ, దేవకార్యాన్ నప్రమదితవ్యం" (తైత్తిరీయోపనిషత్తు: శిక్షావల్లి) ఇతనికిపూర్తివిరుద్ధము నిగమశర్మ.

"నిగమశర్మాభిధానంబు నేతిబీర
కాయయునుబోలె నయథార్థగాథ దాల్చి"
"దుర్వ్యవహారపునడవడి" కలవా డితడు,

రామకృష్ణుడు ఈరెండుకథలను వ్యత్క్రమముగా చెప్పెను.

దివానిశలవలె, ఒకేనాణెమునకు రెండుప్రక్కలవలె మానవప్రకృతిలోని మంచి చెడులకు రూపకల్పన చేయుటకే రామకృష్ణుడు ఈరెండుకథలు వ్రాశాడు. నిజానికి పుండరీకుడు, నిగమశర్మ ఒక్కడే అని శ్రీ డి. చిన్నకృష్ణయ్యగారి అభిప్రాయము ఒకవ్యక్తిజీవితాన్ని రెండుభాగములుగా కవి చెప్పాడు. అంతే.

"నీపితృభక్తికి, జ్ఞానశక్తికి మెచ్చితి" అన్నాడు పుండరీకునికి కృష్ణుడు. ప్రత్యక్షమై.

"వేడుకొ మ్మిచ్చెద చెచ్చెరన్వలయు నీప్సితముల్ శతమేని" అన్నాడు. కాని పుండరీకునికి ఏమీ అక్కరలేదు. "నీవే నాకు కావాలి" అన్నాడు.
ఈసందర్భంలో 'అమ్జద్' రుబాయీ ఒకటినాకు జ్ఞాపకం వస్తున్నది :—

దోదిన్ కెలియే దౌలతె దినియా మాంగూఁ
యా తుఝ్‌పె కరీమ్‌సె మైఁ ఉఖ్బామాంగూఁ
మైభీ థోడీ బొహత్ సమఝ్ రఖ్తాహూఁ
ఆఖిర్ తుఝ్‌సే తేరేసివా క్యా మాంగూఁ?"

దీనికి నాఅనువాదం—

"రెన్నాళ్ళప్రపంచసుఖం యెట్లడిగేది?
ని న్నాస్వర్గసుఖాలను యెట్లడిగేది?
ఉన్నదిలే! నాలోనూ కొంతవివేకం!
'నిన్ను'గాక వేరేదీ యెట్లడిగేది?"

ఇదే భక్తియోగం (అహైతుకీభక్తి)
శ్రీమద్భాగవతంలో కృష్ణపరమాత్మ:—
"నయోగసిద్ధి ర్న పునర్భవంతా
మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్"
"నాకు ఆత్మ నర్పించినవాడు నన్నుగాక వేరేదీ కోరడు"—అని.

"క్షేత్రకులరాజమైన యీ క్షేత్రమునకు
తీర్థకులరాజమైన యీతీర్థమునకు
నిఖిలసురనాథః కర్తృత్వనియతి బొదలి
యీ విట వసించుటయ వరం బిచ్చుట—"అన్నాడు పుండరీకుడు.

"శీతాహార్యకుమారి! విన్మిటుల లక్ష్మీజాని వాచంయమ
వ్రాతశ్రేష్ఠునకున్ వరం బొసగి, సాంద్రప్రీతినచ్చోన మ
ధ్యేతీర్థంబున నున్నవా డిపుడు. భక్తిన్ ముక్తి నీజాలు వి
ఖ్యాతిందాల్చి, విచిత్రరత్నచయరమ్యస్వర్ణహర్మ్యంబునన్"
అని శివుడు పార్వతితో చెప్పాడు.

" .........ఆ నవనీతచోరు, నే
బాయనిభక్తితో గొలుతు బ్రత్యహమున్ గృహదైవతంబుగా"
అన్నాడు శంకరుడు.

పుండరీకునికి పితృసేవలవల్లను, తపోయోగమువల్లను ముక్తికలిగింది. ఎన్నో పాపాలు చేసినా నృసింహక్షేత్రంలో సంగమతీర్థంలో చనిపోవడంవల్ల నిగమశర్మకు ముక్తిలభించింది.

"నాల్గుచేతులు కాంచననలినమాలి
కలు వెడదకన్ను లాస్యప్రభలు జెలంగ
కుముదు డనుపేర పరమేశు గొలిచి నిలిచి
యున్నవా డాత డిప్పుడు".

సన్మార్గవర్తియైన పుండరీకుడు హరికి పార్శ్వచరుడైనాడు. "పార్శ్వచరులలోన హరికి కుముదుండు మాననీయత వహించు" పాపులను, పుణ్యులను హరి అనుగ్రహించాడు. పుండరీక, కుముదము లొకచో చేరినవి. పుండరీకుడు, నిగమశర్మ ఒకరే అను వాదము అర్థరహితము కాదు, కు-ముదము—చెడువలని మోదము (నిగమశర్మ).

## నిగమశర్మకథ

కళింగదేశాభరణమైన పీఠికాపురంలో సభాపతి అనే ద్విజుడు. అతని కుమారుడు "వనితామాననసూనసాయకుడు" నిగమశర్మ.

"కంబుభృత్పాదోదకంబు గ్రోలడుగాని
యౌవతాధరశీధు వాని చొక్కు"

అతడు ముండలముఠాకో రైనాడు. ఆస్తిఅంతా పాడుచేశాడు. అప్పులపాలైనాడు. అతన్ని దారికి తేవాలని అతని అక్క భర్తతో పిల్లలతో వచ్చింది. తలంటి పోయించి- మంచిబట్టలు కట్టించి, మనోజ్ఞభోజనం పెట్టింది. "ఇలా చెడుతిరుగుళ్లు మంచిది కాదు" అని బోధించింది. ఆవిడమాటలకు మనసుమారినట్లు నటించాడు. బుద్ధి కలిగిఉన్నాడు. ఇలా నమ్మించి "అద్దురాచారశీలుడు సర్వధనములు ఊచముట్టుగ నిలుదోచి" పారిపోయాడు.

"శోకించువృద్ధభూసురు డాత్మపితృదత్త
దర్భముద్రికకు జిత్తంబు కలగి
అత్తగా రిచ్చిన హరిసుదర్శనపు పే
రునకు ముత్తైదువ వనటబొందు,
కొత్తగా చేయించుకొన్న ముక్కరకునై
యడలు దుర్వారయై ఆడుబిడ్డ
జామాత వెతనొందు వ్యామోహియై నవ
గ్రహ కర్ణవేష్టన భ్రంశమునకు"

నలుగురు నాలుగురకాలవస్తువులు పోయినందుకు బాధపడ్డారు. వృద్ధభూసురుడికి దర్భముద్ర చాలా పవిత్రమైనది. హరిసుదర్శనపుపేరు (అదీ అత్తవా రిచ్చింది) ముత్తైదువకు చాలా కావలసినది, కొత్తగా చేయించుకున్నముక్కర ఆడుబిడ్డకు మంగళప్రదమైనది. నవగ్రహకర్ణవేష్టనం పోయినందుకు అల్లుడువ్యామోహియై వెతనొందడం సహజం. అయితే సాధారణమైన ముక్కరకోసం ఆడుబిడ్డ అడలింది అనడంలో రామకృష్ణుని కొంటెతనం, హాస్యం వున్నాయని వొకరంటే, "అది సౌమంగల్యానికి ప్రతీక. అదిపోవడం అమంగళకరం. అందులో కవి కొంటెతనమేమీ లేదని" ఒకరన్నారు. ప్రతిభావంతుడైనకవి నర్మహాస్యాన్ని అంతర్గర్భితంగా వుంచి ఉదాత్త విషయాన్ని గంభీరంగా చెప్పగలడు. అది రామకృష్ణుని సొత్తు.

సరే. ఆ ధనమంతా మోసుకొని నిగమశర్మ అడవిదారిని పోతుంటే దొంగలు చితకకొట్టి అదంతా దోచుకున్నారు. రక్తసిక్తాంగుడై పడివున్న నిగమశర్మను ఒక రైతు చూసి, దయతలచి ఇంటికితీసుకువచ్చి చికిత్సచేసి ఆరోగ్యవంతుణ్ణి చేశాడు. "తల లోపల నాలుకగా, పూసలలో దారంబు, పాలజల్లిన నీరుంబలె" ఆయింట్లో నిగమశర్మ భయభక్తులతో వున్నాడు. ఆ యింటికోడలుకు పీడిమీద మోజు హెచ్చింది. ఈబంగారు కుండ సులభంగా దొరికిందని మిత్రద్రోహియైన నిగమశర్మ ఆయువతిని మచ్చికచేసుకున్నాడు. అది కంచంత కాపురం, పాలవంటికులం వదలి, మగణ్ణి విడిచి "రెండవ

మగనివెంట'' పారిపోయింది. దూరాన ఒకపట్నంలో బోయకులంలో కలిసి జీవిస్తున్నారు. కొన్నాళ్ళకు అది చచ్చింది. అప్పుడు ఒక ప్లవకన్యనుకూడి కాలక్షేపం చేశాడు. అప్లవకన్యద్వారా పుత్రులను కన్నాడు. ఒకనాడు అడవికి వేటకువెళ్ళి ఇంటికి తిరిగివచ్చేసరికి ఇంటికి నిప్పంటుకుని అందు భార్యాబిడ్డలూ కాలి మరణించారు.

"ఎల్లరు నెల్లచో ధనము లిచ్చి మృగాక్షుల గొంద్రుగాని యో
పల్లవపాణి! యేఁ బరమపావనవంశము నిచ్చి కొంటి నీ
నల్లనిరూపు నిక్కమని నమ్మి, ధ్రువం, బదిగాక నేడు వి
ద్యుల్లతికాధికాభినయధూర్వహ మోట యెరుంగ నింతయున్"

తన పరమపావనవంశము నిచ్చి దానినల్లనిరూపును నిక్కమని నమ్మికొన్నాడట! యేడుస్తున్న ఆ నిగమశర్మమాటలు నవ్వునే కలిగిస్తాయి. అది రామకృష్ణుని చమత్కారము. అతడు నృసింహక్షేత్రంలో (సంగమతీర్థంలో) స్నానంచేసి, స్వామిని దర్శించి యేడ్చియేడ్చి మరణించాడు. ఆ క్షేత్రమాహాత్మ్యము వలన ముక్తుడయ్యాడు. ఇక్కడ నృసింహక్షేత్రమును పేర్కొనుట, అప్పటికే తాను ఘటికాచలమాహాత్మ్యము వ్రాయు సంకల్పమును కవి కలిగియున్నాడనవచ్చును.

రామకృష్ణుని రచనాప్రౌఢిమకు నిదర్శనముగా నిగమశర్మోపాఖ్యానములోని ఈ పద్యమును దాహరించిన చాలును. భార్యాపుత్రవియోగంతో తపిస్తున్న నిగమశర్మ సంగమతీర్థంలో స్నానంచేసి నృసింహస్వామిని పలుమారు చూచుచు తాదాత్మ్యం పొందాడు. ఇందు నిగమశర్మ చేష్టలు దశావతారములతో పోల్చబడినవి-

"ఒకయింత రెప్పవేయక చూచు పెరవారి (మత్స్యావతారం)
తలగొట్టుకొని దుఃఖజలధి మునుగు (కూర్మావతారం)
బిలము తెఱవు మంచు బృధివిలో చొరబారు (వరాహావతారం)
సముధిక స్తంభోద్భవము గమించు (నారసింహావతారం)
తిరియువాడునుబోలె దెసలకు చెయిసాచు (వామనావతారం)
తొరగునస్రాంబుధి దొప్పదోగు (పరశురామావతారం)
హా! పోయితే యని యఱచు భార్యగురించి (రామావతారం)
బహువిధైరాసక్తి భ్రాంతిబొందు (బలరామావతారం)
చేరగారాని దర్శనస్థితి వహించు (బౌద్ధావతారం)
బాడబస్ఫూర్తి లోగొన్నపగిది నుండు (కల్కిఅవతారం)
దానవారాతికౌఋని తదవతార
దశకమును మున్నె తాల్చెనా ధరణిసుతుడు"

తాను విష్ణుసారూప్యమును పొందదలచి ముందుగానే పదిఅవతారాలు దాల్చాడా అన్నట్లున్నాడు. నిగమశర్మ మానసికస్థితిని ఎంతో హరువుతో వర్ణించిన ఈపద్యంలో రామకృష్ణుని మనస్తత్త్వపరిశీలన నిబిడీకృతమైయున్నది.

## శ్రీ రాధచరిత్ర

ఈప్రబంధంలో శృంగారాన్ని కవి పరాకాష్ఠకు తీసుకువెళ్ళిన ఘట్ట మిది.

"రాధ నడు మనే సింహానికి భయపడి, ఆమె నడకఅనే ఐరావతం యౌవనపు పొదరిండ్లో దూరగా, ఆ యేనుగు కుంభములు కావు కదా కుచకుంభములు? అవును. అట్లయినచో వల్లభనఖాంకుశయోగ్యత మున్ముందు కల్గును'' అంటాడు కవి "మానవతీ లలామ'' అన్నపద్యంలో ఎంత హృద్యమైనరూపకం!

మరొకపద్యం—

"యువమనోజాంగలక్షేత్ర మొత్తరించి
గరుసువడదున్ను మదనలాంగలికుహలము
కామినీమణిముక్కు; అటుగాకయున్న
నాసికాభరణపుగల్లు నాటనోటు"

"యువకుల మనస్సనే మెరకనేలను సరిచేసి మెత్తగా దున్నినట్టి మన్మథుడనే కర్షకుని నాగలి యట రాధముక్కు! అలా కాకుంటే నాసికాభరణమనే కల్లు యెందు కుంటుంది?"

యెంత మనోజ్ఞకల్పన!

రాధ ఒక మానవి కాదు. ఆమె ప్రకృతికి ప్రతీక. "రాధమాధవుం దనకు నధి నాథుంగా గోరి గోవర్ధన చలసమీపవర్తియగు ఋణవిమోచనతీర్థంబునం దపంబుసేయం గడంగి'' నపుడు ఆరుఋతువులు ఒకటి తరువాత ఒకటి విజృంభించి ఆమె నేమీ చేయలేక పోయినవి.

"శ్రీపతి యదుగుల గొడుగుల
ప్రాపొదవిన వారిఁ దాప భరమే మంటున్?"

అట్లా తపస్సుచేసి ఆమె కృతార్థ అయింది. గోదాదేవి (అండాల్) ఇట్టి భక్తురాలే. నమ్మాళ్వార్ నాయకీభావశక్తి ఇట్టిదే.

## సుశీలోపాఖ్యానము

"హరిమౌళిపతిత నిజదు
గ్ధరసోత్కర ఫేనకణకృత పరమసుకృత
స్ఫురణంబున నొకవైష్ణవ
వరునకు తనుజాత యగుచు వసుధం బుట్టెన్"

కృష్ణుని మురళీనాదం విని హోమధేనువు పాలు కురిసింది. గాలికి ఆ పాలనురుగు హరి మౌళిని పడింది. ఆపుణ్యంతో ఆమె సుశీలగా ఒకవైష్ణవునిఇంట పుట్టింది. కాని దానిపాప మేమోగాని భర్త పరమదుర్మార్గుడు.

ఒకకాకి హరిఆలయంమీద వాలడంవల్ల దానిరెక్కలగాలికి ధూళి ఎగిరి పోయింది. అది హరికి పరిచర్యగా పరిణమించింది. ఆకాకి సుశీలకు కుమారుడుగా జన్మించింది.

ఒకహంస ఆలయప్రాంగణంలో వాలడంతో రెక్కలకు గల నీటిబిందువులు రాలుటవలన గుడిఅలికిన పుణ్యం మబ్బి సుశీలకు కుమారుడుగా జన్మించెను.

ఇట్లే చిలుక, పాము, తేనెటీగ తాముఎరుగకయే భగవత్ కైంకర్యము చేసి సుశీల పుత్రులుగా జన్మించాయి.

## యోగశాస్త్రం : షడూర్మ్రులు

యోగశాస్త్రంలో షడూర్మ్ర లున్నవి. అవి ద్వంద్వములు. జరా, మరణములు; క్షుత్పిపాసలు; శోక మోహములు.

ఆవు, కాకి, పాము, తెనెటీగ, హంస, చిలుక — ఈ ఆరు షడూర్మ్రులకు ప్రతీకలు.

ఆవు—జర
కాకి — మరణము
పాము—క్షుత్తు
తేనెటీగ—పిపాస
హంస—శోకము
చిలుక—మోహము
జరామరణములు — స్థూలశరీరానికి
క్షుత్పిపాసలు — సూక్ష్మశరీరానికి
శోకమోహములు — కారణశరీరానికి

"ఈ షడూర్మ్రుల"ను గడచినప్పుడు వ్యక్తికి అదే ముక్తి అవుతుంది.

పుండరీకుడు ఆదర్శవ్యక్తి. ఇతనికథ పాండురంగమాహాత్మ్యంలో మూడు భాగాలుగా వస్తుంది.

మొదట అతను వైష్ణవగృహస్థు. తలిదండ్రులను పూజించువాడు. ఆదర్శ గృహస్థధర్మం ముక్తిసాధకమని రామకృష్ణునిమతము. తలిదండ్రులు వృద్ధులై గతించి

నప్పుడు పుండరీకుడు తనధర్మము నిర్వర్తించ, వారికి యథావిధి అంత్యక్రియలు జరిపినాడు. జరామరణములు ప్రాణికోటికి సహజములుకదా!

ఆతరువాతి ఆశ్వాసములో వానప్రస్థాశ్రమముననుండి తపస్సుచేసినాడు. క్షుత్పిపాసలను జయించినాడు.

పుండరీకచరిత్రములోని ఆఖరుఘట్టములో శోక, మోహములనుండి విముక్తుడైనాడు. అనగా షడూర్మలను జయించి 'ఋతంభర' స్థితికి చేరుకున్నాడు. ఈస్థితిలో అతడు పరమాత్మసందర్శనమునకు అర్హుడౌతాడు.
సుశీలకుమారులనుగూర్చి ఒకపద్య మున్నది:—

"ఒకడు నిరూఢ కృష్ణరుచి, యొక్కడు నిర్మలమానసప్రియుం
డొకడు ప్రయత్నయోగ్యఫలు, డొక్క డనాదృతబంధకంచుకుం
డొకడు రసానుకూలమతియుక్తుడునై విలసిల్లి రింతి పు
త్రకు; లిల నెట్టివారలకు తప్పునె తొల్లిటి జన్మవాసనల్"

సుశీలకు కలిగిన అయిదుగురు కుమారులలో మొదటివాడు పూర్వజన్మలో కాకము. కనుక నిరూఢకృష్ణరుచి. రెండవవాడు హంసము (నిర్మలమానసప్రియుండు). ఒకడు కీరము (ప్రయత్నయోగ్యఫలుడు). ఒకడు సర్పము (అనాదృతబంధకంచుకుండు), ఒకడు రసానుకూలమతియుక్తుడు (తేనెటీగ).

నా ప్రియమిత్రులు, విద్వద్వర్యులు ఆచార్య డి. చిన్నకృష్ణయ్యగారు నిరూఢకృష్ణరుచి అనగా కృష్ణదేవరాయలని, నిర్మలమానసప్రియుడనగా పెద్దనయని, అనాదృతబంధకంచుడనగా ధూర్జటియని, ప్రయత్నయోగ్యఫలుడనగా భట్టుమూర్తియనియు రసానుకూలమతియనగా నందితిమ్మనయనియు తెనాలిరామకృష్ణుడు భావించియుండవచ్చునని అర్థంచెప్పారు. వారి ప్రగాఢపరిశీలనాదృష్టికి ఆశ్చర్యపోయాను.

పూర్వజన్మలో కృష్ణదేవరాయలు కృష్ణపరమాత్మయేఅని ప్రజలు భావించేవారు. వీరనరసింహుని తరువాత సింహాసన మధిష్ఠించిన కృష్ణరాయలకు శ్రీకృష్ణజన్మాష్టమినాడు పట్టాభిషేకం జరగడం ఈవాదాన్ని బలపరుస్తున్నది. ఇట్లే ఇతరులు. మరి సుశీల! ఆమె సాక్షాదాంధ్రశారద.

## అయుత నియుతుల చరిత్ర

అయుతునిది అవినయాదర్శం (Ideal disobedience). అసలీకథ — గృహస్థధర్మ విశిష్టతను నొక్కివక్కాణించుటకే వ్రాయబడింది. అయుతుడు గురువును ధిక్కరించాడు. వివాహమాడడానికి అంగీకరించలేదు. దేవతల, ఋషుల, పితరుల

ఋణంతీర్చుకోడానికి మానవుడు వివాహమాడి గృహస్థధర్మాలు నిర్వర్తించాలి. పుండరీకు డాపని చేశాడు. అయుతుడు అందుకు విరుద్ధం.

"కా తవకాంతా? క స్తేపుత్రః?
సంసారోయ మతీవవిచిత్రః"

అని అన్న శంకరాచార్యులవారిని అయుతుడు అనుసరించాడా?

ఘటికాచలమాహాత్మ్యము

"ఘటికాతోషితః తస్మాత్
ఘటికాచల నామభాక్"

నూట యెనమిది దివ్యతిరుపతులలో ఘటికాచల మొకటి. ఇచ్చట యోగలక్ష్మీ నరసింహస్వామి వేంచేసియున్నారు.

గోవిందశర్మ

ఈప్రబంధంలో నన్ను ఆకట్టుకొన్నఘట్టం గోవిందశర్మ కథ.

"గోవిందశర్మ యనగా
గోవింద సమాను డొక్క గోత్రాదేవుం
డావిష్కృతమేధానిధి
శ్రీవైష్ణవధర్మ సారదృశ్య దనర్చున్."

అతని ఇంటిలో తరళ అనేపనికత్తె వుంది. గోవిందశర్మ పక్కింట హరిశర్మ అనే యువకుడున్నాడు. అతడు 'రేఖాచేతోభవమూర్తి'. 'కాంతిజితరాకాకోక విద్వేషి'. ఆతడు తరళను వలచాడు. తరళకూడా అతన్ని ప్రేమించింది. ఒకరిపై ఒకరికి గల అనురాగము తెలుపడానికి వారు చేసేచేష్టలను రామకృష్ణుడు "సిగదువ్వన్" అన్న మత్తేభంలోను "నునువెండికడియముల్" అన్న సీసంలోను మనోహరంగా వర్ణించాడు, ఈనాటి యువతీయువకుల ప్రణయకలాపం మరోరకంగా వుంటుంది, చేతిరుమాలు కిందపడవేయడం, ప్రియుడు ఆ రుమాలును ప్రేయసికి అందించడం వంటివి ఈనాడు జరుగుతాయి. ప్రేమలేఖలు వ్రాయడం వుండనేవుంది నాడూ నేడూ.

"వారిరువురు నిటు వలపుల
కోరిక తీరికలు గొనగ కుసుమశరకర
స్ఫార ధనుర్ముక్త శరా
సారవిమూర్చిత మనోంబుజాతద్వయులై"రి.

వారిరువురికి నారదుడు జన్మించాడు. గోవిందశర్మ ఇంట పెరిగాడు గోవింద శర్మ ఇంటికి వచ్చిన కౌండిన్యమహామునికి శిష్యుడైనాడు. ఘటికాద్రితటిన్ తపం చేశాడు. ఆ తరువాతిజన్మలో బ్రహ్మకు పుత్రుడై జన్మించాడు.

## నరసింహస్వామి

దశావతారాలలో నరసింహుడు నాల్గవవాడు. ఈ అవతారాలు సృష్టిక్రమాన్ని చెబుతాయి. నూటాయాభై లక్షల సంవత్సరాలక్రితం నరసింహునివంటి ఆకారంగల మానవు లుండేవారట. మూడువేల అయిదువందల లక్షల సంవత్సరాలకు పూర్వం మత్స్యం వింతవెన్నెముక గలప్రాణి. రెండువేలఅయిదువందల లక్షలసంవత్సరాలనాడు తాబేలువంటి ప్రాకెడి జీవులు వెలసినవి. వెన్నెముకగలజీవులలో మత్స్యం అతిప్రాచీన మైనది.

ఆకారరీత్యా మొసలి, ఆవులలో పోలిక లున్నా, గుండెకాయ మరియు ఇతర శరీరాంతర్గతభాగములలో మొసళ్ళకు పక్షులకు పోలికయున్నది. అని J. B. S. Haldane అభిప్రాయపడియున్నారు.

సప్తర్షులకు సాక్షాత్కరించిన నరసింహస్వామికి మూడవకన్నున్నది.

"కనకన వెలుంగు నంగారక విధమునను
గానవయ్యెడి మిక్కిలికంటివాని"

సప్తర్షులు ఘటికాచలం వెళుతూ తిరుపతిని సందర్శిస్తారు. అప్పుడు భక్తిపార వశ్యంతో రామకృష్ణుడు చెప్పినసీసాలు మరపురానివి.

"తల నిల్లుగట్టు వ్రతంబులరాయని,
తోమనిపళ్యాల నేమగాని
చేరుడుబియ్యాల యోరెముల్ దినువాని
కోణంగిసేవల నాణెగాని
కానుకలకు వడ్డికాసులుగొనువాని
ముక్కోటితీర్థపు టెక్కువాని
అడుగడుగునకుమ్రొక్కు లందుకొనెడువాని
కూకటిమాడల గుత్తవాని
శుక్రవారపుసేవల సొగసువాని
మానినుల గోరి వలపించు మాయలాని
తిండిమెండయగారిని తిగళగురుని
కాంచి సేవించి సంతోషకలితు లగుచు"

పరమభక్తా గ్రేసరుడైన కులశేఖరాళ్వారు—

"పడియాయ్‌క్కిడన్దుఉన్‌పవళవాయ్‌కాణ్బేనే" అన్నాడు వేంకటేశ్వరస్వామిని గూర్చి,

"నీవాకిలిగడపనై వుండి, పగడమువంటి నీ దివ్యాధరమును సందర్శించు భాగ్యము కలుగు"నన్నాడు.

తిరుమలపై శ్రీ వేంకటేశ్వర పెరుమాళ్ళు సన్నిధి వాకిలిగడపకు "కులశేఖరప్పడి" అను ప్రసిద్ధికలిగింది.

"ఘటికాచలమాహాత్మ్యం"లో పాండురంగస్వామిని వర్ణించిన 'చిప్పకూకటిరేక' అన్న సీసపద్యం చాలాతీయనిది. శతశృంగపర్వతంపై యెంతతపము చేసినను సాక్షాత్కరించని స్వామి ఘటికాద్రిపై తపమాచరించగా ప్రత్యక్షమాయెను.

ఈ ప్రబంధంలో ధవలాంగుని కథవుంది. అతడు అకస్మాత్తుగా ఒకనాడు కిరాతుడవుతాడు. వసిష్ఠునివలన ఆ కిరాతత్వము పోయినది. ఈ ప్రబంధంలోని కథ కాళ్ళుచేతులు లేనిది. ఇందు భక్తి హెచ్చు. కాని కావ్యశిల్పం తచ్చు.

ప్రబంధకవులలో హాస్యరసచక్రవర్తి తెనాలి రామకృష్ణుడు. కనుకనే పుండరీక మహామునికి భగవంతుడు ప్రత్యక్షమైనప్పుడు చేసిన దశావతారస్తుతిలో బుద్ధావతారమునుగూర్చి చెప్పిన పద్యంలోసైతం హాస్యం విడువలేదు.

"ప్రతిదినకేశలుంఛనపు రాయిడి నెట్టన బట్టగట్టి పై
బుతపుతమంచునున్నకుఱుబోదతలన్ ధరియింపనోడియున్
సతమగుసొమ్ముగాన విడజాలవుగా శిఖిపింఛవల్లి; సౌ
గతమతధుర్య! దానికటి గట్టుము; పుట్టము మిన్న కేటికిన్?"

బుద్ధుడు నున్నగా గుండు కొట్టించుకుని వుంటాడు. బుద్ధావతారంలో శిఖీపింఛం తలలో ధరించడానికి వీలుకాదు, కనుక నడుమునగలపుట్టము తొలగించి పింఛం నడుమున కట్టుకో మన్నాడు. మరి బట్టసంగతే మనగా "బట్టతల"లో బట్ట ఉన్నదికదా! అది చాలదా? అంటాడు. ఇది బౌద్ధులను వెక్కిరించుటకైనా కావచ్చును. లేదా, బాలకృష్ణుడు శుద్ధసత్త్వస్వరూపుడు; అతనికి బట్ట యేల అనియు కావచ్చును. లేదా తన సహజహాస్యధోరణి మరువలేక ఈ గంభీరఘట్టముననూ బయటపడియుండును.

తెనాలిరామకృష్ణుని బహుముఖప్రజ్ఞనుగూర్చి ఎంత చెప్పినను తక్కువే.

రామకృష్ణునిగూర్చి విశేషంగా పరిశోధన జరిపిన కొద్దిమందిలో నా మిత్రులు. విద్వద్వర్యులు ఆచార్య శ్రీ డి. చిన్నకృష్ణయ్య ఎం.ఏ., ఎం. లిట్ గారు అగ్రేసరులన

వచ్చును. వారి సిద్ధాంతవ్యాసం నా ఈ ప్రసంగవ్యాసం వ్రాయడానికి ఎంతో తోడ్పడింది. వారు తమ అముద్రిత సిద్ధాంతవ్యాసమును పఠించుటకు నాకు ఇవ్వడమేగాక, నా సందేహాల నెన్నిటినో నివర్తింప జేసినారు. నాకు అవసరమైన సమాచారమును అందించినారు. వారి ఔదార్యమునకు నా ధన్యవాదములు.

మద్రాసు వైష్ణవకళాశాల ఆంధ్రశాఖాధ్యక్షులు, మహాపండితులు, పరిశోధకులు శ్రీ రావూరి దొరస్వామిశర్మ ఎం.ఏ.,బి.ఓ.ఎల్. గారు నాకు రామకృష్ణుని రచనావిశేషము లెన్నో విశదపరచి నాకు తోడ్పడ్డారు. వారి వాత్సల్యానికి కృతజ్ఞుడను.

రామకృష్ణునిగూర్చి ప్రసంగించమని కోరిన నా యువభారతీయులు శ్రీయుతులు ఇరివెంటి కృష్ణమూర్తి, వంగపల్లి విశ్వనాథం, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారల స్నేహశీలానికి అభివాదములు.

స్వర్గాద్యం సత్యనామాద్యం
షష్ఠషష్ఠం సదీర్ఘకం
షష్ఠంషష్ఠాది నత్యంతం
సమారం తం విదు ర్బుధాః.

కృష్ణాయ నమః.

# పానుగంటి లక్ష్మీనరసింహారావు

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ఆనాఁడు పిఠాపురము మహారాజ భవనములో ఆంధ్రసాహిత్యపరిషత్తు ఏకాదశ వార్షికోత్సవ సభాసన్నాహము ! ఆ మహాసదస్సునకు పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు అగ్రాసనాధిపత్యము వహించుటకు సమాహూతులు. ఏఁబదేండ్లకు మున్ను వారి యుపన్యాసారంభవచోవైఖరికిఁ బ్రతిధ్వను లివి :

"నేను పండితుఁడను గానని యీయూరివా రెరుఁగుదురు. పైగ్రామములవా రెఱుఁగుదురు. నన్నెఱిఁగినంతవఱ కాంధ్రదేశమంతయు నెఱుఁగును. సాహిత్యహీనతలో జగమెఱిఁగినవాఁడను గాని సాధారణుఁడను గాను. ఇట్టి నన్నుఁ బరిషత్తువా రేల యెన్నుకొనవలయునో నాకుఁ దెలియదు. వెనుక జరిగిన పది పరిషత్సభలకుఁ బండితుల నెన్నుకొంటిమికదా, యీసారి యపండితు నెన్నుకొందము. ఇంతలోఁ జెడిపోవున దేమున్నదని యూహించి మార్పుకొఱకై నన్నెన్నుకొనియుందురేమో ! ఎటులైననేమి? అవిలంఘ్యమైన మహాజనుల యాజ్ఞ తులసీదళమువలె శిరమున ధరించి యిట నిలువఁబడితిని..."

ఏషోఽస్మి కవివశా దాయోధ్యక స్తదానీంతనశ్చ సంవృత్తః-

పందొమ్మిదవ శతాబ్ది పరార్ధమున జనుర్భాగ్యము కలిగి, యిరువదవ శతాబ్ది సగపాలులోఁ బెరిగిన కొందఱు ప్రతిభావత్పండితులలో గణ్యమైన యొక వైలక్షణ్యమున్నది. భారతీయమైన సంప్రదాయస్కంధమునుండి క్రొత్తకొమ్మలు లేచి కనువిందుగా విరియఁబూచిన కాల మది. ప్రాక్పవమానములు పడమటిగాలులు మలయవాయువులు చేతులుకలుపుకొని పరస్పరప్రాణార్పణముతో పరిష్వంగము చేసికొన్న తరుణము. తెనుఁగులో సరిక్రొత్తది యనుకొన్న యొకానొక సాహిత్యమేర్పడి యువభావుకులకు అంతస్సౌహిత్యము కలిగించిన తఱి. వ్యుత్పత్తి సౌష్ఠవావిష్కారముకంటె ప్రతిభాకళాకలనమునకు సహృదయులు కాంక్షపడిన రోజులు. పద్యమునందలి వ్యంజనావృత్తికంటె గద్యములోని సద్యోనురంజనప్రవృత్తికి పాఠకుఁడు ముచ్చటపడిన దినములు. రావలెను! సమాజమునఁ గొంతమార్పు రావలెను. కావలెను! సాహి

త్యమునకుఁ బ్రత్యగ్రత కావలెను. ఏతాదృశమైన తహతహతో తెలుగురచయితలు కలము కదపిన క్రొత్తనాళ్లు. అనుషంగికములైన హాస్యాదిరసములు అధికారికములగు శృంగారాదులతోఁ గలసిమెలసి సారస్వతప్రాంగణమున సహపంక్తిభుక్తికి సమాయత్త పడిన సమయము. శ్రవ్యధర్మముగల కబ్బములను మించి దృశ్యలక్షణములగు రూపక ములకు స్వాగతస్వాపతేయములు లభించుచున్నయుగము. "మీవ్యవహారము మాగ్రంథ ములకు అమృతాభ్యవహారము. మీ వాడుకమాటలు మారచనలకు వేడుకబాటలు" అని చెప్పుచు పండితులు కొందఱు బాసికపట్టు విడిచి సాధారణప్రజలకు సాంత్వనము చెప్ప జూచిన సమయము. "ఆరోగ్యముమాట దేవుఁ డెఱుఁగును. పంచతిక్తకషాయము మేము సేవింపలేము. చేఁదుమందునకేని తేనె యనుపానము పెట్టవచ్చునుగదా, అనుమతింపుఁ" డని విద్వద్భిషక్కులకు అర్తులైనకొందఱు పాఠకులు విజ్ఞప్తులు చేసికొన్న ప్రత్యూ షము.

కడచినశతాబ్ది మలిరెక్క ఈశతాబ్ది తొలిరెక్క ఆధారముచేసికొని సారస్వ తాంబరవీథిలో విశ్రుతవిహారము చేసిన విచక్షణులలో విద్వత్కవులలో సుప్రతీతులు ఎందఱో మహానుభావులు !

తిరుపతివేంకటకవులు, వీరేశలింగంగారు, చిలకమర్తివారు, వేదమువారు, అప్పారావుగారు, రామమూర్తిపంతులుగారు, రామలింగారెడ్డిగారు, ధర్మవరము రామ కృష్ణమాచార్యులుగారు...అది యొక ప్రత్యేకమైన సుధర్మ.

తదాస్థానమంటపమున వెలుఁగొందుచున్న యలనాఁటి ఆంధ్రసారస్వత జ్యోతి ర్మూర్తుల సమక్షమున నేఁడు సాక్షిగా నిలిచిన భావనాస్ఫుటమూర్తి మనకు అతిథి; అర్ఘ్యపాణియగు 'యువభారతి' ఆతిథేయము రసజ్ఞులకు ఆనందశరధిః ఉత్తుంగ రస తరంగావగాహనమునకు ముందు వేలావనైలావలీలవలీలుంగలవంగ సంగతలతాలాస్య ములకు మనసుపడుదుము.

లక్ష్మీనరసింహరావుగారి యింటిపేరు పానుగంటివారు. మాధ్వులు. జన్మతః ద్వైతసంప్రదాయమునకుఁ జెందినవారు. తల్లి రత్నమాంబ. తండ్రి వేంకటరమణయ్య. అభిజనము సీతానగరము. కొంతకాలము రాజమహేంద్రవరమున నునికి. చదువుసంధ్య లాయూరనే. కడకు నిలకడ పిఠాపురమున. పానుగంటివారిమేడ పిఠాపురము రైలు స్టేషనునకు ప్రక్కలో నున్నది. అప్పటికే అది ప్రాఁబడినమేడ. పిఠాపురము మహా రాజావారి బావగారిని 'సోములుగా'రని వ్యవహరించెడివారు. పానుగంటివారి మేడ సోములుగారి సౌధమునకుఁ గుడిభుజము. సూర్యరా యానందగ్రంథాలయము తత్ప్రాం తీయ గ్రంథాలయములలోఁ గోటీరము. అఁట యానాఁడు సోములుగారి ప్రాసాదము నకు వాణీప్రసాదము. ఆగ్రంథాలయముదెస రాకపోకలలో యువకులకు పానుగంటి వారి దర్శనము ప్రాయశః లభ్యయోగము. ఏడవపడికి వచ్చినను పానుగంటివారి కంటి

తుదలలోఁ బదనైన వాడిమిః నరసిన పలుచనికేశములు. నడిమిపాపిడి. బుగ్గలకు వచ్చిన తెలిమీసములు. కౌశేయవస్త్రధారియగు ప్రాంశుమూర్తిః అహంకారమో॰ ఆత్మగౌరవమో మనము దాని కేపేరుపెట్టినను అభ్యంతరపెట్టువారు లేరు. ఒకమాట చెప్పవచ్చును. అంతస్సత్త్వమైన యొకానొక రాజసమునకు లక్ష్మీనరసింహరావుగారు పెట్టనిపేరు.

ఆంగ్లవాఙ్మయమున వారిది సర్వంకషమైన ప్రజ్ఞ. బి.ఏ. పట్టభద్రత నాఁడు మాటలు కాదు. సంస్కృతాంధ్రములలో, మఱియు బహుభాషాసాహిత్యములతో బాహుశ్రుత్యము. అఖండమైన వ్యవహారధురీణత. రాయలసీమలోని 'ఆనెగొంది' సంస్థానములో, 'ఉర్లాము' దివాణములో, లక్ష్మీనరసాపురము ఎస్టేటులో కొన్ని కొన్ని యేండ్లుగా దివానుగిరీ నిర్వహించిరి. నడుమ నెప్పుడో పెద్దాపురమునఁ గొద్దిరోజులు అధ్యాపకత్వము. ఎక్కడనేని ఎక్కువకాలము ఒదిగి నిలఁబడుటకు ఆయన యంతస్సత్త్వ యంగీకరించెడిదికాదు. తనరచనలతో తానే యొక స్వతంత్రప్రభుత్వము నెఱపఁదలపెట్టినవాఁడు. నరసింహరావుగారి యశోలక్ష్మికి సాక్షివ్యాసములు స్వర్ణసింహాసనము ఘటించినవి. అనేకములగు నాటకములు తత్కీర్తిచిరంటికిఁ గంఠాభరణములైనవి. నర్మదాపురుకుత్సులు, రాధాకృష్ణులు, కల్యాణరాఘవులు ఎందఱో దివ్యదంపతుల వినోదవిహారఘటనమునకు నాటకోద్యానవాటిక పానుగంటి వెలయింపఁజేసెను. ఆ వనవాటికనుండి 'కోకిల' కలకంఠము మనకు వినఁబడును. అక్కడ 'మంజువాణి' మేజువాణి చేయును. పానుగంటివారి ప్రభుత్వము 'సరస్వతి'. ఆయన నాటకరచన ఆశ్వయుజమాసములోని 'పూర్ణిమా'చంద్రికకు స్మారకము. వృద్ధవివాహములు. బుద్ధబోధసుధలు, విచిత్రసమావేశములు పానుగంటివారి కొలువుకూటమునఁ గాదాచిత్కములైన వినోదములు ఆప్రభువునకు పిఠాపురము మహారాజుగారితో నెయ్యము కలసినది. ఆసంస్థానము నెలకు నూటపదార్లు జీతము పేరితో పానుగంటివారికి బహుమాన మిచ్చెడిది. ఆయన పిఠాపురాస్థాననాటకకవి. వ్రాఁతకోఁతలు పనిపాటులు ఏమియు నక్కఱలేని యుద్యోగము. అపుడపుడు కోటకుఁబోయి మహారాజావారు సూర్యారావుగారిని దర్శించి వాగ్వివాదము నెఱపుట; కోటలో ప్రదర్శింపఁబడెడి నాటకములలో సహకరించుట. ఇంతకుమించి దివాణపుఁబని ఆయనకు లేదు. ఒకరహస్యము చెప్పుకొనుచుండెడివారు. తన్నుగూర్చి తన యేలుబడినిగూర్చి రచనలలో నెక్కడ దుయ్యఁబట్టునోయని పిఠాపురమురాజుగారు జంకుతో పానుగంటివారికి జీతపులంచమిచ్చెడివారట! ఏమో! పిఠాపురప్రభువు సాహిత్యప్రీతి జగద్విఖ్యాతమైనదికాని లాఁతిదికాదు. దేవులపల్లి సోదరకవులు, వేంకటరామకృష్ణకవులు, వేంకటపార్వతీశ్వరకవులు, చిలకమర్తివారు మఱియెందఱో వారి యాస్థానమున నిత్యసంభావితులు. మఱి శాస్త్రవేత్తల విషయము చెప్పనక్కఱలేదు. వ్యాకరణమున భాష్యాంతపరీక్షావిధానమునకు ఆసంస్థానము జన్మభూమి. ఇఁక సంగీతాదికళాగౌరవముః తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారు తెలుఁగుదేశమునకుఁ జాలిన గొప్ప వైణికవిద్వాంసులు. రవీంద్రునివంటి రసజ్ఞసమ్రా

ట్టును పరవశునిచేసిన వీణాగానము వారిది. ఒకసారి దివాణములో ప్రభుసన్నిధానమున సంగమేశ్వరశాస్త్రిగారి 'వీణకచ్చేరి' జరిగినది. వచ్చినశ్రోతలలో పానుగంటివా రొకరు. వీణాగానానంతరము అట్టి వైణికశిరోమణి నామతించుచున్న మహారాజును ప్రశంసించుచు లక్ష్మీనరసింహారావుగారు చెప్పిన యీసీసము సువర్ణము, చిత్తగింపుఁడు.

"స్వజనుల నేరీతిఁ బరిపాలన మొనర్తు
వాశ్రితు నెవ్వాని నాచరింతు
వాదాయమున నెంత యర్థుల కిచ్చెద
వెదెటు చేసిన భృత్యు నెద గణింతు
వవనిపాలన నేది యార్జించినాఁడవు
కవిత గానంబు నేపగిది విందు
వెట్లుగాఁ బ్రభుసౌఖ్య మీక్షింపఁగానుంటి
వాత్మసంస్తుతుల కేమందువయ్య

సరిగ, ధని, సగమ, పనినిసరిగ, గరిమ
మరిమరిగ, పాపనినిగని, సరిసరి యను
వీణకాని 'మా'వెన్క 'నీ'వీణ వరుస
మీఁద: 'నీ'వెన్క 'మా' నూర్యమేదినీశ!"

సీసమునందలి యెనిమిది ప్రశ్నలకు ఎత్తు గీతలో వీణ స్వరవిన్యాసముతో జవాబులు చెప్పినది. అవి యథాసంఖ్యముగా నున్నవి. చమత్కారమేమనఁగా? ఓ మహారాజా! ఈవీణ వరుసమీఁద ఆరోహణావరోహణ క్రమములో 'మావెన్క నీ' యనుచున్నది. కాని 'నీ'వెన్క'మా'. మా అనగా లక్ష్మి. నీవెన్క లక్ష్మిగాని, లక్ష్మివెనుక నీవు కావనుట. ఇట్టి చమత్కృతిమత్పద్యము పానుగంటివారినోట వచ్చెనన్నచో విశ్వసింపని వారుందురు.

నైసర్గికమైన ప్రతిభావైభవమునకుఁ దోడు వ్యుత్పత్త్యభ్యాసములు పానుగంటివారిలో వెన్నంటియున్నవి. జన్మతః, ఆయన గొప్ప భక్తుఁడు. అభిజాత్యసంపద గలవాఁడు. దైవము నెంతగా విశ్వసించెనో లోకవృత్త మంతలోతుగా నెఱుఁగును లోకతంత్రమందలి సారాసారవివేచన విమోచనములతో జీవితమును పావనము చేసికోవలెనని యెంచినవాఁడు. ఎంచుటయ కాదు; ఆచరించినవాఁడు. ఆచరించుటయ కాదు; అనర్ఘరచనలచే ప్రచారముచేసిన చరితార్థుఁడు. తెనుఁగువారికిఁ బానుగంటివారి రచనలచేఁ గలిగినమేలు పరిమితముకాదు. వేనవేలు పాఠకులు అభిముఖ్యమును జూఱగొన్న రచనలు; వారి దొసఁగులు వారి కెత్తిచూపి 'అవునురా' అనిపించిన రచనలు. తెలుఁగువారి గుణాగుణములు మేలుగీళ్లు సదసత్తులు జల్లెడపట్టి నిగ్గు చూపిన రచనలు. దంభాచారులయెడల, అవినీతులయెడల, అహంకారస్ఫీతులయెడల, నర

సింహరావుగారు ప్రయోగించినది 'కలము' కాదు. కులిశము. కల్లకపటములు తెలియని సాధువులకు, స్వస్థాన వేషభాషాభిమతులకు, అక్రూరవర్తనులకు, అచ్ఛశీలురకు ఊర్జితులకు పానుగంటివారు వినిపించినది కవిత్వముకాదు. జీవతత్త్వము. సరసులకు సహృదయులకు భావుకులకు మేధావులకు వారి 'సాక్షి' మర్శనము నవ్యసాహితీ సారసాక్షి దర్శనము.

తెనుఁగులో లక్షణ లక్షితమైనపటిష్ఠమైన పండితపామరపాఠకావర్జకమైన హాస్యరసోర్జితమైన వర్చస్వంతమైన వచనము లేదన్నదానికి పానుగంటివారి సాక్షి వ్యాసములు అపవాదము. సరసమధురమైన హాస్యానుపానముతో ఆరోగ్యభాగ్యోదర్కమైన హితవిషయౌషధములు తెనుఁగుపఠితలచే సేవింపఁజేసిన చికిత్సకుడు జంఘాల శాస్త్రి.

సాక్షి పానుగంటివారి యనిదంపూర్వస్సృష్టి యనుటకు పడమటి రచయిత 'ఎడిసన్' అడ్డుతగులును. ఆతఁడు తన పత్రికకు పెట్టిన 'స్పెక్టేటరు' పేరు, దాని లోనితీరు, పానుగంటియనుకరణము కదా ! యందురు. తావన్మాత్రము దోషమన్నచో నిఁక తెలుఁగుసాహిత్యమే కాదు, భాషాసాహిత్యమునకేని ఈ కళంక మనివార్యము. పయిగా: అనుకర్తకుఁ బూర్వ మొక అనుకార్యుఁడు, వానికి మఱొకఁడు; వానికి మఱి యొకఁడు. ఇట్లు చూచినచో ఆ వ్యవస్థ ప్రథమశిల్పి యెవఁడో గోచరముకాదు. క్షేమేంద్రుఁడు కవికంఠాభరణములలో పాదోపజీవి, పద్యోపజీవి, భావోపజీవి, భువనోపజీవి ఈ విధముగా వింగడింపు చేసి కొంత చెప్పఁజూచెను. అవి యాఖ్యాసికులకు. ఒకవేళ సిద్ధునియందును ప్రక్రియారంభదశలో పూర్వచ్ఛాయ యే కొంచెమో భాసించినను ప్రదీప్తమైన కవిప్రతిభాప్రకాశముముందు ఆవలిదానికి డిందుపాటు తప్పదు. అందుకే వేత్తలు చెప్పుదురు:

అవ్యుత్పత్తి కృతమైన దోషము శక్తిచే సంహృతమగును.
అశక్తి కృతమైన దోషము ఇట్టే పట్టుబడును.

ఇక్కడ శక్తియనఁగా ప్రతిభ. దోషము 'అనుకరణ' మని ప్రకరణమునుబట్టి చెప్పుకోవచ్చును. లోకోత్తర శక్తిస్ఫోరకమైన రచనకు 'సాక్షి' తిరుగులేని సాక్ష్యము.

సహస్రాధిక విషయప్రతిపాదనములు, శాస్త్రములు దర్శనములు మతములు ప్రాచ్య పాశ్చాత్యరీతులు తత్తత్సారాంశములు, జన్మపరంపర, వైరాగ్యము-సౌందర్యము, గర్భవతులు, గ్రహణములు, పాచకమహాసభలు, తోలుబొమ్మలాటలు, ఆయుర్వేదము, ఆంగ్లవైద్యము, న్యాయస్థానములు, ఒకటేమిటి ! వేయి విషయములు ! సాక్షిచే విమృష్టముకాని యంశములు వెదకిపట్టుకొనుటకు ఎవరేని పరిశోధనము చేయవచ్చును.

సాక్షి సంఘములో నయిదుగురు సభ్యులు. వారిలో ముఖ్యుడు సాక్షి. సభా సమావేశములు పత్రికాప్రకటనములు మున్నగునవి చూచుకొను బాధ్యత యతనిది.

జంఘాలశాస్త్రి గంటలకొలఁది యుపన్యాసము లీయంగల వాగ్ధారాధాటీకుడు. కాలాచార్యుఁడు వెట్టి సభ్యుఁడు. పొడుము పట్టునకు మొగము వాచినవాఁడు. వాణీదాసు కవి. శ్లేషకవిత్వములో భట్టు. నువ్వుగింజమీఁద నూఱు పద్యములు చెప్పిన దిట్ట. బొఱ్ఱయసెట్టి వ్యాపారి సాక్షి సంఘాధ్యక్షుఁడు.

ఈ సంఘమునకు ఒక నిబంధనావళి యున్నది:

రాజకీయములు మాటాడరాదు. వ్రాయరాదు. చెడ్డను గూర్చి విమర్శించినపుడు వ్యక్తి నామములు ఉదాహరింపరాదు. తప్పనిసరి యగుచో కల్పిత నామములు ఉపయోగింప వచ్చును. సభ్యులలో వివాద మేదేని తటస్థించినచో తిట్లలోనికి కొట్లాటలోనికి దిగ రాదు. కర్మవశమున నొకవేళ అట్టిది సంభవించినను కోర్టుం కెక్కరాదు.

నిబంధనావళితోఁ గూడిన సాక్షి సంఘమునకు పానుగంటివారు ప్రాణప్రతిష్ఠ చేసిరి. అది తత్ప్రతిభా సంభూతమైన వినూత్నసృష్టి. "తత్ సృష్ట్వాతదేవానుప్రా విశత్". సాక్షియొక్క సిద్ధాంత వాక్సారమెట్టిదో వినవచ్చును. "ప్రాపంచికచర్యలు విచిత్ర విచిత్ర మహావిచిత్రము లైనవి. ప్రపంచమంతయు మాయామయమైనది. పత్రికలలో, ఖాతలపాలిలో మాయ. న్యాయాధికారి కలములో మాయ. న్యాయవాది నాలుక కొనను మాయ. వణిజుని త్రాసులో మాయ. వసుధాకర్షకుని నాగేటిలో మాయ. ఎక్కడ చూచినను మాయగా నున్నది. మనుష్యులొనర్చు తప్పులు, వారికొఱ కేర్పడిన శిక్షలు నపరిమితములు. తప్పుచేసినవారికి రాజకీయశిక్ష యొకటియే చాలదు. సంఘశిక్షకూడ నుండవలెను. పది సంవత్సరముల కఠినశిక్ష కంటె పది సంఘములు నేరగానినిగూర్చి చేయఁబడిన యనాదరణము నేరము నాపుటలో బలవత్తరమైనది. రాజకీయ దండనముగల యీ నేరములకే సంఘదూషణము. నేరము నడగించుటకు కావలసిన రాజకీయదండనములేని మొదటఁ జెప్పిన నేరములకు మనుజుల మాయా ప్రచారములకు సంఘదూషణ మావశ్యకమై యుండదా! ముఖ్యముగా నుండును. ఉండక తప్పదు. అట్టి నేరములనుగూర్చియే మేము వ్రాయుచుందుము. నేరములు వెల్లడింతుము వాని స్వభావములు విశదపఱుతుము. వానివలన సంఘమునకుఁ గలి గిన హాని స్పష్టపరుతుము. వానియందు జనుల కసహ్యము కలుగునట్లు చేయుటకై ప్రయత్నింతుము. నేరములనే నిందింతుము గాని అట్టి నేరములకు లోనైనవారిని నిందింపము..."

సాక్షి యీ నియమపుఁ బునాదిమీఁద నిర్మాణము చేయబడిన స్వర్ణప్రాసాదము. వాక్యముల ఎత్తుగడలు, దింపుగడలు, పదముల ఆవాపోద్వాపములు, అనుప్రాసములు, అక్కఱలేకున్నను గతి విశేషస్ఫురణమునకు వేసిన యతిప్రాసములు, పునరుక్త వదా

భాసములు, భావావృత్తులు, నివేదనములు, నీరాజనములు, నవ్వించుటలు, నొవ్వించుటలు, గిలిగింతలు, గిల్లుటలు, ఊఅడింపులు- లక్ష విన్యాసములతో సాక్షిరచన యొక ప్రత్యేకజగత్తు. అక్కడ పానుగంటి తాను కూటస్థుఁడు. అక్షరుఁడు. ఆయన వచన శైలి తెలుగు రచయితలకు అనుకార్యమైనది. సాక్షి వెనుకఁ గొన్నికూటసాక్షులు అకృతసాక్షులు బయలుదేఱి న్యాయస్థాన ప్రాంగణమునఁ బూరి గఱచిపోయినవి. నాఁటికి నేఁటికి సాక్షియొక్కఁడే! అది యటులుండె :

ఒకే యొక హాస్యరసమును వెలికిఁదీసి, తదపేక్షయా చూచినచో పానుగంటి వంటివారు లేరనుట సాహసము. కన్యాశుల్కమును మఱచిపోలేదు. చిలకమర్తివారు తలఁపులోనున్నారు. భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యముల ప్రతీతనామదేయములను తడవక దాఁటిపోవుట సందర్భౌచిత్యము కాదు. పది-పాతికయేండ్లు వెనుకముందుగా వీరందరు ఇతరేతరము కొంచెమో గొప్పో తెలిసికొన్నవారే కదా! ఒక సంఘటనము ! పానుగంటివారి జన్మసంవత్సర మేదియో సరిగా గురజాడ అప్పారావుగారిదియు నదే. 1865 సంవత్సరము. ఈ యుగళముకంటె చిలకమర్తివారు రెండేండ్లు చిన్న. మిగిలిన మూవురు ఈ మూవురికంటె నించుమించు ఇర్వదియేండ్లు అర్వాచీనులు. మొత్తముమీఁద వీరి తుల్యకాలికత్వము సుస్పష్టము. హాస్యరస పరమేశ్వరుఁడు తెలుఁగునకు ప్రసాదించిన షణ్ముఖమూర్తులు వీరు. ఈ షట్కములో వయసా,వచసా, యశసా పానుగంటివారిది ప్రముఖస్థాన మనుట 'వ్రతానాముత్తమం వ్రతం' వంటి మాట కాదు. అసలు నరసింహ నామాక్షరములలో హాస్యోత్పాదకశక్తి యున్నదా ! మన హాస్యరచయితలు ఆరుగురిలో నరసింహులదే మెజారిటీ. ప్రాచీనకవి చాటు ప్రమాణ మొకటి జ్ఞాపకము చేయుచున్నాను.

"నరసింహ కృష్ణరాయని
కర మరుదగు కీర్తి వెలసెఁ గరిభిద్గిరి భి
త్కరి కరిభిద్గిరి గిరిభి
త్కరి భిద్గిరిభి త్తురంగ కమనీయంబై."

కడుపు చెక్కలుచేసి భిత్తులు పట్టించుహాస్య మీ పద్యము పుట్టించుచున్నదన్నచో, దానికి ఆరంభమునందలి నరసింహశబ్దము దోహదము చేయుచున్నదేమో! దీని ప్రతిపదార్థము ప్రకృత విషయముకాదు కావున విడిచి పెట్టుచున్నాను. సాక్షి కాలమునాఁటి వచనరచనను గూర్చి పానుగంటివారి మాటలే యొప్పఁజెప్పుట తప్పనిసరి యగుచున్నది.

"ఆంధ్రవచనము మోటుఁదనము వదలినది. మునుపటి" 'నన్ను ముట్టుకొనకు దనము' విడిచినది. మునుపటి టెక్కు మునుపటి బిగింపు విడిచినది. ప్రస్తుత కాలానుసారముగా ప్రస్తుత జన చిత్తరంజకముగా ప్రాచీన డబడబాయమాన శబ్దములు

సందిగ్ధభాషణము వివిధాభిప్రాయ ప్రకాశక వచోవైఖరులు ఆంతరంగిక కాఠిన్యము వదలుకొని పువ్వులవలె మృదులములైన లలిత లలితములైన ముద్దుపలుకులతో స్పష్టములై స్వచ్ఛములైన దాపరికములేని విడివిడి పలుకులతో ఏకాభిప్రాయబోధకములగు టక్కుటక్కుమను సూటిపలుకులతో అరటిపండొలిచి చేతఁబెట్టినట్టు కులుకుచుఁ గులుకుచుఁ బలుకుచున్నది..."

అది యొక కావ్యమా? నాయికా నాయకులా? కాకున్నను 'సాక్షి' గ్రంథమునఁ ప్రధానరస మేది? యని కౌతుకమునకుఁ బరిశీలన చేయవచ్చును. సాక్షి హాస్యరస ప్రధానమైనదని పరంపరాయాత ప్రసిద్ధి. కాని దాని ముఖ్యరసము హాస్యము కాదు. అది ప్రాసంగికము. సత్యవీరము ధర్మవీరము శాంతము సాక్షి లక్ష్యములు. అసారము అధర్మబహుళమునగు లోకతంత్రములో సత్యానృతములు ధర్మాధర్మములు వివేచనము చేసి సారవద్భాషలో సాక్షాత్కరింప జేసి పాఠకులను సత్యోత్సాహస్థాయ్యభినివిష్టులను చేసిన రచన. చిత్తము సమాహితము చేసి యింద్రియ నియంతృత్వమును పోకార్చుటకుఁ బోరాటము చేయించి చదువరులలోఁ బ్రశమభావము నుదయింపఁ జేయుటకు యత్నించిన గ్రంథము. ప్రజల అంతఃకరణమును సత్త్వపఱచి ఆధ్యాత్మిక సత్యములు దానియందు ప్రతిబింబించునట్లు చేయవలయునని తాత్పర్యముగల వ్యాసపీఠము సాక్షి.

ఆనాఁడు సాక్ష్యుపన్యాసముల కొఱకు ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము ప్రత్యేకముగా కేటాయింపఁబడినది. కోపల్లె హనుమంతరావు పంతులుగారిని గూర్చి వ్రాసిన వ్యాసములోఁ గొన్నిమాటలు పానుగంటివారివే మనము జ్ఞప్తికి తెచ్చుకోవచ్చును.

"సాక్ష్యుపన్యాసములు మిగుల దీర్ఘము లగుచున్నవనియు సారస్వతానుబంధమున సింహభాగ మదియే తీసికొనుచున్నవనియుఁ గవులు విమర్శకులు తావుచాలక యిఱకట మందుచున్నారనియుఁ గొందరు మమ్ము నిందించుచున్నారని తెలిసినది, నాయనలారా! క్షమింపుఁడు. ఇంతటినుండి తగ్గింపఁ బ్రయత్నింతును...ఆంధ్రపత్రిక నందుకొనువారైదాఱువేల జనులకంటె నెక్కువ లేకపోయినను సాక్ష్యుపన్యాసములు చదువువారు ఏబదివేల జను లాంధ్రదేశమున స్త్రీ పురుషులున్నారు."

'ఆంధ్రపత్రిక అచ్చులోఁబడి చల్లాఱకుండ సిరాకను వెచ్చవెచ్చగ నుండగనే యాస్వాదించి యనుభవింతురే? అక్షరములలో నేమున్నది? రసమా? శక్తియా, ప్రాణమా! ఏమియులేదు. ఏమున్నను శబ్దములలో నున్నది. శబ్దములలో బ్రహ్మమే యున్నపుడు ఇంక వేఱె చెప్పనేల! సాక్ష్యుపన్యాసము లెందరో కంఠస్థము చేయుచున్నార్న సంగతి..."

ఈ యుదాహరణములు పంతులుగారి యాత్మసాక్షి విశ్వాసమునకు (బరమోదాహరణములు. పానుగంటివారు వీరేశలింగముగారి వలె వచనరచనకు నాఁడు చాల

దోహదముచేసిరనుట మనమందఱ మెఱిఁగినదే. తాను వ్రాయుటయ కాక, యువరచయితలకుఁ బ్రోత్సాహము చేసిన షుహాశయము వారిలో గోచరించును. వా రన్న మాటలే కొన్ని :

"వచనమును వ్రాయువానిని తీసివేఁత సరకుగా కుక్కమూతిపిందెగా ద్రుఁణీకరింప న్యాయమా ? పద్యమునఁ గవిత్వముండి వచనమున లేకుండునా ? ఎచ్చట రసముండునో, అచ్చటనే కవిత్వమున్నది. కవిత్వము గుణములో నున్నదా ? అభిప్రాయప్రకటనమే కావలసినది. అన్ని నాగరకదేశములందుఁ చూడ వచన గ్రంథములు లక్షోపలక్షలుగా వృద్ధిపొందుచున్నవి. మనదేశమందట్లు జరుగక పోవుట కడు శోచనీయము కదా ! వచనగ్రంథరచనా బాహుళ్యమునఁగాని భాష యభివృద్ధి పొందనేరదు ... వచనము వ్రాయువాఁడు వట్టి తెలివితక్కువ వాఁడని జనాభిప్రాయమై యున్నది. కవితా మణికోటీరమును ధరించుట కర్హుఁడు గానివాఁడే యీ కట్టెలమోపు మోయఁదగినవాఁడని జనుల నమ్మకము."

లక్ష్య లక్షణ పురస్సరముగా తెనుఁగు వచనమునకుఁ బానుగంటివారు ప్రసాదించిన పుష్టిపౌష్కల్యములు చిరస్పృహణీయములు. 'నాయనలారా !' అన్న సంబోధనమునకు ఆయన జనకుఁడు. సాక్షివ్యాసములలోఁ గొన్ని కొన్ని భాగము లేఱుకొని మనస్సునకు రప్పించుకొన్నపుడుగాని పానుగంటివారి మనస్తత్త్వముయొక్క అనుపానులు కొంతవఱకేని గుర్తించుకొన్నట్లు కాదు. వారి వరివస్య హాస్యరసమాత్ర పరిచ్ఛిన్నమైనదేకాదు. ప్రధానరస పర్యాప్తమైనదన్న రహస్యము సహృదయుఁడు తెలిసికొనును.

మండల మానినీజనమణీ మహాసభ. జంఘాలశాస్త్రికి వింతకల వచ్చినది. ఆయన స్వప్నోపన్యాసములోని తొలిఘట్టము రవంత చిత్తగింపుడు.

"...బిగిమొగ్గలు కొన్ని, రవంత వికసించిన మొగ్గలు కొన్ని, సంపూర్ణముగ వికసించినవి కొన్ని, రాలిపోయిన రేకులుగలవి కొన్ని గల గులాబితోఁటకంటె నా సభ సహస్రాధిక సౌందర్య సమన్వితమైయున్నది. చెంపకొప్పులవారు, ముచ్చటముళ్లవారు, కత్తిరింపుల ముంగురులవారు, కాగితపుఁబూలవారు, కత్తిరింపు బుజ్జులవారు, వాలు కన్నెల వన్నెలాడులు, గుండ్రకన్నుల కోమలాంగులు, అడుసుకనుల యబలా శిరోమణులు, చింపిరికనుల శీతాంశుముఖులు, మెల్లకన్నుల పల్లవపాణులు, ఒంటికంటి యువిదలు,-ఓ-కర్ణాటకవుఁ జీరలతో-బుటేదారి కోకలతో, కలంకారి లంగాలతో పాము మీసపు జనానా కండువాలతో-స్వదేశీయపు సెల్లాలతో, మిలమిలలతో, జిలజిలలతో, కలకలలతో, గణగణలతో, పెటపెటలతో, లొడలొడలతో వహహ్వా ! సర్వజన నయనానంద సంధానధురీణలై ప్రకాశించుచున్నారు. సెంట్లవాసనలు-పూవుల వాసనలు-అగరునూనెవాసనలు-కాంతామణుల ముఖపద్మసౌరభములతోఁ గలసియుండ నచటి

వాయువంతయు మత్తెక్కినట్టు లున్నది. ఆడుది యున్నచోటనే యన్నిసౌరభములు! మగవాఁడున్నచోట నేమున్నది. పొడుముకాసన-చుట్టకంపు-సిగరెట్టు గొట్టు కంటె నేమున్నది! పురంధ్రీమణులచేతను పుష్పకములచేతను గదా భూమి కలంకారము."

వేలకొలఁదిగా నున్న మహాసభలో పానుగంటి సహస్రాక్షుఁడు. ఏయొక సభ్యుని, ఏయొక సభ్యురాలిని చూడకుండ పలుకరించకుండ నుండఁడు. తనతోపాటు తన పాఠకుని గూడ సహస్రాక్షు నొనర్చు నఖండ ప్రతిభాలక్షణము ఆయన కాజానజము. ఒకవస్తువును విమర్శించుట కాయన కైకొన్న వేఱొక అలంబనవస్తువు చిత్రచిత్రముగా నుండును; ఆయన దేనిని న్యూనముగా భావించఁడు. సర్వ మానవాను భవసామాన్యమైన వస్తువు నాధారము చేసికొని లాస్యముచేయును. 'పాచక మహాజన సభ' సాక్షివ్యాసము చూతురుగదా!

"వృత్తు లన్నిటిలో వంటవృత్తి మొదలు"-మహాకవి గంటదాసుగారి సూత్రము. ఈ వృత్తి కళయా శాస్త్రమా అని కృతయుగమునుండియు పూర్వపక్ష రాద్ధాంతము లగుచునే యున్నవి. బుద్ధదేవుని ప్రకారము ఇది కళ, కాని అశోకాదుల మహాసభలో నిది శాస్త్రమని నిర్ణయింపఁబడినట్లు తాళపత్ర గ్రంథములలో ఉన్నట్లు తెలియుచున్నది. ఇది కళయనియే నానమ్మకము. గానము, శిల్పము, చిత్రలేఖనము, కవిత్వము అను కళలు దీనికాలిక్రింద దిగిదుడుపు. అవిలేకున్నఁ ప్రపంచమునకు నష్టములేదు. ప్రపంచమున భైరవి రాగము లేకపోయిన ప్రాణోపద్రవ మేమియులేదు. కాని మహానసప్రపంచమునఁ బప్పులేకపోయిన యెడల ఎంత ప్రాణసంకటమో యోచింపుడు. పేరొందిన టాజ్‌మహల్ పెసరట్ల పలావుకంటె నెక్కువదికాదు. కన్నుల నిండుకంటె కడుపునిండే ఘనమని పాశ్చాత్యపండితులు బ్రహ్మసూత్ర నిర్మాణము చేసినారు. తిరుపతి దేవస్థానము దేశమున కొనర్చిన మేలుకంటె ఒక నీరుల్లిపాయ ప్రపంచమున కొనర్చుచున్న యుపకారము శతసహస్ర గుణాధికమై విరాజిల్లుచున్నది. పులుసు గూనలముందు రంగుచిప్పలాగునా! రవివర్మ రాయబారపు సభామండప మంతము మా కామిగాడు చేసిన కందబచ్చలికాడ కూర కాలిగోటికి సాటియగునా!

ఇఁక మన కళయందు కవిత్వ మేపాటిదో విమర్శింతము. మనకళకు ఆరు రసములు. కవిత్వమునకుఁ దొమ్మిది రసములు. ఆరైనను మనవి ప్రత్యక్షరసములు. తొమ్మిదియైన నవి పరోక్ష రసములు. మన రసము లారును మనకళకుఁ బ్రాణములు. తొమ్మిది రసములు కూడఁ గవిత్వమునకుఁ బ్రాణములని చెప్పుటకు వీలులేదు. శృంగార వీర కరుణము లను మూఁడురసములే కవిత్వమునకుఁ బ్రధానరసములు. మిగిలిన యారురసములను గవిత్వప్రపంచమునుండి తీసివైచినను, గవిత్వమున కంత నష్టిలేదు ఏది! ఏది! మన ఆరు రసములలో నొక్కదానిని తీసివేయుడు. చూతము. తీసివైచుట వఱకెందులకు? రవంత తగ్గింపుడు. ఎంత లోపముగా నుండునో!

ఆపదార్థము వెంట కర్త్వమగునుగాని యనుభవమున కర్త్వముకాదే ? హెచ్చుకాఁగూడదు. తగ్గకూడదు. ఆ రస మాపదార్థమునుండి మొలిచివచ్చినట్లుండవలెను. శాకుంతలములోఁ గొంత శృంగారరసము తగ్గినను 'చలామణి' యగునుగాని చిత్రాన్నములో చేరె డుప్పెక్కువకానీ, కుక్కయైన మూర్కొనునేమో ; అదిగాక, కవితారసములలో రసములకు అన్యోన్య విరుద్ధభావమున్నది. మన కళలో అన్యోన్య సామరస్యమున్నది... వంకాయపచ్చడిలో ఉప్పు పులుసు కారము మూఁడు రసములున్నవి. ఆరు రసములు కూడ నొకచో అవ్యాహతముగా అనుసంధింపవచ్చును. ఆ వస్తు వేదియో యెరుఁగుదురా? ఆవకాయ యని యానందవాచక పుస్తకములలోఁ జెప్పఁబడియున్నది (బెల్లవుటావకాయ కాబోలు! ఏడ్చినట్లేయున్నదని యొకవితంతువు సణుగు). గరిటె ననుసరించి గంటము నడచుచున్నది..."

ఈ వ్యాసము ముగింపులో పాచకునితోఁ బలికించిన మాటలలోని అర్థాగతమైన హాస్యరసము పానుగంటివారి వశ్యవాక్త్వముయొక్క నిష్యందలవము. "...ఇప్పు డాంధ్రదేశమున నున్న కవులందఱు వంటవాండ్రగునెడల భరతమాత పరమానంద మున తాండవించును. కవుల లెక్కేమి ? నలుఁడు వంటవాఁడై స్వరాజ్యమును సంపా దిందుకొన్నాఁడు భీముఁడు వంటలవాఁడై స్వరాజ్యమును సంపాదించుకొన్నాఁడు. ఇటులే కవులెల్ల పాచకులగు నెడల స్వరాజ్యము మన కవలీలగ రాఁగలదు...."

స్వరాజ్యము వచ్చినచో మనకవుల కయిదువేళ్లు లోపలకుఁ బోవునని పానుగంటి వారి తలంపుకాఁబోలు ! కడుపునిండ కవులకు భోజనమున్నచో స్వరాజ్యమును దేశ మునకు వారే తీసికొనివత్తురని వారి విశ్వాసము కాఁబోలు ! పై వాక్యములన్నియు బహు ముఖార్థములకు అభివ్యంజకములు. వట్టినే నవ్వు పుట్టించుటకు మాత్రమే పుట్టినవి కావు. ఏతాదృశమైన వచోవిన్యాసము నాన్యతోదృష్టమైన పానుగంటివారి యదృష్టము.

పట్టి చూచినచో, పానుగంటివారిది గోడమీది పిల్లి వాటము కాదు. ఆయన చూపు ఎటువైపునకు వ్రాలునో మనకు విస్పష్టము. రాజకీయములు -పురాణము- మతము- సంప్రదాయము- ఆంధ్రత్వము- వేషభాషలు- నాగరికత- ఇత్యాద్యంశ ములపై ఆయన తన నిశ్చితాభిప్రాయములు బహుముఖోల్లేఖనము గావించిరి. ఆస్తి కత్వము ఆయన యంతరంగమునకు మూలపీఠము.

పురాణపఠనమర్యాద మనపూర్వులెందులకు ఏర్పఱచిరో పానుగంటివారి నోట వినవచ్చును.

"ఉదయము మొదలు సాయంకాలము వఱకుఁ బ్రతిజనమునకు ఏదో కాంక్ష! ఏదో దేవులాట! చిక్కేకదర ! ఒక గడియసేపైన నిశ్చలముగా నీశ్వరధ్యానము చేసికొనుట కవకాశము లేదుకద ! కుండలో బియ్యము నిండుకున్నవనియో నగలు లేక భార్య

మూతి ముడుచుకొని పండుకొన్నదనియో, పరిపాలకుఁడగు ప్రభువు మొగ మెఱ్ఱబడిన దనియో, కన్నపుత్రుని యొడలు వెచ్చఁబడిన దనియో, పరశురామ కటాక్ష మింటిపైకి వచ్చినదనియో, విడిభైదుకై యప్పులవారు తనపైకి వారంటు తెచ్చిరనియో, యెందు లకో మఱెందులకో! జాగ్రదవస్థలో నందఱు పాదుషా మొదలు పకీరు వఱకు లోలో వలనో కూనిరాగముతోనో బొరుషని పైస్థాయిలోనో యేడువ వలసినవారేకద! వారిని గొట్టియో వీరిని దిట్టియో హస్తలాఘవము చేతనో కనికట్టుచేతనో దౌర్జన్యము చేతనో దైన్యముచేతనో యేలాగుననో యొకలాగునఁ బగలెల్ల కాలక్షేపమగుచున్నది. బ్రతుకునకై ప్రాకులాడు టిట్లందఱకు సహజముగా నున్నదేకద! ప్రాణయాత్ర కొఱకై పడుచున్న యీ పాటులతోఁ బగలు వ్యర్థమైనట్లే రాత్రికూడ వ్యర్థమైనయెడల బ్రతుకంతయు వ్యర్థమగుననియెంచి మనపూర్వులు పురాణపఠన మర్యాదను స్థాపించిరి..."

మఱియొకచో నవ్యకవిత్వము మీఁద పంతులుగారి యభిప్రాయము పరికింప వచ్చును. తాను (పానుగంటి), నన్నయ, తిక్కనలు- ఈ మూవురతో స్వప్నకథ.

నేను:- నవ్యకవిత్వ మని సరిక్రొత్త కవిత్వము బయలుదేఱినది.

నన్నయ :- అది యెక్కడనుంచి వచ్చినది!

నేను :- అది తూర్పుగాలితో వచ్చిన తుపాను. ఏమి చెప్పుదును తాతగారూ! యతులు లేవు, ప్రాసములులేవు, సంధులులేవు. ఛందస్సులేదు. శబ్దశుద్ధిలేదు. చిట్టిచిట్టి పాటలు, పొట్టిపొట్టి పల్లవులు. పోనీ, గానమర్యాదను జూతమన్న తాళము ధ్వస్తము; రాగము సంకరము.

ఉదా॥ "చెంబుపై చుక్క అప్పున జాఱిపడగ.
చిలుక కులుకుచు దిశలతో నేకమయ్యె."

తిక్కన :- ఏలాగు! ఏలాగు! దీని కర్థమున్నదా!

నేను :- ఇందులో నున్న సొగసే అది! చెంబు అనఁగా ఘటము. ఘట మనగా నీ శరీరము. చుక్క యన్నప్పుడు తేజస్వంతమైన పరమాత్మ. చెంబుపై చుక్క అప్పున జాఱిపడగ అనగా మనుజునకు భగవత్కటాక్షము కలిగినపుడని యర్థము. చిలుక కులుకుచు దిశలతో నేకమయ్యె ననఁగా భక్తిచే నార్ద్రమై జీవాత్మ పరమాత్మతో నైక్యమయ్యెనని యర్థము.

తనకాలమున నొకవైపు క్రొత్తగా నల్పసంస్కారముతోఁ దెలిసి తెలియక వ్రాయుచున్న నవ్యకవులనుగూర్చి పానుగంటివారి యధిక్షేప మిట్లుండెననుటకుఁ బైమాటలు తారకాణము. ఇక్కడి తూర్పుగాలితో వచ్చిన తుఫాను అనగా, గురజాడ అప్పారావుగారి, రామమూర్తిపంతులుగారి భాషా సంస్కరణోద్యమము అనుటస్పష్టము. పానుగంటివారు సలక్షణభాషావాది. ఆయనకు వ్యావహారికము నచ్చినది కాదు. 'గ్రామ్య

వాదుల భాషాపవాదము' అను పేరుగల ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికాప్రకటిత వ్యాసము వారి సిద్ధాంతమున కనుప్రాసము. "గ్రాంథికభాష మృతభాష యనునంశమే గ్రామ్యవాదుల వాదమున కాయువుపట్టు. ఇది నిలువఁబడినఁగాని వారివాదము నిలువఁ బడదు. అది ఆయుర్గ్రంధి యన్న మాటయే కాని యా ముడి ముట్టుకొనుపరికే వీడి పోవుచున్నది. శ్రీ శంకరాచార్యులవారు బౌద్ధమత ఖండన ప్రశంసలో బౌద్ధవాద మిసుకనూయి వలె నున్నదని సెలవిచ్చిరని వింటిమి. ప్రయత్నమునఁ బూడ్ప నక్కఱలేకుండఁ దనంతదాను బూడిపోవుచున్నదఁట. గ్రామ్యవాదుల భాషామృతి వాదముకూడ నట్టేయున్నదని మా యభిప్రాయము"ఁ సరియ. పానుగంటివా రిట్టి ఖడ్గవాదము చేయుటయేకాక లక్షణశుద్ధమైన తన భాషతోనే లక్షాధికులైన సామాన్య పాఠకుల హృదయములందును స్థిరప్రతిష్ఠ నేర్పఱచుకొన గలిగెననఁగా అది వారి కలములోని ప్రాణబలము.

పానుగంటివారు కొన్ని చిన్నకథలును వ్రాయకపోలేదు. దొంగటెల్గ్రాము, బుడబుడక్కలవాడు, తఱాపాలెము, క్రొత్తరాణి. వానిలోఁ గొన్నిశీర్షిక లివి భారతిలో 'రామరాజు'వంటి కథలు కొన్ని ప్రచురితములైనవి. ఏమైనను సాక్షి వ్యాసరచనకుఁ బూర్వము సాగిన సాధన దశయే యది యనిపించును. ఎంత దవ్వుల నున్నను పానుగంటివారి వ్యాసోపన్యాసకంఠమును పాఠకుఁడిట్టే పట్టివేయఁగలఁడు. రచయిత లలో నిది తక్కువమందికి మాత్రమే లభించు మహాసిద్ధి. మన తెనుగుభాషలో నెట్టి శైలీవిశేషములు రావలయునో వారు చెప్పియున్నారు.

"చిత్రములైన శైలీభేదములు మనభాషలో మిగుల నరుదుగా నున్నవని వేరే చెప్పనేల! రైమని పేకచువ్వ పైకెగిరి నట్లున్న శైలిభేద మేది? కాకి పైకెగిరి యెగిరి ఱెక్కలు కదలకుండ జందెపుఁ బెట్టుగ సాపుగ వాలుగ దిగునప్పటి లఘుపతన చమత్కృతి కనఁబఱచు శైలిపద్ధతి యేది? తాళము వాయించు నప్పటి తళుకుబెళుకులు, టింగుటింగులు, గలగలలు, జలజలలు గల శైలియేది? భయంకరమయ్యును మనోహరమై మహాశక్తి సక్తమయ్యును మార్దవయుక్తమై, ధారాళమయ్యు విశాలమై, స్వభావ సమృద్ధమయ్యు సరసాలంకారభూయిష్ఠమై, సముద్రఘోషము కలదయ్యు సంగీత ప్రాయమై, స్పష్టీకృత సకల విషయ తత్త్వమయ్యు నస్పష్ట స్వకీయతత్త్వమై చదువరులకుఁ గనుకట్టి వాకట్టి మదిగట్టి తలపులిమినట్లు శ్వాసమైన సలుపకుండఁజేసినట్లు ముష్టివాని చిప్పనుండి మూర్ధాభిషిక్తుని కిరీటమువఱకు, భూమిక్రింది యరలనుండి సముద్రములోని గుహలవఱకు, ఎవరెస్టుకొండనుండి యింద్రధనుస్సువరకు, మందాకినీ తరంగ రంగద్ధం సాంగనా ప్రేంకారమునుండి మహాదేవ సంధ్యాసమయ నాట్య రంగమువఱకు మనోవేగముతో నెగురుశక్తి గల చిత్రచిత్ర శైలీభేదము లింకనెన్నియో భాషలో పుట్టవలసియున్నది..."

వింటిరా! పానుగంటివారి వచనశైలినిగూర్చి మాదృశుఁడు చెప్పయత్నించుట- అచ్చముగా, వసంతునకుఁ గుసుమార్చనము చేయుట. అబ్ధికి అభిషేకముచేయుట. వారి వ్యాసములలోని మాటలే ప్రోవుచేసి తిరుగఁజెప్పినచో సత్యకథన మగును. గత్యంతరము లేదు. అది యటుండె:

శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహరావుగారి సారస్వత మహావతరణమున మాన వాంతరంగ సంస్కరణ ప్రణవమైన సాక్షివ్యాసరచన నరభాగమగుచో, శైవభావనా వేశకారణమైన నాటకరచన సింహభాగము. వెరసి నరసింహకీర్తి లక్ష్మీ పురస్సరము

సింహభాగమైన నాటకరచనలో పానుగంటివారు సమార్జించుకొన్న యశస్సు సహృదయులకుఁ బ్రహ్లాదకమైనది; పురోభాగులకది గుండెగాలము. ఆయన మొత్తము నాటకములు ముప్పదియో ముప్పదిమూఁడో లెక్కపెట్టుచున్నారు. సంఖ్యకేమి? అసంఖ్యాకులైన ఆంధ్ర రసికజనులు వారినాటకములు చూచి, చదివి, విని పులకితు లగుచున్నారు. పాదుకాపట్టాభిషేకము, విజయరాఘవము, వనవాసరాఘవము, కళ్యాణ రాఘవము రామాయణ నాటకములు; నర్మదాపురుకుత్సీయము, రాధాకృష్ణ పౌరాణిక ములు; సారంగధర, ప్రచండ చాణక్యము చారిత్రకములు; కంఠాభరణము మొద లగునవి కల్పితములు; పాదుక, రాధాకృష్ణ, సారంగధర, కోకిల, కంఠాభరణము... ఇవన్నియు నెన్నోతూరులు రంగస్థలముల యందు అసకృత్ప్రదర్శితములై ప్రేక్షక ప్రశంసలకు భాజనములైనవి. ఆనందనిష్యందులగు వారి రూపకములు విదగ్ధులకు ఎంత తృప్తి కలిగించినవో, సాధారణులకు నంత తుష్టి యొదవించినవి.

వ్యాసరచనయందే కాదు. నాటక సంఘటనమునందు పానుగంటివారి ప్రతిభ నైసర్గికముకాని ఔపాధికము కాదు. ఒకకవి వ్రాసిన కావ్యము ఇంటిపట్టు విడిచి వెళ్ళ లేదు. వేఱొకనిది సుహృద్భవమువఱకు యానము చేయును. మఱియొక కవి దటులు కాదు, అవిదగ్ధ వర్గముల యందడుగుపెట్టి విశ్వకుతూహలివలె సంచారము చేయుటకు సమర్థము పానుగంటివారి యే రచన యేనియు విశ్వకుతూహలి· పానుగంటి వారి నాటకములలో గీతములు ఆటవెలఁదులు మేటిచోటు నాక్రమించుకొనినవి. తరువాతి స్థానము సీసములది. వృత్తములు వెదకి పట్టుకొనవచ్చును. జాతిచ్ఛందములు నాట కములకు నప్పియుండ నన్న అనుభవరహస్యము పానుగంటివారికిఁ దెలియును. వారి నాటకములలో సంభాషణములు సన్నివేశములు లోకోత్తరాహ్లాదము కలిగించును. ఎంత సంయమము, తత్తత్సంభాషణ సమయముల గోచరించునో, అంత యుద్వేగము కూడ నొక్కొక్కయెడ తలసూపక పోదు. పండితానంద ప్రదమైన హాస్యముతోపాటు పామర ప్రమోదజనకమైన హాస్యమునకును వారినాటకములు తెఱచినపేటికలు. ప్రత్యే కించి యొక్కొక్కనాటకమును గూర్చియుఁ జెప్పికొనుట కిది యదను గాదు. సముదా యముమీఁద వారు చూపిన చమత్కృతులు, బహుశాస్త్రములతో వారి పరిచయము,

వారి పద్యరచనారీతులు, వారి లోకానుభవా నుభావములు, వారి భక్తిభావము మున్నగు నవి నాటకరాశినుండి కొంత కొంత యవలోకనము చేసి కొనుటయే సమయౌచిత్య పోషకము.

ఆనాఁటి పెద్దలచే-అభినవకాళిదాసు'గా కొనియాడఁబడిన పానుగంటివారు ఉప మాలంకారప్రయోగమున అద్వితీయ ప్రతిభాధౌరేయులనుట నిస్సంశయము.వారు కయి కొన్న ఉపమానములు, అర్థాంతరములు పెక్కులు నేఁటి లోకమునకు నేఁటికాలమునకు జెందినవై యుండి, భావులకు అలౌకికము త్రైకాలికమునగు రసానందము కలిగించు చుండును. అదియొక విశేషము.

పట్టభంగరాఘవమును పరికింతము. దశరథుఁడు రామచంద్రునకు అభిషే కము చేయ సంకల్పించినాఁడు. వసిష్ఠుఁడు ప్రక్కనేయున్నాఁడు రాముఁడు వచ్చి నాఁడు. 'వత్సా! నిన్నుఁ బిలిపించిన యంశమేదియో యెఱుఁగుదువా ?' అని యుపక్ర మించి ఎక్కరాని గుట్టలనెక్కి కనఁబడిన ఱాళ్ళకు మ్రొక్కి కడకు నిన్ను యజ్ఞదేవ దత్తవర ప్రసాదమునఁ గంటిని. నలువురు కొడుకులతోనున్న నన్ను వసిష్ఠుఁడు భుజ చతుష్టయ వినిర్భిద్రుఁడైన మహావిష్ణువుతోఁ బోల్చుచుండును. అది ఆయన అనుగ్రహ బుద్ధి! అవునా ?

"కొడుకు లెందరున్నను బెద్దకొడుకు తన ము
ఖాగ్రమున నున్నపుడె తండ్రి యలరు మిగుల;
ముండులను బెద్దముల్లు పండ్రెండు చేరి
నపుడె గంటఁగొట్టెడు గడియార మటులు."

పెద్దముల్లు పండ్రెండు దగ్గరకుఁ జేరినపుడే గడియారము గంట గొట్టును; పెద్దకొడుకు తన ముఖాగ్రమున నున్నపుడే తండ్రి కానందము! గోడగడియారము వంక చూచుచు నీ పద్యమును భావించు పానుగంటి తెలుఁగువారి యింటింట జయఘంట.

దశరథునకు మంథరపై కోపము. గూనిదాసి కైకతో లేనిపోని కల్పనలుచేసి చెప్పునని ఆతని బెదురు. ఏమైనను, గూనిదాసిని కూడగట్టుకొనక పోయినచో రామా భిషేక కథ యడ్డము తిరుగునుగదా! దశరథుఁ డిటు లనుకొన్నాఁడు.

"నవరసామోదయైన యీ నాతి కొరకు
గూనుదానిని గూడను గూడగట్టు
కొనఁగవలసె; నుద్గ్రంథంబుకొఱకుఁ జంక
బెట్టఁబడిన కత్తెరకాళ్ళపీఁట వోలె!"

మంథర కత్తెరకాళ్ళపీఁట వంటిదఁట. కైక ఆ పీఁటమీఁద నుద్గ్రంథము; వ్యాసపీఠ మును కత్తెరకాళ్ళపీఁట యనుటలో గూనుదాసిని స్ఫురింపఁ జేయుటయే. నవరసామోద

ఉద్గ్రంథము- ఈ పదములు మనోహరార్థమునకు అభివ్యంజకములు. ఉపమాద్రవ్య సముచ్చయమును పానుగంటి తాను వ్రాసికొను గదిలోనుండి స్వీకరించి పాఠకుని మదిలో నిట్టే ప్రవేశించును. ఆధునికములైన అర్థాంతరన్యాసములు వారి కలము పంటలు. రాముఁడు అరణ్యవాసమునకుఁ బోవుచున్నాఁడు. లక్ష్మణుఁడు 'అన్నా! నన్ను నీవెంటఁ గొనిపొమ్మ'ని కోరుచున్న సందర్భములోని పద్యము.

"మనకుఁ దనువులు రెండైన జనన మాది
కలసియుంటచేత గతియొక్కటియె యగును-
కలము రెండైన మొనలను గల్గియున్నఁ
గడకు ఫలమైన వ్రాఁత యొక్కటియె కాదె!"

చివర కా యిర్వురకు వనవాసము వ్రాఁతయైనది. పానుగంటివారి కాలమునకు కలములు వచ్చినవి. గంటములు పోయినవి. కలము రెండుమొనలతోఁ గనిపించినను కడకు దానిఫలమైన వ్రాఁత యొకటియేకదా! రామలక్ష్మణులకు శరీరములు వేఱైనను గతియొక్కటియే. ఓహో! హృదయస్పృశమైన యర్థాంతరన్యాసము! రామకాలమున నేఁటి కలములవంటి కలములున్నవా? యని యధిక్షేపము వచ్చినచో నొక నమస్కారము! రామలక్ష్మణులు తెలుఁగులోనే మాట్లాడుకొనిరా? లక్ష్మణుఁడు తేటగీతము లోనే యన్న నడిగెనా? అనియు నాక్షేపములు మొదలు పెట్టినచో మఱిరెండు నమస్కారములు:

రాముఁడు వనమునకుఁ బోవుచుండఁగాఁ దల్లి కౌసల్య నేనును నీవెంట వత్తు ననెను. అపుడు రాముఁ డన్న యీ మాటలివి:

"తనుజయుగిఁ బాసి తనువోపఁ దగని ముసలి
నిన్నుఁగూడను బాసిన నిలువఁగలడె!
యడుగు శంకులు రెండూడ నలల నాఁడు
పటము పైత్రాడునుం బాయునటులు తల్లి!

గోడమీఁద రెండు మేకులు ఇటునటు కొట్టి దానిమీఁద పటము నిలఁబెట్టి పైభాగమున నొకత్రాడుకట్టి కొంచెము ముందునకు వ్రాలునట్లుచేసి, ఆత్రాడు, మేకునకు తగిలింతుము. ఇట్టి పటము లింటింట అలంకరింపఁ బడునవేకదా! పానుగంటివా రీ సామ్యమును గైకొని యెంత సొగసుగాఁ జెప్పినారో! చూడుడు. అడుగున నున్న శంకులు రెండు నూడిపోయినచోఁ బటము పైత్రాడుతో వ్రేలాడుచుండును. పటము బరువంతయు త్రాడే మోయజాలదు. అది దుర్బలమై తెగిపోవుట సంభవించును. తల్లి! తనుజయుగీ వియోగముతోఁ దనువోప దగదని నాతండ్రి నిన్నుగూడఁ బాసినచో నిఁక నిలువఁ బడఁజాలఁడు. ప్రత్యక్షవస్తు పరిశీలనములో పానుగంటివారి బుద్ధి సాక్ష్యము విద్యుల్లేఖ వంటిది.

మఱియొకచో, కైకేయి స్వభావమునుగూర్చి చెప్పుచు వ్రాసిన యీ పద్యము లోని భావము సర్వానుభవ సన్నిహితమైనది.

"ఇట్టి చంపునట్లెంచి బాధించు నట్టి
జనులు హానిసేయరు పంటిసలుపు వోలె
ఉన్నజాడయే కనఁబడ కుండువారు
ప్రాణములు పీల్తు రిట్టి హృద్వ్యాధిఁ బోలె."

చంపునంతగా బాధించును గాని పంటిసలుపు ప్రాణహాని సేయదు. ఉన్నజాడ కనఁబడకుండ నున్న గుండెజబ్బు ఇట్టే ప్రాణము దీయును. కైకేయి ప్రకృతి పంటి సలుపు వంటిది. ఆమె వలనఁ బ్రమాదము రాదు. మంథర గుండెజబ్బు వంటిదేమో! లౌకికములను పోలిక లెంత యలవోకగా స్ఫూర్తికి వచ్చునో, అలౌకికములును పాను గంటివారి కంతే. వనవాస యానారంభమునఁ బ్రపంచవైఖరిని దలంచుకొన్న రామునిచేఁ బలికించిన యీ మాటలు భావించిన వారికి సారస్వత యోగసాధకులలో పానుగంటి యేనుఁగు వంటివాఁడ నిపించకుండునా?

"ఘన తరంగా హతాంగంబుఁ గలిగి కరము
నెత్తి నది దాఁటు కరివోలె నెన్ని యాప
దలు సుఖంబులు కదిసిన విలసదూర్ధ్వ
దృష్మనస్కుఁడౌ నరుఁడుత్తరించు భవము"

వనవాస రాఘవములో పంచమాంకమున అంతర్నాటకము జరుగును. ఉత్తర రామ చరిత్రానుసారిగా నీ కల్పనము చేయబడినది. లంకాప్రవేశము మొదలు శ్రీరామ దర్శనము వఱకు నడుమనున్న గాథ కేసరిపుత్త్రుఁ డొక నాటకముగ రచించినాఁడు. దాని నిప్పుడు ప్రదర్శించి శ్రీరామమూర్తి సమస్తవిశేషములతో నిట్టి పవిత్రవృత్తాంతము నివేదింపఁ దలచినాఁడు. ఈ యంతర్నాటకమునఁ బానుగంటివారి కవిత్వ సిద్ధాంతము పరోక్షముగాఁ జెప్పబడినట్లైనది.

రాముఁడు :- తమ్ముడా! కూరుచుండుము. తొందరలేదు. ఆహా! భావనాశక్తి మహిమ!

గీ॥ "ద్వైతి భావనచే దైవదర్శి యగును;
భావనాశక్తి నద్వైతి బ్రహ్మమె యగు;
నందఱగుఁ దాను కవి భావనాధికతను
సృష్టి దైవ భావనను సిద్ధించెఁగాదె!"

గీ. "కవిత యాంతరసృష్టియౌఁగాని తత్స
మయము నందుఁ బ్రత్యక్షమౌ మహిత వస్తు
పాళి మెల్లఁగఁ గావ్య కల్పనముఁ జేరు
బాహ్య నినదాది గతులు స్వప్నమున వలెను."

ఇది యిట్లుండఁగా, తెలుఁగుదేశమున నలుచెఱఁగులఁ బ్రతిస్వనితములగు చున్న వారి నాటక పద్యములు చాటునకుఁ బెట్టుట యెవ్వని తరము!

"చిదిమినఁ బాల్గాఱు చెక్కుటద్దములపై
జిలిబిలి చిఱునవ్వు లొలయువాఁడు
కాళ్లగజ్జలు గల్లు గల్లు మనంగ నం
దటి కనుల్ చల్లఁగాఁ దిరుగువాఁడు
బుడి బుడి నుడువులఁ బూర్వ భూపాల గా
థల నేను గుడుచు బోఁ బలుకువాఁడు
రాఘవా! ముద్దీయరా, యన్న నెగిరి గం
తిడుచు హాయిగఁ' గౌఁగిలించువాఁడు

నట్టి పదునాలుగేడుల బొట్టె నెట్టు
లసుర భీకర వనసీమ కంపువాఁడ
ననుచు నేడ్చితి నెప్పుడో యపుడు; మఱల
నిపుడు నీమూలమున నిట్టు లేడ్చుచుంటి.

ఇది సీసమో, కరుణరసమో! సర్వతస్సంచార శీలములైన పద్యములలో నొకటి చిదిమిన పాల్గాఱు, కాళ్లగజ్జెలు, బుడిబుడి నుడువులు, చెక్కుటద్దములు మొదలగు మెత్తని తెలుఁగు పదములు శ్రీరామచంద్రుని శైశవమునకును దశరథుని తత్కాల శోకమునకుఁ చరమాభివ్యంజములుగా నున్నవి. కొన్ని పద్యములలో పానుగంటివారికి బోతనగారితోఁ బోలికలు చెప్పవచ్చును. రాధాకృష్ణ నాటకములోని యీ పద్యము పానుగంటివారి వేణుగానలోల భక్తికి మూదల.

"మెఱుఁగు గుండలముల మిసమిసల్ గండ భా
గములపై నట్టిట్టు గంతు లిడఁగ
రంగారు కటినుండు బంగారు పుట్టంబు
చిరుబొజ్జనుండి కొంచెముగ జాఱఁ
బవన పూరణమున జవుజవ్వు మని లేఁత
బుగ్గలు బూరెలై పూరటిల్ల
నిగనిగల్ గల గుజ్జుసిగ నున్న శిఖిపింఛ
మొయ్యారమునఁ దల యూఁపుచుండ

నుత్తమోత్తమ జన్మమై యొప్పు మురళి
నధరమున మోపి జలుజల్లు మనఁగ జగతి
గానమును జేయు కల్యాణకాంతు లొలుకు
నీదు వదనంబుఁ జూపింపు నీరజాక్ష !

జ్ఞానము, కర్మము, భక్తి యీ యోగత్రయము పానుగంటివారు కూలంకషముగా వివేకించినవారు. జ్ఞానగమ్యుఁడగు భగవంతుఁడు భక్తికిఁగూడ గమ్యుఁడని ఆయన నమ్మినఁవాడు. విగ్రహారాధనము నాయన కాదన్నవాఁడుకాదు. రాధాకృష్ణలో గృష్ణునిచే ననిపించినమాట—

"వర్ణతతిఁ జూచి వ్రాసియుఁ బలికి మఱి గు
ణించినను గాని పాండిత్య మెటుల రాదో,
మొదట నట్టులు విగ్రహ పూజ లేక
ముక్తి సాధనమగు భక్తి పుట్ట దెపుడు.

పానుగంటివారి వివిధశాస్త్ర కళా విజ్ఞానమునకుఁ ద్రవ్వితండములైన యుదాహరణములు వారి నాటకములే యెత్తిచూపును.

రాధాకృష్ణలో— ప్రాతఃకాలమున వచ్చిన యొకనిని జూచి వేఱొకఁడు "ఏమిరా? శేషవర్జ్యమువలెఁ బ్రొద్దుటనే సిద్ధమైతి' వనును. ఈ శేషవర్జ్య మన్నమాట. జ్యోతిశ్శాస్త్రమునకు సంబంధించినది. వర్జ్యమఁనగా విడుపఁదగినది. రాత్రి తుదిగడియలలో నారంభమై యుదయమునకు ఒకటి రెండు గడియలో విఘడియలో శేషించి యున్న దానిని శేషవర్జ్య మందురు. శేషవర్జ్యము ఎట్లు విసర్జింపఁదగినదో నీవును అట్టివాడవే యనుట.

పాదుకలో— ఒకచోట 'మూలానక్షత్రమునకు రెండువర్జ్యాలు లాగున నీకు ఇద్దరు కొడుకులు' అందురు.

పురుకుత్సుఁడు పురుషరూపముతోఁ దనకుఁ జికిత్సచేసిన నర్మద వలన ఆరోగ్యవంతుడయ్యెను. ఆమెను నర్మదగా గ్రహించి పరస్పరాంగుళీయక ధారణమచేసిన సమయమునఁ బురుకుత్సుఁ డనుచున్నాఁడు—

"కరము కరమునఁ జేర్చ నుంగరము లిచట
దనరు కర్కాటలగ్న జాతకుఁడనైన
నాకు గురుశుక్రు లిద్ద అనారతంబు
భాగ్య కోణంబునకుఁ జేరు పగిది గాఁగ"

రాధాకృష్ణలో-సత్యభామాగర్వభంగమును గూర్చిన ప్రసంగములో శారదుఁడన్నాడు. గర్వమునకుఁ బ్రాయశ్చిత్తము గర్వము యొక్క ప్రారంభదశలో జరుగరాదు

ముదిరిన తరువాత జరుగవలెను. అనుదాని కుదాహరణము "అంతర కుసుమము క్రమముగానెదిగి కనీనికా రంధ్రమంతయు వ్యాపించిన దృష్టిని పూర్తిగాఁ బాడుచేసినఁ గాని దానికి శస్త్రచికిత్స చేయకూడదు."

అంగ్లవైద్య పరిజ్ఞానము, ఆయుర్వేదవిజ్ఞానము పానుగంటివారికి లెస్సగాఁ దెలియుననుటకు దృష్టాంతములున్నవి; పుచ్చుకొలఁది రేవల్చిన్ని పొలుపుగాంచు అని యొకచో బుద్ధబోధ సుధలోఁ జెప్పిరి. రేవల్చిన్ని యనునది యొకయోషధి. అది యాసవారిష్టములు నిలువయుండుటకు నుపయోగింతురు. రేవల్చిన్ని యెంత పుచ్చిన నంత శ్రేష్ఠము. పానుగంటివారి తండ్రిగారు గొప్ప ఆయుర్వేదవైద్యులు. కొన్ని బిరుదములమీఁద లక్ష్మీనరసింహరావుగారి కేవగింపు. నర్మదాపురుకుత్సీయములో వైద్య విదూషకుల యీ సంభాషణములోని రహస్యము ఏమగును!

విదూ : అయ్యా! తమ పేరేమి?

వైద్య : అమృతహస్తుఁడు.

విదూ : (తనలో : తెలివితేట లెటులున్నవో కాని పేరుమాత్రము విన్నకడుపు చెక్కలగుచున్నది) (ప్రకాశముగ) అయ్యా! తామెప్పుడైన పెరుగు తోటకూర పులుసు పుచ్చుకున్నారా?

వైద్య : ఇప్పుడు దాని ప్రశంసయెందుకు?

విదూ : వైద్యులుగాన నడిగితిని. పెరుగు తోటకూరలోని పెరుగు ఆవు పెరుగా! గేదెపెరుగా! దానిగుణమేమి? ఈ రెండు సంగతులు తెలియవలెను.

వైద్య : వెఱ్ఱివాఁడా! పెరుగు తోటకూరయని విన్నంత మాత్రముననే యందులో పెరుగు గలదని యెంచితివా?

విదూ : అలాగుననా? అయ్యా! తమ అమృతహస్తనామ మట్టిదే కద! అవ్యుత్పన్నులు అసమర్థులు వేసికొన్న బిరుదములమీఁద పంతులుగారి యధిక్షేప మెంత సుకుమారముగా నున్నదో, చూచితిరా!

పానుగంటివారి కాలములో ఆశుకవుల యడావుడి యధికముగా నుండెడిది. కంఠాభరణములోని రామలక్ష్మణులు ఆశుకవులు, సుబ్బిసెట్టి షష్టిపూర్తి మహోత్సవములో వారి పద్యప్రదర్శనము జరుగును

సుబ్బిసెట్టి పురోహితుఁడు శివయ్యశాస్త్రిలు ఆశుకవులను చూచి 'కవిచెప్పఁగల రేయని యంటిరిగదా-కవియనఁగా (గవిత్వమను నర్థమున్నదా? అని' యడుగును. రాముఁడందుకొని "గంగదాసు మహాకవి ప్రయోగమున్నది. బండిరా పొగబండిరా దొరలండు రైలుబండిరా మండలంబున గంగదాసు వుండి యీకవిచెప్పెరా." శాస్త్రిలు

గారూ ! ఆశుకవితయొకటి యావుపేడయొకటి, స్వయము గాఁగ శుద్ధచయము భువిని, వానికిలను వేరు పరిశోధనము కూడ, దవనిఁ జెలఁగ వెలయనమరభువిని."—అని ఒక ఆటవెలది చదువును. మరియు రామలక్ష్మణుల ఆశుధోరణి పద్యములు పానుగంటివారు వ్రాసినవి కడుపు చెక్కలు చేయును.

క. "తోడాలివలేవో ? గుడి
ఘొడాయై నివ్వలేవొ ? కొమరుగఁ దలపన్
బోడెమ్మ చాకలికి వలె
బేడా యిచ్చెదవు గేదెపేడా ! ధరలోన్.

క. ఉగ్రముఃపూనెద వేలా !
ప్రొగ్రాం కాగితములోన పొరి జేర్చితివా
కుగ్రామవాస ! మమ్ముల
నిగ్రహాలము లోకమెరుగ నీ సిగదరగా !"

సుబ్బిసెట్టిని రెండురూపాయలు ఇమ్మని రాముడు పద్యములో అడిగినపుడు లక్ష్మణుడు—

శా. "అన్నా ! రెండని పల్కితేల యిలలోనన్నా ! కవిత్వోరు పె
ద్దన్నా ! ధారుణి బుద్ధిజాతికిని హైద్రాబాదు అక్కన్న మా
దన్నా ! సద్గుణగున్న ! కీర్తిభరచెన్నా ! అన్న భద్రాజు రా
మన్నా ! మాటలమిన్న ! కోపమున సున్నా ! యన్న యెన్నాళ్లకున్.

పానుగంటివారి స్ఫురణము ఆశ్చర్యకరమైనది కంఠాభరణములోనే పిచ్చివాఁడగు రామశాస్త్రిలచే ననిపించిన మాటలు :

"దారులలో కెల్ల జమీందారి. చెంబులలో కెల్ల జారి. రోగాలలో కెల్ల మారి. సూత్రాలలో కెల్ల రోరి. క్షేత్రాలలో కెల్ల పూరి"

ఈ మాటలలోఁ దక్కినవన్నియు సామాన్యమే. సూత్రాలలో కెల్ల రోరియనుట పానుగంటివారి పాణినీయ సూత్రస్ఫూర్తి యబ్బురము గొల్పును. పంతులుగారు యథార్థము చెప్పునపుడు మతము శాఖా మున్నగు మొగమోటములు దగ్గరకు రానీయరు. 'వేపారి పంతులు వెక్కిరింపుల పంతులు' అనిపించుటయ కాదు. సుబ్బమ్మ రామశాస్త్రితో ద్వైతాద్వైత మతసంబంధ సాంకర్యసన్నివేశమునకుఁ గారణ మేమని చెప్పినదో చిత్తగింపుడు.

"ద్వైతులు నిలువుబొట్టువారు. అద్వైతు లడ్డుబొట్టువారు. ద్వైతులలో మగవారు తరచుగాఁ బుట్లకాల్తురు. అద్వైతులలోఁ దరచుగాఁ బొడుము పీల్తురు. వారిలో

నాడువారు కచ్చబోసి బట్టకట్టుకొందురు. వీరిలో నడుకట్టాచారము. వారిలో వితంతువులు రాత్రి యడుకులే కాని తినరు వీరిలో మినపరొట్టె మొదలైనవి తిందురు. వారు పచ్చడులు చేయుటలో సమర్థులు. వీరు కూరలలో గట్టివారు. వారి కేకాదశి నియమము. వీరికి శివరాత్రి నియమము."

ఇక్కడ సత్యకథనముతో నొక చమత్కారము కలిగించుట జరిగినది. రామశాస్త్రి సుబ్బమ్మతో అన్నాఁడుకదా :

"నీ కడుపున రెండుకాయలు కాచి, అందొక్కకాయ కోతకాయ ఒకటి పిడిచి పుచ్చుకొనుకాయ యగునేల నేదో దాని కది సరిపోవుచు చేతిదండుగ లేకుండఁ గాలక్షేపము జరుగునని యున్నది"

ఆడుపిల్ల, మగపిల్లవాడు అనుటకు కోతకాయ, పిడిచిపుచ్చుకొనుకాయ యనుటతో నొక సొగసైన యర్థము ధ్వన్యమానము చేయఁబడినది. పానుగంటివారి హాస్యము వ్యంగ్యభంగీమనోహరమైనది కాని, వట్టి వాచ్యము కాదు.

వారి వ్యాసములనుండి, నాటకములనుండి మనలో మనము నవ్వుకొనుటకు వేలకొలఁది వాక్యము లేరుకొనవచ్చును ముసిముసినవ్వులు నవ్వుకోవచ్చును. కడుపుబ్బ నవ్వుకోవచ్చును. ఏతన్మాత్రమున మహాప్రతిభాసరిత్పతియైన పానుగంటి లక్ష్మీనరసింహరావుగారి కవిత్వము తెలుసుకొనుట కాదు. ఆర్జవము, ఔర్జిత్యము, సామరస్యము ప్రేమ, ధర్మదీక్ష, శివేతరక్షతి, జగత్కల్యాణము-పానుగంటివారి మనోరథములు. ఆయన సాహిత్యసృష్టి తెలుఁగువారికి సదాతనమైన పుష్టి. వారి కృష్ణభక్తి సర్వారాధ్యము.

"కడువడి నడచుచోఁ గాళ్లకడ్డంబైన
 కుచ్చిళ్లెడమచేతఁ గూర్చిపట్టి
వలెవాటుపైఁట శాఖలఁ దాఁకునని సువ
 ర్ణోత్తరీయము కటి నొత్తి చుట్టి
సర్వలోకాభయచణమైన కర 'మాఁగు
 మేవత్తు'నని నట్టు లిటులు చాఁపి
చెవి నున్న చెంగల్వఁజేరి ఝుమ్మను భృంగ
 మును శిరఃపరికంపమున నదల్చి

ఘల్లు మనఁగను మొలనూలఁ ఘంటికలును
కాళ్లగజ్జెలు మొరయ భక్తప్రలాప
సంశ్రవణ సంభ్రమచ్ఛన్న సంస్మితుఁడయి
దివ్యమంగళమూర్తి యేతెంచు నదిగో !"

—'రాధాకృష్ణ'



# కవిసమ్రాట్ విశ్వనాథ
## —ఆచార్య దివాకర్ల వేంకటావధాని

ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసము లను మూడు కావ్య హేతువులును పుష్కలముగాఁ గల ఆధునికాంధ్రకవివతంసులలో కళాప్రపూర్ణ, కవిసమ్రాట్, పద్మభూషణ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారగ్రేసరులు. వారు చేపట్టని సాహిత్యప్రక్రియ లేదు; చేపట్టి సమగ్రకళాసంభరితముగా, సహృదయానంద సంధాయకముగా నిర్వహింపని సాహిత్య ప్రక్రియలేదు. వారు మహాకావ్యము నిర్మించిరి, ప్రబంధములు ప్రచురించిరి, ఖండ కావ్యములు శరపరంపరగా కురియించిరి, గేయకావ్యములు వెలయించిరి. నాటకములు ప్రకటించిరి, నవలలు రచించిరి, కథానికలు కల్పించిరి, విమర్శలు వ్రాసిరి- వేయేల, వారు సర్వసాహిత్యప్రక్రియావిశ్వనాథులై విలసిల్లిరి. వారి విజ్ఞాన మాంధ్రాంగ్ల గీర్వాణ సాహితీ సాగరపారీణము; వారి ఉపన్యాసములు విషయచమత్కార విన్యాస శోభావిలాసములు; వారిమాటలు నవరస నిర్ఝరుల యూటలు; వారాధునికాంధ్ర కవితాసామ్రాజ్యమును సర్వజన మనోరంజకముగా పాలించు కవిసమ్రాట్టులు.

శ్రీసత్యనారాయణగారి జన్మస్థలము కృష్ణామండలమున గుడివాడకు సమీపము నందలి నందమూరు. వారి పితృపాదులు శ్రీశోభనాద్రిగారా గ్రామమున నొక శివాలయము కట్టించిరి; అడుగనివారిదే పాపముగా దానధర్మములు కావించిన వదాన్యశిరోమణి ఆయన. శ్రీసత్యనారాయణగారి విద్యాభ్యాసము బందరు పట్టణమున జరిగెను. అప్పుడే వారికి శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి గురుత్వభాగ్య మబ్బినది. సహాయనిరాకరణోద్యమము కారణముగా వారు బి.ఏ., పూర్తికాకుండఁగనే చదువుచాలించి బందరు జాతీయ కళాశాలలో నుపాధ్యాయులుగా చేరిరి. తరువాత వారు బి. ఏ., ఎం. ఏ., పరీక్షలలో నుత్తీర్ణులై తొలుత బందరు హిందూ కళాశాలయందును తరువాత గుంటూరు ఏ. సి. కళాశాలయందును ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసిరి. 1933వ సంవత్సరమున వారికి ప్రథమ భార్యా వియోగము కలిగినది. అప్పుడు వారు గుంటూరు విడిచి బందరుకు వచ్చి 1938లో విజయవాడ కళాశాలలో నుపన్యాసకులుగా చేరువఱకు నిరుద్యోగిగా నుండిరి ఈ కాలమున వారు దేశము నలుమూలల ననేక సాహిత్యోపన్యాసము లొసంగి మహాకవిగా, విమర్శకుడుగా, వాగ్మిశేఖరుడుగా పేరొందిరి. ఈ

సమయముననే వారు వేయిపడగలు వ్రాసి ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి బహుమానము పడసిరి. తరువాత వారు పెక్కునవలలు రచించి ఆంధ్రపత్రికలో ప్రచురించిరి. ఆ నవలలను జనులు విరుగఁబడి చదివెడివారు. 1958 నాటికి శ్రీ సత్యనారాయణగారి సారస్వతమూర్తి సమగ్ర సౌష్ఠవోపేతమైనది. అప్పటినుండి వారు రచించిన గ్రంథము లనేకములు. 1934లో వారు శ్రీ మద్రామాయణకల్పవృక్ష రచన నారంభించి 1962 లో దానిని ముగించిరి. నడుమ వారితర రచనలు కావించుచు నవలలు ప్రకటించుచునే యుండిరి. 1960వ సంవత్సరమున వారు శాసనమండలిలో సభ్యులై ఆ సభ్యత్వ మును విడిచి కరీంనగర కళాశాల అధ్యక్ష్యము గ్రహించిరి. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి ఆరంభమైనప్పటినుండియు వారు తత్కార్య నిర్వాహక సంఘమున సభ్యులై సుమారు పదేండ్లుపాధ్యక్షులుగా కూడ నుండిరి. వారి విశ్వనాథమధ్యాక్కరలకు కేంద్రసాహిత్య అకాడమీ బహుమానము లభించినది. రెండేండ్లక్రింద జ్ఞానపీఠము వారు వారి శ్రీమద్రామాయణకల్పవృక్షమునకు లక్షరూప్యముల పారితోషికము నొసం గిరి వారికి ఆంధ్రవిశ్వవిద్యాలయము కళాప్రపూర్ణ బిరుదమును, కేంద్రప్రభుత్వము పద్మభూషణ బిరుదమును, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము డాక్టరు పట్టమును ఒసంగి గౌరవించినవి. సుమా రెనిమిదేండ్లనుండి వా రాంధ్రప్రభు త్వాస్థానకవులుగా నున్నారు.

సర్వతోముఖమైన విశ్వనాథవారి ప్రతిభకు వారి వ్యుత్పత్తి వైవిధ్యమెంతో వన్నె చేకూర్చినది. వారు బందరులోనే శ్రీ కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారి దగ్గర కొంత సంస్కృత వ్యాకరణమును, శ్రీ పరిమి నరసింహశాస్త్రిగారి దగ్గర సూత్రభాష్యమును, శ్రీకానుకొలను త్రివిక్రమరావుగారిదగ్గర వేదాంతప్రకరణములను అభ్యసించిరి. ఆసమయముననే వారు సంస్కృత కావ్యనాటకాదులనుకూడ పరిశీలించిరి. గుంటూ రులో శ్రీ కల్యాణానంద భారతీమాంతాచార్యుల యొద్ద ఉపనిషద్భాష్యములను పఠిం చిరి. సంస్కృతాంధ్రగ్రంథములతోపాటు వా రాంగ్ల గ్రంథములను సైత మనవరతము పఠించుచునే యుండిరి. ఆంగ్లమున ప్రసిద్ధములైన నవలలన్నియు వారు చదివిరి. వేలకొలఁది కథానికలను నిశితముగా పరిశీలించిరి విజయవాడయందలి రామమోహన గ్రంథాలయములోని ఆంగ్లగ్రంథసముదాయమున వారు చదువని వుండవు. ఆంగ్లము నందలి ఆధునిక శాస్త్రగ్రంథములు సైతము వారి కపరిచితములు కావు. ఆంధ్రకవులలో శిల్పదృష్ట్యా నన్నయ్య, తిక్కన్న, నాచనసోమన, పెద్దనాదులును, శైలిదృష్ట్యా తెనాలిరామకృష్ణ, కృష్ణరాయ నాచన సోమన పెద్దనాదులును వారికి మేలుబంతులు. సంస్కృతకవులలో వాల్మీకి కాళిదాస భవభూతి మురారులు వారికి ప్రాణతుల్యులు. మమ్మటానందవర్ధ నాభినవగుప్త పండితరాయాదుల సాహిత్య సిద్ధాంతములను వారు పలుమార్లవలోడించి స్వాయత్తము చేసికొనియుండిరి. క్షుణ్ణమైన వారిమార్గమును వారు రేఖామాత్రమైనను దాఁటిపోరు. విస్తృతమైన యీవ్యుత్పత్తి గాఢమైన అద్వైతా

భిమానమును, అచంచలమైన దైవభక్తియు తోడై వారి నద్వితీయ కవితాసామ్రాజ్య పట్టభద్రులను గావించినవి.

విశ్వనాథవారు గ్రంథములను రచించుపద్ధతి వింతగా నుండును. వారి కే పుస్తకము వ్రాయుటకైనను వారము పది రోజులకంటె నెక్కువకాలము పట్టదు ఆలోచన, పథకము, రచన-అన్నియు నొక్కమారే జరుగును. సోదరులు వేంకటేశ్వరులుగారు వ్రాయుచుండ వారొక టేపనిగాచెప్పుచు 'వేయిపడగల'ను నెలనాళ్ళలో ముగించిరి. నవల లన్నియు వారు చెప్పుచుండగా నితరులు వ్రాసినవే. దినమునకు రెండు మూడుగంటల చొప్పున చెప్పుచు వా రే నవలనైనను పదిరోజులలో పూర్తిచేయుదురు. పద్యములను వారు సాధారణముగా దారివెంట నడుచునప్పుడును, రైలులో ప్రయనించునప్పుడును కూర్చుకొని యింటికి వచ్చిన పిమ్మట గ్రంథస్థములు కావింతురు. వారు తఱుచుగా 'నేను చాలసోమరి'నని చెప్పుచుందురు. ఆ సోమరితనముతోనే వారు సుమారు నూఱు ద్గ్రంథములను ఆంధ్ర సంస్కృతములందు వ్రాయఁజాలిరి.

విశ్వనాథవారి సర్వసాహిత్యమును సమీక్షించుటకు రెఁడు మూఁడు గంటలు కాదు రెండుమూడు రోజులుకూడ చాలవు. వారిరచన యెంత విస్తృతమైనదో అంత గుణబహుళమైనది. నే నీనాఁడు వారి యితర పద్యకావ్యములను మాత్ర మెంచుక తడవి యిహపరసాధకముగా భావించి వారు రచించినదియు తత్సకలోహవైభవసనాథము నైన శ్రీమద్రామాయణకల్పవృక్షమునందలి కవితాశిల్పమునుగూర్చి నా అల్పమతికి తోఁచిన కొన్ని విశేషములను వివరింప యత్నింతును. కవి ప్రతిభ అతని యొక గ్రంథమున మాత్ర ముండి యింకొక గ్రంథమున నుండకపోదు. "పొలములో వాన యొక్కచెక్కఁ గురిసి వేఱొక చెక్కఁ జుక్కపడదె" అని రామాయణమున వా రొకసందర్భమున నర్థాంతరన్యాసముగాఁ జెప్పియుండిరి. ఈ భావము వానకువలె కవి ప్రతిభకును అన్వయించును

త్రయోదశవర్ష దేశీయమైన వయస్సుననే విశ్వనాథవారు ఛందస్సు నేర్చుకొని పద్యములు వ్రాయుచుండిరి. ఉన్నతపాఠశాలలో చెళ్ళపిళ్ళవారి గురుత్వము వారి కవితా కుతూహలమునకు దోహదము చేకూర్చియుండును. బందరు జాతీయకళాశాలలో నుపాధ్యాయులుగా నున్నప్పుడే వా రాంధ్రపౌరుషము, ఆంధ్రప్రశస్తి, కిన్నెరసాని పాటలు అను పద్యగేయకావ్యములను, ఏకవీర నవలను, నర్తనశాల, అనార్కలి అను నాటకములను రచించిరి. "మాస్వామి" అను విశ్వేశ్వర శతకముకూడ నప్పుడు రచింపఁబడినవే. వారి ప్రథమ భార్యనుగూర్చిన వలపుజీవితమును వర్ణించు "గిరికుమారుని ప్రేమగీతాలు" 1928 నుండి 1931 వఱకును వ్రాయబడినవి. ఈ తొలి రోజులలోనే వారు 'వేణీబంధమ'ను చిన్నకావ్యము నాళువుగా చెప్పినట్లు వినియుంటిని. అది యిప్పుడు లభ్యమగుటలేదు.

విశ్వనాథవారి హృదయము రాష్ట్రీయ జాతీయభావములు రెండింటికిని నిధానము. వారి ఆంధ్ర పౌరుష-ఆంధ్రప్రశస్తులలో ఆంధ్రత్వాభిమానము సర్వతోముఖముగా ప్రవహించుచుండును. అప్పటికి భారతదేశమే పరతంత్రము; ప్రత్యేకరాష్ట్రము లేని ఆంధ్రులు పరతంత్రులు. హీనమైన యీ అస్వతంత్రత వారికి చెప్పరాని వేదన కలిగించినది. ఆవేదనతో వారు "నేటితో నస్వతంత్రతానియతమైన యీ బ్రతుకు తెల్గువారు భరింపలే"రని గొంతెత్తి ఘోషించినారు. వేగిక్షేత్రమున సంచరించునప్పుడు వారి కడు గడుగున పూర్వాంధ్ర వైభవము స్ఫురించి శరీరమును కంపింపఁజేసినది. ఆ కంపనముతో వారి వాక్కు కవితావిష్టమై యిట్లు వెడలినది.

"ఈ నా పదార్పిత క్షోణి నేరాజు ధ
ర్మాసనంబుండి స్మృత్యర్థమనెనొ
ఈ నా దృగావృతంబైన భూములలోన
నే శౌర్యధనులు శిక్షింపఁబడిరొ
ఈ నా శరీరమం దివతళించినగాలి
యెంత పౌరాతన్య మేచుకొనెనొ
ఈ నా తనూపూర్ణమైన యాకాశమ్ము
నే క్రతుధ్వనులు శబ్దించినవియొ

అస్మ దజ్ఞాతపూర్వ దివ్యత్వ మొప్పు
నీ పునీతావనీఖండ మిచట నిలిచి
యస్వతంత్రత దొరలు నాయాంధ్రశక్తి
నన్నుఁ గంపింపఁజేయుచున్నది భృశమ్ము."

వేగి యిప్పుడు శిథిలప్రాయమై యున్నది. పూర్వమది యొక రాజ్యమునకు రాజధాని. అప్పటి దాని వైభవము నూహించుచు వారిట్లు తలంచుచున్నారు. ఆ చోటి యిప్పటి పల్లెతనమునకును అప్పటి మహావైభవమునకును గల వ్యత్యాసము వారి కాశ్చర్య విషాదము లావహించినది.

"ఇట వేగీశుల పాదచిహ్నములు లేవే లేవుపో భావనా
స్ఫుటమూర్తిత్వము నైనఁబొందవు నెదో పూర్వాహ్ణదుష్కాలపుం
ఘటికల్ గర్భమునం దిముడ్చుకొనియెం గాఁబోలు నీపల్లెచో
టఁట లోకాద్భుత దివ్యదర్శనమదే యాభోగ మేలాటిదో"

మాధవవర్మ ధర్మప్రభువు యువరాజు. పురవీథుల రథముపై వాహ్యాళివెడలు చుండఁగా నతని రథచక్రముల క్రిందఁబడి యొక వృద్ధురాలి యేకైక పుత్రుఁడు మరణించెను. రాజు ప్రాడ్వివాకుల సాహాయ్యమున ధర్మనిర్ణయము చేసి కుమారునికి

మరణదండన విధించెను. న్యాయ సభాసింహాసనమునం దుండినంతసేపు మాధవవర్మ ధర్మమూర్తియైన రాజు; ధర్మాసనము దిగివచ్చిన తరువాత నతఁడు ప్రేమమూర్తియైన తండ్రి, అతని రాజపితృభావముల వర్ణించుటలో విశ్వనాథ వారు ప్రదర్శించిన నేర్పనన్యసామాన్యము. వృద్ధురాలు రాజుతో తనకు జరిగిన అన్యాయమును గూర్చి తెల్పుచు—

"ఇంతకుమించి ఆపద లిఁకేమని కల్గు, రథంబుచేత త్రొ
క్కిఁంతురటయ్య భూప్రజల నెంతగ నున్న సిరుల్ భుజింత్రు పా
లింతురు రాజులైన నదలింతురు తప్పులు కల్గినన్ విచా
రింతురుగాక చంపుటసరే ప్రజ నిట్టులకారణంబుగన్"

అని యాతని ప్రశ్నించెను. తరువాత నామె తనమాట యెట్లున్నను కోడలిగతి యేమి కావలెనని పలవించిన సన్నివేశము కరుణరస కల్లోలిని. మాధవశర్మ ధర్మాసక్తి చూచి దేవతలు విజయవాడలో బంగారువర్షము కురిపించిరి. ఈ ఖండకావ్య మాంధ్ర ప్రశస్తికి పతాక. కొండవీటిపొగమబ్బు లను ఖండకావ్యము మొదట ప్రత్యేకముగా ప్రచురింపఁబడినను తరువాత నాంధ్రప్రశస్తిలో చోటుచేసికొన్నది. విశ్వనాథవారి ఖండకావ్యములలోనికెల్ల భావనాసంపదలోని తలమానికమని నాయభిప్రాయము. కొండ నీటి పొగమబ్బులను వా రిందు వర్ణించిన, భావించిన రీతి, వారి అపూర్వభావనాశక్తికి తార్కాణ. జడములు, ధూమవికారములునైన ఆ పొగమబ్బులు వారి కవితాబలమున నిందు చైతన్యమూర్తులై చిత్రవిచిత్రస్ఫూర్తి వహించును. ఆంధ్రప్రశస్తిని గూర్చి శ్రీ విశ్వనాథవారు—

"మా పూర్వాంధ్ర ధరాధినాయక కథామంజూషికారత్న గా
థా పద్యావళి పేరి హారి సుమనోదామంబు మాధ్వీక భా
షాపృక్తంబు మహాప్రబంధరచనాసౌందర్యపు న్వాసనల్
తీపై క్రమ్మఁగ నాంధ్రసోదరుల కందిత్తుం గళాంకమ్ముగన్"

అనిచెప్పిన ట్లందు మహాప్రబంధరచనా సౌందర్యసౌరభ్యములును మాధ్వీక మధుర భాషామానోజ్ఞకములును నిండారియుండును.

విశ్వనాథవారు జాతీయకళాశాలలో పనిచేయుచున్నప్పుడే "కిన్నెరసానిపాటలు" వ్రాసియుండిరి. ఆధునికాంధ్రగేయ వాఙ్మయములో దానికి విశిష్టమైన స్థానమున్నది, కిన్నెర ఉద్విగ్నహృదయయైన తెలుగు జవరాలు. అత్తపోరు పడలేల, కౌగిలించిన భర్త కౌగిటిలోనే ఆమె కరగి నీరయి వాగుగా ప్రవహించినది. ఇది విశ్వనాథవారి కావ్యమునకు పూర్వరంగమైన కల్పన. తరువాత కిన్నెరనడకలు, నృత్యము, సంగీతము, కదలిపొంగు, కిన్నెరదుఃఖము, గోదావరీ సంగమము వివిధములైన గేయము

లలో వర్ణింపఁబడినవి. మార్గరచనలోవలె దేశిరచనయందును విశ్వనాథవారు ప్రదర్శించిన కవితాకౌశల మిందు సర్వత్ర గోచరించును. కిన్నెరయందు జవరాలితనమును సముద్రునియందు కాముకత్వమును ఆరోపించుటయు, గోదావరి కిన్నెర నాదుకొనుటయు నద్భుతములుగా నున్నవి. కిన్నెర వాగై ప్రవహించినపుడు కవిగారు—

"నడవగా నడవగా నాతికిన్నెరసాని
తొడిమ యూడినపూవు పడతిలా తోచింది
కడు సిగ్గుపడు రాచకన్నెలా తోచింది
బెదగువోయన రత్నపేటిలా తోచింది"

అని ఆమె నడకల సొబగు వర్ణించినారు. పతి రాయియై పడియుండుట చూచి కిన్నెర-

"ఓనాథ ఓనాథ ఓనాథ ఓనాథ
నాకుమల్లే నీవు నదివోలె పారరా
జలముగా ఇద్దరము కలసిపోదామురా
కెరటాలు కెరటాలు కౌగిలిద్దామురా"

అని పిలుచుట ఆమె ముగ్ధసుకుమార హృదయమునందలి నిర్మలానురాగమును వేయి విధముల చాటుచున్నది. కిన్నెర సోయగమును తిలకించి సముద్రుఁ డామెను వలచెను. ఆతని విరహమును కవిగా రిట్లు వర్ణించిరి.

"తన నీటి గుణ మెందుపోయెనో
తన చల్లదన మెందు దాగెనో
పరగ తనలో నున్న బడబాగ్నిశిఖి పొంగి
తన శరీర మ్మెల్ల దహియించినట్లుగా
తటపటయిపోయెనూ, తపియించిపోయెనూ"

సముద్రుని విజృంభణము చూచి కిన్నెర—

"ఓనాథ నిను వీడివచ్చి ఓరాజ నిను వీడివచ్చి
నాయెడ ల్సయితమ్ము నానాజనులు కోర
ఈ యేవపుం బ్రతు కేల పొందితినిరా
అనుచు వగచినదీ అంచు లురలినదీ"

ఇందు కిన్నెరపాతివ్రత్యము వ్యక్తమగుచున్నది. గోదావరి యామె దైన్యము చూచి ఆదుకొని తనలో కలుపుకొన్నది. తరువాత నాఱు ఋతువులందు కిన్నెర విలసిల్లిన తీరపూర్వసౌందర్యశోభితము. నిర్మలచరిత్రయైన కిన్నెర తెలుగు దైవమైన శ్రీరాముఁడు నెలకొనియున్న భద్రాద్రికరుగు త్రోవలో కాచి యాత్రికులకు చల్లని నీడ,

చల్లని నీరు అందిచ్చుచు కృతార్థజన్మమైనది. "కో కి ల మ్మ పె ళ్ళి" విశ్వనాథవారి యింకొక గేయకావ్యము. ఇందలి చిలుకతల్లి సాంస్కృతిక వాక్కునకు-కోకిలమ్మ తెలుగు పలుకులకు ప్రతీకలు.

"చిలుకతల్లి మహాన్వయంబున
నిలిచినవి సాంస్కృతికవాక్కులు
కోకిలమ్మా తెలుగుపలుకూ
కూడబెట్టినదీ..."

అను ముత్యాలసరముతో కావ్యము ముగియును. విశ్వనాథవారు పదగేయకవితలు రెండింట సవ్యసాచులు. బసవరాజు అప్పారావుగా రన్నట్లు పట్టిన దానినెల్ల బంగారము చేయగల మహాకవి ఆయన.

జాతీయకళాశాలలో నుద్యోగించునప్పుడు కలిగిన కలతలను తొలగించుటకై విశ్వనాథవారు తమ యిలువేల్పు విశ్వేశ్వరస్వామిని గూర్చి కావించిన ప్రార్థన విశ్వేశ్వర శతకమై జాలువాఱినది. భావములలో, శయ్యాసౌష్ఠవములో, భక్తిభావప్రకటనలో ఈ శతకము సాటిలేనిది. విశ్వనాథవారి తండ్రిగారు దేవాలయనిర్మాణమునకై దానధర్మాదులై యున్న పొలమంతయు నమ్మిరి. సంతానమునకై వారు మిగిల్చినది విశ్వేశ్వరస్వామి యాలంబ మొక్కటే. ఈ విషయమునే విశ్వనాథవారు—

"పునుకల్ చూచిన కాజగడ్డలు ఫణుల్ పొల్పారు కాజాకు లే
మననౌ జాబిలి కాజపూవెరువు పెల్లైసారమౌ దుబ్బు ల
ల్లినయుండల్ మెయిబూది౹పూత తెలిధిల్లీభోగముల్ చేను నీ
వనెదన్ మా పితృపాదు లమ్మనిపొలంబౌ దీవు విశ్వేశ్వరా"

అను పద్యమున వెల్లడించిరి. ఈ శతకమునందలి పద్య మొక్కొక్కటి యొక్కొక్క రత్నము. వాని నుపహారముగా పొందిన స్వామియందలి యుజ్జ్వలభావరోచిస్సౌందర్యమున కెంతగా మురిసిపోయెనో! తరువాత విశ్వనాథవారు మధ్యాక్కరలలో పదిమంది దైవములనుగూర్చి పదిశతకములు రచించిరి. తెనాలికి సమీపమున నున్న మున్నంగి గ్రామమునందలి పెద్దలాయూరి వేణుగోపాలస్వామివారిపై నొక శతకము వ్రాసిపెట్టుమని కోరిరి. ఆశతకమునకు 'మున్నంగి వేణుగోపాల' అను మకుట ముండవలెను. ఆ మకుట మొక్క మధ్యాక్కరలో తప్ప నితర పద్యములలో నతుకదు. అందుచే నాస్వామినిగూర్చి వంద మధాక్కరలు వ్రాసిరి. పిమ్మట తమ యూరియందలి సంతానవేణుగోపాలస్వామిని గూర్చికూడా నింకొక మధ్యాక్కరల శతకము రచించిరి. ఆ స్వామి స్వప్నములో కనబడి కవిగారి కొక వాగ్దానము చేసెనఁట! ఆవాగ్దాన మెప్పు డతఁడు చెల్లించునా యని తాము వీక్షించుచున్నట్లు వా రొకచో వ్రాసియుండిరి.

వాగ్దాన మేదో నాకు తెలియదు కాని స్వామి తప్పక చెల్లించునని మాత్రము నాకు తెలియును. మానవులు చెల్లింపరుకాని దయార్ద్రహృదయులైన దైవము లెందుకు చెల్లింపరు? ఇట్లే కవిగారు తిరుపతి, శ్రీశైలము, కాళహస్తి, భద్రాద్రి దక్షారామము మున్నగు క్షేత్రములందలి దైవములను గూర్చికూడ మధ్యాక్కరలలోనే శతకములు రచించి నడకలేని యావృత్తమునకు గతి సౌభాగ్యమును, దైవవర్ణనోపయుక్తమౌటచే పావనత్వమును చేకూర్చిరి. ఈ మధ్యాక్కరలందలి భావములు పెక్కు గీతాంజలి యందలి భావములకు వన్నెలు దిద్దుచుండును. విశ్వనాథవారి తాత్త్విక భావరత్నముల కీశతకములు రత్నాకరములు ఇందలి ప్రతిపద్యమును వారిని మహాభక్తుడుగా నిరూపించును వారు పైకంత భక్తులుగా కనిపింపరు కాని అంతరంగనిష్ఠమైన వారి భక్తిసంపద కవధులు లేవు. ఈ భక్తి వారి శ్రీమద్రామాయణ కల్పవృక్షము నందలి ఆశ్వాసాంత పద్యములతో పరిపక్వరూపమున ప్రత్యక్షమగును. ఈ శతకములందలి మధ్యాక్కరలలో భక్తితత్వములు రెండును పెనవేసికొనియుండి నిర్మలము నిసర్గమునగు వారి ప్రకృతిని ప్రకటీకరించుచుండును.

"కోరి కబేలాకు మందగాఁ దోలికొని పోవుచుండ
వారిప్రక్కన యున్న పచ్చికగడ్డిపై దారాడు పసుల
తీరుగా నున్నది జనులభోగాశ, తెలివి సర్వమ్ము
చూఱపుచ్చెదవు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!"

అను పద్యము తత్త్వమూఢులు అమాయకులునైన జనుల భోగాశను చక్కని యుపమానముతో వ్యక్తము చేయుచున్నది. శతకములందలి యిట్టి పద్యములు వారి అంతర్వికాస వైభవమును విశదీకరించి పఠితలను సైత మంతర్ముఖులుగా నొనరించును.

1933న సంవత్సరమున విశ్వనాథవారికి ప్రథమ భార్యావియోగము జరిగినది. ఆ పుణ్యసాధ్వి పేరు వరలక్ష్మి. అప్పుడు వారు వరలక్ష్మీత్రిశతి యనుపేర మూడు వందల పద్యములతోకూడిన వియోగకావ్యము రచించిరి. ఆంగ్లమున మృతులఁగూర్చి వ్రాయబడిన కావ్యములను 'ఎలిజీ' లందురు. ఆంధ్రమున నిట్టి కావ్యములసంఖ్య చాలా తక్కువ. ఉన్నవానిలో భావనైశిత్యమునందును, కరుణరసోత్కర్షమందును, దీని కీడైన దింకొకటి లేదు. కర్మశతకము, స్మృతిశతకము నిత్యశతకము అనున విందలి శతకములు. ఒక్కొక్క శతకము పదేసిదశకములుగా విభజింపఁబడినది. కర్మశతకమున కర్మకాండకు సంబంధించిన విషయములును, స్మృతిశతకమున నా యిల్లాలి గుణగణములును, నిత్యశతకమున నిత్యానిత్యవివేచనముతోఁగూడిన యుపనిషద్రహస్యములును వివరింపఁబడినవి. కర్మశతకమునందలి కృష్ణార్పణ మను దశకము చివర కవి

"పితృదత్తమగు నాస్తి హతమయ్యె నాయందు
ఆయ నిచ్చిన భార్య అస్తి పోయె
నాతండ్రి చేసిన నానామహాపుణ్య
కర్మ లీ గతి గంగ కలసిపోయె
మిగిలినది యొక్కఁడే నాకు మేరువంత
బరువు నా గుండెలో మధ్యభాగమందు
నంతె పేసున కంతె భార్యాస్థిగాని
నా శరీరాస్థి నిజము కృష్ణార్పణమ్ము."

అని పలుకునప్పుడు కరుణరసము పరాకాష్ఠ నందుకొనును. ప్రియాంగనా తనూగతాస్థిని కృష్ణార్పణ మొనరించుచు వారది

"ఏతన్నదీకుల్య లెగచి పండించెడు
రాజనమ్ములకు శ్రీరామరక్ష"

యగుఁగాక యని యాశంసింతురు. నిర్మలమైన యనురాగమునకును, పత్నియందలి గౌరవమునకును తద్వియోగజనితమైన కరుణమునకును నెలవై యాత్మీయాంశతోఁ గూడిన యట్టి విషాదస్మృతి కావ్యము నాన్యతోదర్శనీయము.

విశ్వనాథవారి శృంగారవీథి రాధాకృష్ణదివ్యప్రణయమునకు సంబంధించినది. అందు యశోద కృష్ణుని మేలుకొల్పు ఖండకావ్యము సహజమును భావపరిపూర్ణమునై యత్యంత మనోహరముగా నుండును శశిదూతము విప్రయోగశృంగార ప్రధానమైన దూతకావ్యము. సంస్కృతమున కాళిదాసు మేఘసందేశమును రచించిన పిమ్మట పలువురు దూతకావ్యములు వెలయించిరి. వానిలో పెక్కింటి కాంధ్రానువాదము లున్నవి. విశ్వనాథవారి శశిదూతము స్వతంత్రమైనది. భావగాంభీర్యమునందును రసపోషణమునందును, ప్రకృతి పరిశీలనమునందును అది కాళిదాసుని మేఘసందేశముతో పోటీ చేయుచుండును. ఇందలి శయ్య ప్రసన్నమధురమై యొప్పారును.

"తెలివినువాక తాపులకు తీరముపట్టిన వెల్లశుక్తివై
తొలివెలుఁగైనసామి తలతోటను చిట్టచిటారుపూవవై
యలముగురైన మూర్తులకు నాది నిధానము సృష్టిబీజమౌ
సొలపున కిక్కయైన కులసుందరి పాపటలోనిభూషవై."

మున్నగుపద్యము లిందుకు తార్కాణము.

విశ్వనాథవారి రచనలలో నెల్ల పరిమాణమున చిన్నదయ్యు పరిపాకమున మిన్నయైనది ఋతుసంహారము, అం దున్నవి షడృతువులను వర్ణించు షష్టిసీసములు,

ఋతువులను సంస్కృతాంధ్రములందు పలువురు కవులు వర్ణించిరి. ఆవర్ణనలు పెక్కు కవి సమయానుగుణము లైనట్టివి. విశ్వనాథవారి వర్ణనలు తెలుఁగుగడ్డ ప్రకృతిలో ప్రతిసంవత్సరము చూపట్టునట్టివి. ఈ వర్ణనలందు వారు ప్రదర్శించిన జడాజడవస్తు పరిశీలనము, ఆచార సంప్రదాయ పరిజ్ఞానము, వాతావరణ పరివర్తనప్రకారము అనన్య సాధ్యములై నట్టివి. ఏ ఋతువున నేలత లేవృక్షము లే పూవు లెట్లుండునో, శీత వాతోష్ణము లెట్లుండునో, జానపద పురీజను లెట్లు వర్తింతురో వారికి తెలిసినట్లు మఱెవ్వరికిని తెలియదనిపించును. సమయముల నతిక్రమింపకయే సహజతను సమ కూర్చుకొనిన వగుటచే వారి వర్ణనలు పఠితలకు వెంటనే పారవశ్య మొదవించును. మమ్మటుఁడు లోకోత్తర వర్ణనా నిపుణుడైనకవి కర్మ కావ్య మని కావ్యమును నిర్వచించి యుండెను. ఋతుసంహారమున నట్టి లోకోత్తర వర్ణన నైపుణ్యము సర్వతోముఖముగా గోచరించును. వసంతమున విరియఁగాచిన పండ్లబరువుచే రసాలము చూలాలువలె నొప్పారెను. గ్రీష్మమల్ప ప్రాణులను బాధించిన తెలుఁగు కవిగా రీవిధముగా వర్ణించు చున్నారు.

"గొంతుక్రిందటి యుండ గుడగుడ లాడఁగా
నఱవా దెఱచు తృషయైనకాకి. .

నలిగిపోయిన పురికొసవలె, వడఁగడ
గండ్లఁబడి, స్రుక్కి చను నల్లికండ్లపాము
అల్పప్రాణులపైఁ బరమాధికారి
శేఖరుఁడు గ్రీష్మునిప్రతాపచిహ్న లయ్యె"

అల్పప్రాణులపైఁ బరమాధిశేఖరుఁడను విశేషణము లోకమునందలి అధి కారుల ప్రవృత్తినికూడ వ్యంగ్యమొనరించుచున్నది. వేసవికాలమున చిటుకమ్మ చివర వేసిన సెగగడ్డకు బాలగుంప్రని మొగము కోలవారుటయు, వడయెండలకు గ్రాగి వడలి పోయిన బాల పొడుగెదిగినట్లు కనఁబడుటయు వర్షర్తువును పుడమిపడఁతి కాన్పునకు తాంబూలము కొఱకై కాచుగ కుక్కగొడుగు లుద్భవించుటయు, చూడిగేదెకు పెయ్యె దూడ పుట్టునో దున్నపిల్ల పుట్టునో తుంగకాడ సూచించుటయు, శరదృతువున లంబాడి పడుచు క్రొత్తగా పండిన వడ్లకు సరికి సరిగ రేగుఁబండ్లమ్మవచ్చుటయు, హేమంతమున నెండిన కంది జనుపకాయలలోని గింజలు గలగలలాడుటయు, శిశిరమున చిన్నిబిడ్డ లెప్పటి యత్తయో యప్పుడే పగయట్టు లరకాళ్ళు కాచుకొనుటయు కవిగారి నిశిత పరి శీలనకు ఫలముగా కవిత కెక్కిన లోకప్రవృత్తులు. వర్షర్తువునమింటఁ దోచిన యింద్ర ధనుస్సు ముక్కను పులితోఁకతోడను శరత్తున బురదత్రొక్క నోడి మహిషవాహ నుఁడై యేగు కాపుబుడతను బాలయమునితోడను, హేమంతమున గుమ్మడిపువ్వునఁ గులుకుమంచుబొట్టును తట్టలోఁ గూర్చుండఁబెట్టిన వధువుతోడను బోల్చుట వారి యుప

మానప్రయోగ కౌశలమునకు తార్కాణలు. వర్షర్తువును వర్ణించు సందర్భమునందలి "వెన్నఁగొట్టినవారి వెసరాలఁ గొట్టుమన్నట్లు మేఘుఁడు హేళికడ్డువచ్చె" ననుపద్యము వారి లోకోక్తి పరిజ్ఞానమునకును, హేమంత వర్ణనమందలి "యత్ర ధూమము వహ్ని తత్రయన్న"ట్లను పద్యము వారి బహుశాస్త్ర పరిచయమునకును నిదర్శనములు. ఈ ఋతు సంహారమును చదువుచుండఁగా విశ్వనాథవారు త్రికాలవేత్తలైన మహర్షులుగా, లోకజ్ఞాన సింధువులుగా; మహాకవి సహస్రాక్షులుగా సాక్షాత్కరింతురు.

విశ్వనాథ పంచశతి యైదువందల పద్యముల ముక్తకకృతి. ఇది గాథాసప్తశతి వంటిది. పద్యముల కన్యోన్య సంబంధము కూర్చు కథాసూత్ర మేదియు నిందు లేదు. కాని ప్రతిపద్యమును చమత్కారమునకో, వ్యంగ్యమునకో, హేళనకో, విమర్శకో నిలయమై అత్యంత హృద్యముగా నుండును. లోకమునందలి దోషమో, వైరూప్యమో, అధర్మమో వెక్కిరింపఁబడునప్పుడా దోషాదులకు గుఱియై యుండువారు సైత మాత్మ నొవ్వక లోలో చిఱునవ్వు నవ్వుకొందురు. ఇట్టిపద్యములు వ్రాయుట ప్రతిభతోపాటు లోకజ్ఞత, పరిశీలన నైశిత్యము, ధర్మాభినివేశము, మనోధైర్యము పుష్కలముగా నుండవలయును. అవి యన్నియు నున్నవారు కావుననే విశ్వనాథవారు వాని నత్యంత సమర్థతతో నిర్వహించిరి.

"తొలినాళులఁ బద్యార్థము
తెలియనిచోఁ బాఠకునిది తెలియమి, యీనా
ళుల వ్రాసిన కవిదోషము
కవి ముదిరిన కొలఁది చిత్రగతులను నడచున్"

అనుపద్య మిప్పటి పాఠకుల అవగాహనశక్తి లోపమును మెత్తగా నధిక్షేపించుచున్నది.

"సూర్యుచుట్టు తిరుగుచున్నది భూమి నీ
వెఱుఁగుదే యనంగ నెఱుఁగవలెనె
భూమి స్త్రీయు సినుఁడు పురుషుఁడు నెవ్వరి
చుట్టు నెవరొ నీవు చూడు మనియె."

లోకమున చపలురైన పురుషులు స్త్రీలచుట్టు తిరుగుచుందురు. సంస్కృతమున భూమి శబ్దము స్త్రీ లింగము; ఇన శబ్దము పుం లింగము అందుచే లోకన్యాయము ననుసరించి భూమిచుట్టు సూర్యుఁడే తిరుగవలయును కాని భూమియే సూర్యునిచుట్టు తిరుగుచున్న దని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

అంటఁబోకు మొక్క గవర్నమెంటుమాత్ర
పడను దిట్టుము నీ యిచ్చవచ్చినట్లు
కొంచెముగ నొట్టుగా నెక్కుసకూడ కలుపు
ప్రతికలయమ్మకము నా జవాబుధారి.

ఇప్పటి పత్రికలు కొన్ని సత్యాసత్యములు పరిశీలింపక తమకిష్టములేనివారిని, విధానములను నిందించును. ఇష్టమున్నవారిని ప్రశంసించును. పైగాఁ నెక్కువిషయములతో గూడిన కథాదులను నిరాఘాటముగా ప్రకటించును. అందువలన నా పత్రిక లొక్కొక్కప్పుడు బాగుగా నమ్ముడు వోవుచుండును. ఈ పద్య మిప్పటి పత్రికలందలి విషయ విన్యాసమును, క్షీణమైన పఠితల అభిరుచులను హేళన చేయుచున్నది.

"వెస స్వరాజ్యము వచ్చిన పిదప కూడ
సాగి యింగ్లీషుచదువునే చదువునట్లు
అంగనామణి పెండిలి యాడి కూడ
ప్రాతచుట్టరికమునె రాపాడుచుండె,

ఈ పద్య మిప్పటి విద్యావిధానము భారతీయుల కనుకూలము కాదనియు, యోగ్యమైన విధానము నవలంబింపవలె ననియు చమత్కారయుక్తముగా సూచించుచున్నది. ఇందు కొంద అంగనామణుల అసభ్య శీలముకూడ విమర్శింపఁబడినది.

ఊరి భార్య లెల్ల రూహించి యామె మం
చంబుతో నిడిరి శ్మశానమందు
నట పిశాచకాంత లాకోచనము చేసి
పడతి మరల నూరి నడుమ నిడిరి.

ఈ పద్యము సుందరమైన ధ్వనికి నిదర్శనము. ఆ యిల్లాలు పెద్ద గయ్యాళి యనియు నామెయన్న నూరినారులేకాక పిశాచకాంతలుకూడ భయపడుదు రనియు నిందలి భావము. ఈ పంచశతి యందలి యైదువందల పద్యము లిట్లే వ్యంగ్య చమత్కార హాస్య హేళనల కాలవాలములై కవిగారి లోకజ్ఞతను, భావములను ప్రకటించుచున్నవి. వా రీ పంచశతిని నాల్గునాళ్ళలో వ్రాసి ముగించిరి.

విశ్వనాథవారు 'ఝాన్సీరాణి'కావ్యమునుకూడ నెవ్వరో కోరఁగా నాల్గెదురోజులలో వ్రాసివైచిరి. ఝాన్సీరాణి పరాక్రమ మప్రతిమానమైనది. సమకాలికులైన రాజులు పలువు రాంగ్లేయులకు దాసులైపోఁగా నామె ధర్మప్రేరితయై సాహసముతో వారితో యుద్ధము చేసినది. ధర్మ మున్నచోట జయ ముండునను న్యాయ మా మెయెడ నన్వయింప లేదు. ఆమె ఓడిపోయినది. దీనికి కారణము కాలమహిమ. విశ్వనాథవా రీ కావ్యము నధ్యాయములుగా విభజించి ప్రతి అధ్యాయము నాద్యంతములందును కాలస్వరూప లక్షణములను, యుగానుసారి వర్తనమును వివరించిరి. ఇందలి కథాకథన పద్ధతి రమ్యముగా నున్నది. ఇందు ఝాన్సీరాణి ధర్మాభినివేశమును పరాక్రమ సాహసములును లెస్సగా వర్ణింపబడినవి.

కుమారాభ్యుదయముకూడ నెవ్వరో కోరఁగా వ్రాసిన కావ్యమే. కుమారస్వామిని గూర్చి పౌరాణికములైన గాథ లున్నవి. అవిగాక ద్రావిడదేశమున నతనికి సంబంధించినకథలు, సంప్రదాయములు పెక్కున్నవి. వాని నన్నిటిని కలిపి విశ్వనాథవారు విచిత్రమైన కల్పనతో నీ కావ్యమును నిబంధించిరి. దేవసేనయు, వల్లియు కుమారస్వామిభార్యలు. దేవసేనాకుమారస్వాముల శృంగారము పంటచేల వాతావరణములో సాగును. పెండ్లియైనపిమ్మట కుమారుఁడు దేవసేనను తల్లిదగ్గరకు తీసికొనిపోయి నప్పుడు నూత్నస్నుషాగమనమున సత్తగారు పొందిన మురువిందు చక్కగా వర్ణింపఁబడినది. వల్లికిని దేవసేనకును పడనికారణమున వల్లి యిల్లువిడిచి వెళ్ళిపోయినది. ఆమె నదులమీఁద వంతెనలు కట్టించి కృషివిధానమున కెన్నో సౌకర్యములు కల్పించినది. ఈ సందర్భమున కవిగారు నేఁటి వ్యవసాయ పద్ధతులను పథకములను, వనితామణులు సంఘసంక్షేమమున కుపకరింపఁజాలు విధానములను వారి కార్యాచరణ సామర్థ్యమును విస్తృతముగా వర్ణించియుండిరి. ఇతివృత్తము పౌరాణికమయ్యును ఇం దాధునిక విధానము లెన్నో సందర్భానుగుణముగా ప్రవేశపెట్టఁబడినవి.

సంస్కృత భారతమున దశమ స్కంధములో భ్రమరగీత లున్నవి. పోతన్నగారు వానినిపెంచి యేడెనిమిది పద్యములు వ్రాసియుండిరి. విశ్వనాథవా రావిషయమునే గ్రహించి నూఱుపద్యములు రచించిరి. ఇట్టిదే వారు వ్రాసిన మఱొక గ్రంథము గోపికాగీతలు. ఇందు మూఁడువందల పద్యము లున్నవి. ఈ రెండును భక్తిప్రధానములైన గ్రంథములు. ఎవ్వరో వ్రాసిపెట్టుమనఁగా వ్రాసినవే యీ రెండు గ్రంథములును.

'కృష్ణసంగీత'మనుకావ్యము విలక్షణమైనది. ఇందు నూటయెనిమిది శీర్షికలున్నవి. ఒక్కొక్క శీర్షికయందు నలువది పాదములతోఁగూడిన యొక్కొక్క గీతమాలిక యుండును. సుమారెనుబదిమంది గోపికలు గోపాలదేవు నుపసరించిన మార్గము లిందు భిన్నభిన్నముగా వర్ణింపబడినవి. ఇందలి శబ్దప్రయోగమునఁగూడ కొంత వైలక్షణ్యమున్నది. సంస్కృత సమాసములుకాక యిందు దేశీయములైన నుడికారములు జానపద వ్యవహారమున కనవచ్చు పలుకుబడులు హెచ్చుగా కనిపించును.

ప్రద్యుమ్నోదయ మైదాశ్వాసముల ప్రబంధము. శ్రీకృష్ణుఁడు రుక్మిణి సందేశము విని యామె నపహరించికొనివచ్చుట, ఆ దంపతులకు ప్రద్యుమ్నుఁ డుదయించుట, అతని కనిరుద్ధుఁడు పుట్టుట యిందలి యితివృత్తము. ఇందులో విశిష్టాద్వైతమునందలి వ్యూహములు వివరింపఁబడినవి. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్నానిరుద్ధభేదములచే వ్యూహములు నాలుగు విధములు ఈ నాల్గు వ్యూహములనుండి కేశవనారాయణాది ద్వాదశవ్యూహములు జనించును. వీని నుపవ్యూహము లందురు. విష్ణురూపములైన యీపండ్రెండును పండ్రెండుమాసముల కధిదేవతలు. ప్రధానములైన నాలుగు వ్యూహములలో వాసుదేవ వ్యూహము సర్వమహత్తరమైనది. దీనియందు జ్ఞానైశ్వర్యబలవీర్య

తేజస్సులను నాలు గుణములు నుండును. భగవంతుని షాడ్గుణ్యమూర్తి యనుట యిందుచేతనే అగ్నిద్యోతనుని సందేశ మిందు భావగర్భితమై యున్నది. ఆతఁడు రుక్మిణిని గూర్చి చెప్పుచు లక్ష్మీసహస్రనామావళి యందలి నామముల యర్థము ధ్వనింపఁజేయును. అతఁడు కృష్ణుని కొక సాలగ్రామము నిచ్చి —

"అయమ యిప్డు భీష్మనృపునాత్మజ పూర్వయుగంబునం బయ
స్తోయధిబిడ్డ మిక్కిలియు దూరముపోయిన జుంజురుందలం
బూయని పూవు చందిరుని పూన్చిన వెల్గుకుమార్తెయిప్పుడా
కాయజవైరి నీకుఁ దనకన్నియ నిత్తునటంచు వచ్చెనో"

అని చెప్పెను. అతఁ డిచ్చిన సాలగ్రామమే కాయజవైరి. శంకరాత్మజాయై నమః అను లక్ష్మీసహస్రనామమందలి యొక నామమున కీ పద్యము వ్యాఖ్యానము. రుక్మిణి పార్వతిని ప్రార్థించుచు వెల్వరించిన భావములు మనోహరములుగా నున్నవి. శశిదూతము నందువలెనే యీ ప్రబంధమునందలి శయ్యయు ప్రసన్నసుకుమారమై యున్నది. ఈ ప్రబంధము గొడవర్రు నివాసులైన శ్రీ జంధ్యాల వేంకటేశ్వర్లుగారి కంకితము చేయ బడినది.

రురుచరిత్రము సుమారెనిమిదివందల పద్యములతోఁ గూడిన ప్రౌఢప్రబంధము. భారతాదిపర్వములో రురుప్రమద్వరలకథ సంగ్రహముగా నున్నది. దాని నాధారముగాఁ జేసికొని పెక్కు నూత్నకల్పనలతో పెంచి విశ్వనాథవారీ ప్రబంధమును నిర్మించిరి. వారిందులో రురు నొకయోగిగా చిత్రించినారు. చావనునది మనుష్యుల చేతులలోనే ఉండుననియు దానిని మనుష్యులే తెచ్చుకొందురనియు అతని సిద్ధాంతము. రురునియోగము ప్రచండమైనది. అడవి మృగములుకూడ నతఁడన్న భయపడుచుండెడివి; ఒకపెద్ద సర్పమకారణముగా నతనితో విరోధము తెచ్చుకొన్నది. అతని హఠము తగ్గించుటకొఱకై దేవత లతని ప్రియురాలు ప్రమద్వరకు మృత్యువు కలిగించుటకు యత్నించిరి. పాములను చంపినచో సంతానము నష్టమగు నను నమ్మకము ప్రజలలో నున్నది. ఆ నమ్మకము ననుసరించి కవిగారు రురునివలన ప్రమద్వరకు కలిగిన సంతానము నష్టమైనట్లు కల్పించిరి. గర్భిణియైన ప్రమద్వర వర్ణన మిందు నూత్నమార్గమున చేయఁబడినది. అడవి జంతువులు, వాని మనఃప్రవృత్తులు, స్వభావములు మున్నగు విషయములను గూర్చి యిందెన్నో వివరములు కనిపించును. ఇందలి పద్యరచనకూడ నూతనమును శిల్పశోభితమునై యలరారును. పద్యరచనలో వలెనే వర్ణనలందును, అలంకార ప్రయోగమునందును ఈ ప్రబంధములో కవిగారి యుపజ్ఞ బహువిధముల వ్యక్తమగుచుండును.

పైన పేర్కొనఁబడిన కావ్యములనే కాక విశ్వనాథవారు కొన్నివందల ఖండకావ్యములను వ్రాసి ఆయా పత్రికలలో ప్రచురించియుండిరి. భారతి, శారద మొద

లైన సాహిత్య పత్రికల పూర్వసంపుటములను జూచినచో వారప్పు డెంత విరివిగా వ్రానెడి వారో తెలియవచ్చును వారి పద్యము లుండని పత్రిక లారోజులలో నుండెడివి కావు. అవి వారికి గౌరవ ప్రచారప్రదములై యుండెడివి: వారి ఖండకావ్యముల నన్నిటిని కూర్చి సంపుటములుగా ముద్రించు ప్రయత్నము జరుగలేదు. వానిలో ప్రసిద్ధములై యువకవులకు కంఠస్థములైన వెన్నో యున్నవి. కవిశృంగము, ఆశావాణి శ్రీహర్షుఁడు, ఆకాశదీపము, కేదారగౌళ, దేవునిరథము, రెండు నక్షత్రాలు అనునవి, నా కిప్పుడు జ్ఞప్తికి వచ్చినవి. ఈ ఖండకావ్యములలో వారి ప్రతిభా, రచనా చమత్కారము బహుభంగుల గోచరించును. కవికుమారుఁడు రాజకుమారుఁడును పుట్టి, పెరిగి పెద్దవారైరి. కవికుమారునిది పేదపుట్టుక. రాజకుమారుని జీవితము వైభవోపేతమైనది ఇరువురును కొంతకాలము జీవించి కీర్తిశేషులైరి. రాజు మరణించినప్పుడు ఆకాశమునుండి యొకనక్షత్రము నేల రాలెను. కవి మరణించినప్పుడు మింట నొకక్రొత్త నక్షత్రము వెలసెను. రెండు నక్షత్రాలను ఖండకావ్యమునందలి సారాంశ మిది. ఇందు కవి రాజపుంగవుల మహిమానుభావములందలి తారతమ్య మెంతో వ్యంగ్యముగా సూచింపఁబడినది. వారి ఖండకృతులన్నియు నిట్లే హృద్యభావబంధురములు. వారింతవరకు ప్రకటించిన మొత్తము పద్యములసంఖ్య యిరువదివేలకు పైగా నుండును. వ్రాసి చించివేసిన వింతకు రెట్టింపుండును. ఆంధ్రకవులలో నిన్ని రసవత్పద్యములు రచించిన వారెంద రుందురు?

విశ్వనాథవా రాంధ్రముననేకాక సంస్కృతమునకూడ కొన్ని గ్రంథములు రచించిరి. అది వారి కుభయభాషలందును గల పాండితీపాటవమునకు తార్కాణము. అమృత శర్మిష్ఠము, గుప్తపాశుపతము అనునవి వారు సంస్కృతమున రచించిన నాటకములు. ఈ రెండింటికిని మూలములైన కథలు మహాభారతమునం దున్నవి. గుప్త పాశుపతము మహాభారతయుద్ధముపై నాటకరూపమున చేయబడిన గొప్ప వ్యాఖ్యానము. వారి దేవీత్రిశతి అమ్మవారిని గూర్చి వ్రాయఁబడిన మూఁడువందల శ్లోకముల స్తుతి కావ్యము. వారు శివ సహస్రము వ్రాయ నారంభించి కొన్నివందలశ్లోకములు రచించిరి. కాని యది యింకను పూర్తికాలేదు. వారింకను సంస్కృతమున వ్రాసిన శ్లోకములెన్నో యున్నవి. ఆంధ్రమునవలెనే సంస్కృతమునఁగూడ వారి రచన ప్రౌఢసుందరమై యొప్పారును.

విశ్వనాథ కవితామేరువునకు శిఖరాయమానము శ్రీమద్రామాయణకల్పవృక్షము. దీనికి జ్ఞానపీఠమువారు లక్షరూప్యముల బహుమాన మిచ్చి తమయౌచిత్యపరిజ్ఞానమును ప్రకటించుటేకాక ఆముష్మికాభ్యుదయమునకును రాచబాట యేర్పఱచుకొనిరి. మున్ను భోజాదులు కవుల కక్షరలక్ష లిచ్చిరని ప్రతీతి. వా రక్షరమున కొకలక్ష యిచ్చిరి; జ్ఞానపీఠము వారక్షరమైన కావ్యమున కొక లక్ష యిచ్చిరి. మొదటి దానియందలి అతిశయోక్తిఁ దొలఁగించినచో రెండింట నంత వ్యత్యాసముండదు. రామాయణము రచించుటకు

ప్రతిభయొక్కటి చాలదు. సుప్రతిష్ఠితమైన భక్తియు నుండవలయును విశ్వనాథవారికి వ్యక్తావ్యక్తములుగా నారెండును పుష్కలముగా నున్నవి.

ఆంధ్రమున వాల్మీకి రామాయణమునకు నాలుగై దనువాదము లున్నవి. అవిగాక యందలికథను మాత్ర మనుసరించి స్వతంత్రముగా వ్రాయఁబడినగ్రంథములు కూడ కొన్ని యున్నవి. అట్టివానిలో హిందీభాషలో తులసీరామాయణమువలె తెలుఁగున మిక్కిలి ప్రసిద్ధమైనది శ్రీమద్రామాయణకల్పవృక్షము. దీనికి కవిగారి గృహనామ మును బట్టి విశ్వనాథరామాయణమనియు ప్రతీతి కలిగినది. పూర్వకవి విరచితరామా యణములు పెక్కుండగా మరల సీరామాయణ మేల యని ప్రశ్నించుకొని కవిసమ్రా ట్టులు చక్కని సమాధానములు చెప్పియున్నారు. "తలఁచిన రామునే తలఁచెద నేనును నాథక్తిరచనలు నావికాన" అనునది వానిలో చాలభావగంభీరమై యెన్నఁదగియున్నది. శ్రీరాముని యందెందటికో భక్తియున్నది. వారికిని ఉన్నది. "జాగ్రదవస్థనేమి యన స్వప్నసుషుప్తులఁగూడ రామనామగ్రహణంబె నావయిన మానసజిహ్వలు చేయు"నని వారు కంఠోక్తిగాఁ జెప్పజాలుట యీభక్తివిశేషముచేతనే. అది గ్రంథమున పెక్కు తావులందు వ్యక్తమగుచునే యుండును రామాయణమును కవులెందఱువ్రాసినను కథ యొక్కటిగానే కనఁబడవచ్చును కాని రచనలందుమాత్రము వైలక్షణ్య ముండకతప్పదు దాని కాయారచయితల ప్రతిభలయందుఁ గల తారతమ్యము ప్రధానకారణము. "కవి ప్రతిభలోన నుండును గావ్యగత శతాంశములలోనఁ దొంబదియైన పాళ్ళు" అని వారు చెప్పినదంతయు సత్యము కథ యొక్కటేయైనను ప్రతిభానుసారియై రసపాత్రాది పోషణము వైలక్షణ్యము పొందుచుండును.

కవిగారి పితృపాదులు "వ్రాసిన నీవు రామకథవ్రాసితి నం చనిపించు"కొమ్మ ని కుమారునికి బాల్యమునందే యుపదేశించియుండిరి. రామకథ యిహపరములు రెండును సమకూర్పఁజాలునని వారి విశ్వాసము. పిత్రాజ్ఞకు కవిగారి జీవునివేదనయు తోడైనది, సహజసుందరమైన మహాకావ్యము సిద్ధమైనది. అది కవిగారి సకలోహవైభవమునకును బట్టుఁగొమ్మ. వారికవితా శిల్పమునకు పరమావధి.

"ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తిత"మ్మని భరతాచార్యుఁడు కవ్యాంగ ములలో నిది చాలముఖ్యమైనది. ఇతరములైన యంగములు పెక్కు దీనినే యాశ్ర యించుకొని యుండును. విశ్వనాథవారు ప్రధానముగా వాల్మీకిరామాయణము నందలి కథా సంవిధానమునే యనుసరించినను తమకుఁ దోచినరీతి కొన్నిమార్పులు చేయుచు వర్ణన రసపాత్రపోషణాదులయందు స్వాతంత్ర్యము వహించుచు నీ రామాయణమును వినూత్నశిల్పశోభితముగా సంతరించిరి. అహల్యాఖండమునందలి యింద్రశాప వృత్తాంతము, సీతాపహరణ వృత్తాంతము మొదలగునవి వారు చేసిన మార్పులకు దృష్టాంతము, రావణునితో మాటలాడుచు నిదిగో రాముఁడు వచ్చుచున్నాడని పలికి సీత

పర్ణశాలాంతర్భాగమున కరిగెను. రావణుఁడు వెంట నంటి సీతకేశపాశములు పట్టుకొనెను. ఈసీత మఱొకసీత యనిపించును. అధ్యాత్మరామాయణమున నిట్టి కల్పనయే యున్నది. విశ్వనాథవారి రామాయణమున రావణుఁ డపహరించుటకు ముందువెనకల నున్న సీతలలో భేదము కనిపించును. ఒకతె జనకాత్మజాత; ఇంకొకతె జగన్మాత. జటాయువు రావణునితో—

"అయమ యెవ్వరొ యెఱుఁగుదు
వా యోగీశ్వరి విదేహపతి కూఁతురయా
ఆ యోగ్యతముఁడు రాముని
కౌయోషారత్న మూర్జితాత్మేశునకున్"

అని యామె స్వరూపము నెఱుఁగఁజెప్పెను. మారీచుఁడు బంగారులేడి యగుటకు ముం దాతనికిని రావణునికిని జరిగిన సంభాషణము విశ్వనాథవారి కల్పనాకౌశలమునకు తార్కాణము. వాల్మీకి రామాయణమునందువలెఁగాక కల్పవృక్షమున పరశురామ గర్వభంగము సీతారామకల్యాణమునకు ముందే జరిగినది. ఈ విధముగా వారు కొన్ని మార్పులు చేసినట్లే కొన్ని చేర్పులు కూడ కావించియుండిరి వానిలో ముఖ్యమైనది యుద్ధకాండారంభమునందలి హంస దౌత్యము. ఈ హంస వట్టిహంస కాదు. సాక్షాచ్ఛివుఁడే. కల్పితమైన యీహంస సందేశము పరమాద్భుతముగా నున్నది. రావణవధానంతరము రాముఁడు సీతతో నయోధ్యకుఁ దిరిగి వచ్చుచు నత్రియాశ్రమమున దిగెను. సీత అనసూయ కాళ్ళొత్తుచు రావణవధాదివృత్తాంత మామెకుఁదెల్పి రాముఁడు తన్నన్న మాట లెఱింగించెను. అనసూయ వెంటనే రామునికడ కరిగి యాతని కోపముతోఁ జూచెను. ఆమె యేమనునో యని రాముఁడు భయమందెను. ఇంతలో ననసూయ మరల్చుకొని యింటిలోని కరిగెను. అత్రి రామునితో "వృద్ధత వృద్ధత రామచంద్రః పౌరుషమును క్షత్త్రియావలి యెఱుంగును స్త్రీలును నేర్తురే ధురాకషణము పొందు గుండియకుఁ గల్గునొకో వెనుముందు చూచుటల్" అని పల్కి యతని నోదార్చెను అత్రి రాముఁడాడిన "జుగుప్సావార్థ"లైనమాటల నిందు చక్కఁగా సమర్థించెను ఈ కల్పన చాల అర్థగంభీరమై యున్నది. మూలకథాసూత్రము తెగకుండ విశ్వనాథవా రిట్టి మార్పు చేర్పు లెన్నో కావించిరి.

కథాకథనము గొప్పకళ. దీనియందు నన్నయభట్టు కృతహస్తుఁడు. అతని కథాకథన శిల్పమును వడఁబోసి వడఁబోసి యందలి సారము గ్రహింపఁగల్గిన వారు విశ్వనాథవారు రామాయణమున వారు ప్రదర్శించిన కథాకథనశిల్ప మనన్యసాధారణముగా నుండును. కథచెప్పురీతులు పెక్కున్నవి. అన్ని కథలను ఒకేరీతిగా చెప్పుటకు వీలు లేదు పాత్రరసభావ సన్నివేశాదులను బట్టి కథలను భిన్నభిన్న మార్గములలో చెప్పవలయును. ఈ మార్గములన్నింట విశ్వనాథవారు నిగ్గుతేరినవారు. ఎవరోయొకరు

కథ చెప్పుచుండఁగా విను వారిచే వారు మధ్య మధ్య నాకథాకథన పద్ధతులను గూర్చి వ్యాఖ్యానము చేయించుచుందురు. ఈ వ్యాఖ్యానములు పఠితల కాకథలయందలి కళా రహస్యముల నెరుంగుట కెన్నో విధముల తోడ్పడుచుండును. బాలకాండమున ప్రధాన కథ కంగములుగా పెక్కుపకథ లున్నవి. అందు చాల భాగము విశ్వామిత్రుఁడు రామ లక్ష్మణులకు చెప్పినది కొన్ని జనక పురోహితుఁడైన శతానందుఁడు చెప్పినవి, గాధేయుఁడు యాగము పూర్తియైన పిమ్మట రామలక్ష్మణులతోడను మునులతోడను గూడి మిథిల కరుగుచుండెను. దారిలో వారందరును శోణానదీ తీరమున విడిసిరి. సూర్యుఁ డస్తమించుచుండ మునులు హుతాశను నర్చించి విశ్వామిత్రునిచుట్టుఁ గూర్చుండిరి. శ్రీ రాముఁడు విశ్వామిత్రునా ప్రదేశమును గూర్చి యడుగుచు—

"తపములు కల్గునేమొ, యరుదార మహత్తులు కల్గునేమొ. యీ
కృపయును కల్గునేమొ, మఱియే ఋషులందున నే రసోల్బణా
నుపమయముగా కథాకథన ముండునె మీవలె మాకుఁ జెప్పఁడా
యివు........."

డని యర్థించెను. విశ్వామిత్రుఁడు రసోల్బణానుపమముగా కథ చెప్పునని రాముని వ్యాఖ్యానము. తరువాత విశ్వామిత్రుఁడు గాధి జననవృత్తాంతము చెప్పెను. అది నిజముగా నల్లేయుండును. రాముఁడు గంగావతారణ కథ చెప్పుమని యడుగఁగా ముని కుమారస్వామి వృత్తాంతము చెప్పి

"అడిగినదేమొ చెప్పకుపె యాయితర మ్మఖిలమ్ము చెప్పుమా
యుడుగక యట్లె వించుఁబడియుందురు శ్రోతలు నిద్దియే సుమా
గడుసరియౌ కథాకథనకౌశల మేమి యటందు"

రని ప్రశ్నించెను. ఇందు గడుసుఁదనముతోకూడిన కథాకథనపద్ధతి వివరింపఁబడినది. చెప్పువాఁ డడిగిన దేదో చెప్పివైచినచో వినువారి యుత్కంఠ తొలఁగిపోవును. వారి కింక వినుటయందు శ్రద్ధ యుండదు. అడిగినది వెంటనే చెప్పివేయక దానికి పూర్వాంగమైన యింకొక వృత్తాంతమును మొదలుపెట్టినచో దామడిగిన విషయము వచ్చునను తలంపుతో శ్రోతలు తత్పరులై వినుచుందురు. గంగావతరణకథ యిందు రమ్యముగా చెప్పఁబడినది. ఆ కథయంతయు విని లక్ష్మణుఁడు సాగరుల ఆస్తికత్వమును పట్టుదలను ప్రశంసించెను, అప్పుడు మేల్కొనియున్న ఋషులు—

"జామిపువులోని కేసరచ్ఛవి వహించి
ప్రాచి తెలివెల్గురేఖలు పారుదెంచె
నేమి సాగరుల్ వారలదేమి ప్రభులు
ఏమి కథ ఏమి చెప్పుట యేమి సొగసు."

అని ప్రశంసించి మరల శయ్యాగతులైరి. విశ్వామిత్రుఁడు చెప్పిన సాగరులకథ ఋషులన్నట్లుగా నత్యంత సౌందర్య సముపేతముగా నున్నది. దితిగర్భము నమ రేంద్రుఁడు చీల్ప నామె తొలుత కోపించియు తరువాత నతని క్షమించెను, ఈ కథ విన్న పిమ్మట శ్రీరాముఁడు విశ్వామిత్రుని జూచి

"ముని భృశాశ్వుని విద్య లిచ్చినది ఘనమొ
మునిపతీ యీ కథాళి చెప్పినది ఘనమొ"

అని ప్రశ్నించెను. భృశాశ్వసంబంధులైన యస్త్రవిద్య లిచ్చినప్పటి యానందముకంటె రామునికి విశ్వామిత్రుఁడు చెప్పెడి కథలు వినునప్పటియానందమే యమందముగా నుండెనఁట.

విశ్వామిత్రుఁడు తప మొనరించి బ్రహ్మర్షిత్వము సంపాదించిన విధమును శతా నందుఁ డెఱింగింప జనకుఁ డందలి దివ్యబోధను భావనాతీతమైన మహత్తును ప్రశం సించెను. రాముఁడు లక్ష్మణునితో

"ఈ ఋషు లెవ్వరు చెప్పిన
సారకథాకథన మొక్కచాయనె నడచున్
వీరంతర్దృష్టులు బహు
ధారూపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ !

నీ వికొక్కక్కసంగతి చూచినావె వత్స
అన్ని యంశములును జెప్పినట్టి తీరు
వేఱు మేనక కథతీరు వేఱుగాదె
యనిన లక్ష్మణుఁడౌననె నమృతమూర్తి"

అంతర్దృష్టులైనమునులు చెప్పెడి కథలు సారవంతములై యొక్కచాయనే నడచునట వారు సూక్ష్మతరకథాంశములను బహువిధముల నిరూపింతురట. మఱియు విశ్వా మిత్రుఁడు చెప్పిన యితర కథలరీతికిని మేనక కథ శతానందుఁడు చెప్పినరీతికిని భేద మున్నదఁట!

విశ్వామిత్రుఁడు కేవల ఋషిత్వముతో తృప్తిపడక మరల తీవ్రమైన తపమున కారంభించెను. అంతలో వసంతర్తు వరుదెంచెను. వసంతనవశోభ వచ్చె నప్సరసవోలెనని కవిగారు చెప్పిన యుపమాన మెంతో రమ్యముగా నున్నది. అది తరువాత తపోభం గము చేయ నరుదెంచిన మేనక యాగమనమును నాటకీయ పద్ధతిని సూచించుచున్నది. మేనక పుష్కరతీర్థమున స్నానమాడి నీళ్ళోడుచున్న కేశపాశములతో విశ్వామిత్రు నెదుటి కరుదెంచెను. విశ్వామిత్రుఁ డామెను జూచి నవ్వెను. ఆ నవ్వులోని యర్థము

గ్రహించి అచ్చరయు నవ్వెను. ఆమె నానిపోవునని ఋషి యామె కేశములను పిడుపు పెట్ట యత్నించెను.

"ఆమె వారించి తుడుచు కో నామె తివురు
నతఁడు వారించి తుడువఁగా నతఁడు తివురు
చేతులం దీయుచు పెనంగ చివరిదైన
ఫలము తడి కౌగిలింతగా పరిణమించె."

తరువాత క్రిందౌచు మీదౌచు వారు కేళీవిలాసము ననుభవించిరి. పదియేండ్లగు సరికి ముని తన తప్పిదము గ్రహించెను. కామక్రోధపరవశుఁడైన తాను క్షమాసదనుఁడైన వసిష్ఠుని ప్రార్థించుట కలలోనివార్త యని గ్రహించెను. అతఁడు మేనకపై నాగ్రహింపలేదు. ఆమె సుపర్వరాజు నదుపాజ్ఞలలోనిదని యాతఁడు సానుభూతి చూపెను. అంతలో మేనక యచ్చటి కరుదెంచి యాతనియందు మార్పుగాంచి యథోముఖియై నిలఁబడెను. ఋషి కోపింపక గర్భమును కాపాడి కణ్వముని యాశ్రమమున విడువుమని చెప్పి

"పనియేమొ దేవతలయది
వనితా కూలికిని గాని వచ్చినయట్ల
య్యును నెడఁదలోతు లిచ్చిన
నిను నేల శపింపవలయునే మధుమూర్తీ!"

అని ప్రశంసించెను. ఆమె యతని కొనర్చిన మే లనన్యసామాన్యమైనది. ఇంక నే కోకిల కూఁతయు నతని గుండియ తివియజాలదు. ఆమె కృపావేశముచే నతని కసలు కోకిల యననేమో యర్థమయ్యెను. అతఁ డామెను గాంచి

"కోరి ప్రత్యక్షమన్మథగురువ వైతి
కోరక పరోక్షవైరాగ్యగురువ వైతి
లంజియా! యెంతక్రిందికి గుంజినావొ
యంతపైకిని జనుమార్గ మరసినావు."

అని ప్రస్తుతించి "నవ్వకు సువ్వె నామకథ నామీయప్సరఃపాళితోఁగానీ చెప్పి" అని పరిహాసముచేసి "తాను గామము కోసి వేసినట్లు బలారితోఁ జెప్పు మని రాయబారము పంపి యామెను విడిచి యెటకేనియుఁ బోయెను.

ఇది శృంగారరసభరితమైనకథ. నాయకుఁడు ముని, నాయిక అచ్చర. అతఁడు పదియేండ్లు శృంగారరసలోలుపుఁడై కాలము పుచ్చియు, దానికి బానిసకాలెదు. మరల తనస్థితి సింహావలోకనము చేసికొని తమస్సునుండి బైటపడెను. సాధారణునికిని ఘౌని

కిని నున్నభేద మిది. అతఁడు మేనకను శపింపకపోవుట కతని రసార్ద్రమైన హృద యము కారణము. ఆమె యింద్రుని యదుపాజ్ఞలలోనిది. పైఁగా దోషము తనది. ఆమెను శపించుటేల? అతఁడామెను ప్రశంసించిన పద్ధతి వ్యంగ్యవిలసితము. తనకథః పతనము కలిగించిన యామె నాకసమున కెత్తినాఁ డతఁడు. ఇంత వైరాగ్యములో స్వదోష సంజనితమైన గర్వము నెడ నాతఁడుచూపిన అక్కటిక మచ్చెరువు కలిగిం చును. రసమయమైన యీ కథ చెప్పినతీరు రమ్యాతిరమ్యముగా నున్నది. ఇట్లే సుగ్రీవుఁడు రామునికి దుందుభి మాయావుల వృత్తాంతము చెప్పినవిధమును హృద్యమై యున్నది.

కథలను జెప్పుచు విశ్వనాథ వా రచ్చటచ్చట వ్రాయు సంభాషణము లెంతో సహజములై, లోక వృత్తానుకారులై ముచ్చట గొల్పుచుండును. వారి శైలి యంతట నొక్కమాదిరిగా నుండదు. అది సందర్భ సన్నివేశప్రయోజనములనుబట్టి మారు చుండును. వారి సంభాషణలందలిశైలి సరళసుందరమై యతి జాతీయమై శిష్టులైన ప్రౌఢుల చమత్కారయుత సంభాషణలను తలపించుచుండును. యజ్ఞము చూడవచ్చిన జటాయువు తోడను, రోమపాదునితోడను దశరథుఁడు కావించిన సంభాషణమును. జన కుఁడు విశ్వామిత్ర దశరథులతోఁ జేసిన సంభాషణమును; అరణ్యపర్వమున సీతారామ లక్ష్మణులు పలువురు ఋషులను సందర్శించినప్పుడు వారితోఁ గావించిన సంభాషణ మును, సుందరకాండము నందలి సీతాహనుమంతుల సంభాషణమును ఇందుకు తార్కా ణములు. ఆ సంభాషణములందలి పరిహాస చమత్కారములును, గౌరవోదాత్తములును స్నేహాదరములును వర్ణనాతీతములుగా నుండును. అచ్చట వారిశైలి వ్యవహారమునకు సన్నిహితమై, సులభమై రసస్ఫోరకముగా నుండును. అవి వారిలోకజ్ఞతకును, రసికతకును బట్టుగొమ్మలై దృశ్యకావ్యకళాసంపదను బుడికి పుచ్చుకొనుచుండును.

కావ్యము లష్టాదశవర్ణనముల కాలవాలములై యుండవలెనని మన లాక్షణికులు చెప్పుదురు. కేవల లక్షణానుసరణమునకై చేయఁబడు వర్ణన లొక్కొక్కప్పుడు కథా గమనమున కాటంకము కలిగించును. రామాయణ కల్పవృక్షమున కథాసందర్భాను గుణముగా పెక్కువర్ణనలు కావింపబడినవి. విస్తరభీతిచే నొండు రెండింటినిమాత్ర మిచ్చట పేర్కొందును. బాలకాండమున విశ్వామిత్రుని తపస్సు వర్ణించునప్పుడును, సీతారాముల వివాహానంతరమును ఋతువర్ణనము రెండుమార్లు చేయఁబడినది. ఏ ఋతు వును వర్ణించు నప్పు డా వాతావరణమును గల్పించి విశ్వనాథవారు వానిని పఠితలచే ననుభవింపఁ జేయుదురు. యువదంపతులైన సీతారాము లాయా ఋతువులలో ననుభ వించిన పవిత్ర ప్రణయవిలాసములను వారుస రసముగా వర్ణించి యుండిరి. ఒకొ్కక్క ప్పు డేదైన సంఘటనము జరుగుటకు కొన్ని సంవత్సరములు పట్టును. అకాలపరిమి తిని సూచించుటకై వారు ఋతువర్ణనము నెంతో మెలకువతో నుపయోగించుచుందురు.

దశరథుఁడు గర్భవతులైన తన ముువ్వురు రాణులకును నాలవనెలయందు సీమంతోత్సవములు కావించెను. ఇచ్చటఁగల "వర్షాసమారంభ వైభవం బొలసినంతఁ బయోధరాగ్రముల్ నల్లబాఱె"నను సీసపద్యమించుక శ్లేష గర్భితమై ప్రకృతిని రాణులనుగూడ సమయముగా వర్ణించుచున్నది. ఇందు ప్రౌఢత, సూక్ష్మపరిశీలనము రెండును ఒకే సారి ప్రత్యక్షమగుచున్నవి. ఇట్లు కథాసంబంధిగా ప్రకృతిని వర్ణించు నేర్పు పరమౌచిత్య భాసురమై పాఠకులకు పారవశ్యము కలిగించును.

ఋషులు వానరోజులలో నగ్నిహోత్రకుండము లారిపోవునేమోయని జాగరూకత వహించిరి. గ్రీష్మమున నవి పర్ణశాలలను పరశురామప్రీతి కావించునేమోయని శ్రద్ధవహించిరి.

"అగ్నిహోత్రకుండంబులు నారిపోవు
నేమొయని వానరోజుల నెంతయత్న
పడిరొ యీనాళ్ళ నగ్నులు పర్ణశాల
లంటుకొనకుండ ఋషులంత యత్నపడిరి."

ఇది వారి పరిశీలన నైశిత్యమునకు మంచి యుదాహరణము. యజ్ఞాచరణమునకు దశరథుని బ్రేరేచు సందర్భమున వసిష్ఠుడు తన పాదములపైఁ బడిన రాజును లేవనెత్తి కౌఁగిలించుకొనెను. మునిపతి జనపతు లిర్వురికి నా సమయమున నానందబాష్పము లుప్పతిల్లెను.

"మునిపతి జనపతియును పూ
నినగాదిలి కౌఁగిలింత నిడుపులయిన యా
మునిపతి జనపతిగడ్డము
లనుబడి ప్రమదాశ్రుతతి తళాతళ మెఱసెన్"

కవిగారికి వారి తెల్లనిగడ్డములే కాక వాని నిడువుందనము కూడ గోచరించెను. వర్ణనములు చేయునప్పు డీ విధముగా నతిసూక్ష్మ విషయములను గూడ విడువకుండుట శ్రీ సత్యనారాయణగారికి పరిపాటి.

దశరథుఁడు ముువ్వురు దేవేరులకడ కరిగి తన సంతానవాంఛ వారి కెఱిఁగించెను. ఎన్నితరువులున్న వన్నియుఁ గాయంగ పూటపూతవేచు తోఁట మాలివలె నతనికి తన ముువ్వురు పత్నులను సంతానవంతులు కావలెనని కోరిక. వారాతని కోరిక మన్నించి గృహీతదీక్షాస్ఫురిత తనూవల్లికలై అంతఃపురములు వెల్గించిరి. రాజు సౌధాగ్రమునెక్కి సరయూనదిని పురమును చూచుచుండెను. అప్పు డిందు బింబము ప్రాచి బారెఁడు పైని హాసు లొలికెను. "క్రతుయత్న మెంతదూరము వచ్చెనో చూడ వెల్లెన్గువ్రజి పంపించె నొక్కొ"అను సీసమున కవిగా రిందు బింబము దశరథుని కెట్లెట్లు కన్పించెనో రమ్య

మైన యుత్ప్రేక్షలతో వెల్లడించిరి. ఇచ్చటి యుత్ప్రేక్షలకు కథతోనేకాక ధర్మముతోఁ గూడ నెంతో యనుబంధమున్నది. సుమంత్రుఁడు శాంతా ఋశ్యశృంగుల వివాహమును వర్ణించి యాఋశ్యశృంగునిఁ దెప్పించి యజ్ఞమొనరింపుమని రాజును ప్రోత్సహించెను. అప్పు డుదయించిన చంద్రు డు సంతాన కాంక్షతో నుఱ్ఱూతలూగుచున్న "ఒనర బొర్కాడించి యుయ్యేలతొట్టెలోఁ బండఁబెట్టిన పపిపాపవోలె" గోచరించి ముందు జనింపఁబోవు పసి నిసుంగుల క్రీడావిలాసములను ప్రత్యక్షీకరించియున్నాఁడు. యజ్ఞాచరణ సమయమందలి వసంతమున రాజునకు "ప్రతిరసాలకుజంబు పచ్చిపిందెలతోడ నెల మసలిన కాంతవలెనె తోఁచె" ఇచ్చట కవిభావము కథాలగ్నము, అందుచే వర్ణనముకూడ కథతో సంగమించి పోవుచున్నది. రాముఁడు శివధనుస్సు వర్ణించిన సందర్భమున నుప్పతిల్లిన మ్రోత సర్వదిగంతములందేకాక లోకాంతరములందును వినిపించెను. ఆ మ్రోత వర్ణన మతిలోక గంభీరమైనది. అవి చదువువారికి శ్రీరాముఁ డప్పుడు విల్లువిరుచుచున్నట్లుండును. అది నన్నయగారి యుదంకుని నాగరాజు స్తుతి పద్యములను స్మృతికిఁ దార్చుచుండును.

అహల్య శ్రీరాముని కొసంగిన స్వాగతము మాధుర్య మింతింతనరానిది. రాముఁ డామెకు సచ్చిదానందముల్ స్కంధత్రయము గుర్తుగానున్న యొక చెట్టుగాని చెట్టువలె భాసించెను. ఆమె కప్పుడు కలిగిన యానంద మపరిమితము. ఇచ్చట సీసముల సౌందర్య మనుభవైకవేద్యము.

"ప్రభుమేవిపై గాలి పై వచ్చినంతనే
పాషాణ మొకటికి స్పర్శవచ్చె
ప్రభుకాలి సవ్వడి ప్రాంతమైనంతనే
శిల కొక్కదానికిఁ జెవులు కలిగె
ప్రభుమేని నెత్తావి పరిమళించినతోన
యశ్మంబుం ఘ్రాణేంద్రియంబు చెందె
ప్రభునీలరత్నతోరణమంజులాంగంబు
కనవచ్చి రాతికిఁ గనులు కలిగె

నా ప్రభుండు వచ్చి యాతిథ్యమును స్వీక
రించినంత నుపలహృదయ వీథి
నుపనిషద్వితాన మొలికి శ్రీరామభ
ద్రాభిరామమూర్తియగుచుఁ దోఁచె

ఇందు రాయి యభిరామ సతీమూర్తి దాల్చిన తెఱఁగు వర్ణింపఁబడినది. ముందు పైగాలి, పిమ్మట కాలి సవ్వడి, తరువాత మేని నెత్తావి పరిమళము, అనంతర మంగదర్శనము, తుది నాతిథ్య స్వీకరణము అనువాని క్రమవర్ణన మెంతో సరసముగా నున్నది. ఆ

రాయికి శ్రీరాముడు కొంత దూరమున నున్నప్పుడే చైతన్యము కలుగఁజొచ్చినది. శబ్ద స్పర్శ రసరూప గంధములకును పంచేంద్రియములకును సన్నిహిత సంబంధమున్నది. ఆయా యింద్రియముల నాయా గుణములతో సరికూర్చుటలోఁగల సౌబగ ప్రతిమానమై నది.

యుద్ధకాండమున రామరావణ పక్షవీరుల యుద్ధమును వర్ణించునప్పుడు విశ్వనాథవారు చూపిన నేర్పద్వితీయమైనది. వివిధ శస్త్రాస్త్రముల ప్రయోగమును దత్ఫలితమును వర్ణించుపట్ల వారు విజ్ఞాత తత్సకలాయుధప్రయోగోప సంహారులవలె కనిపింతురు. నిస్సంశయఖండమున "రామచంద్రునిఁగాంచెను రావణుం"డను మకుటముతోఁగూడిన సీసములు కొన్నియున్నవి. అందు రావణునికి కనిపించిన శ్రీరాముని స్వరూప స్వభావముల వర్ణన మద్భుతముగా నున్నది. సంశయఖండమున నాగాస్త్రబద్ధులైన రామలక్ష్మణులు గరుత్మదాగమ నానంతరము తేరుకొన్న పిదప తెల్లవారుటయు సూర్యుఁ డుదయించుటయు వర్ణింపఁబడినవి. అప్పు డీ క్రింది సీసమున వివిధములైన పుష్పముల పరిస్థితిని విశ్వనాథవా రెంతో సహజ సుందరముగ వివరించి యున్నారు.

"నలినకాంతా సమానత గండభాగానఁ
  జిటిక వేసెనొ నవ్వె చెఱిగిపోసె
ముద్దమందారమ్మ బుగ్గపై నొక్కెనో
  కమలిపోయినయట్లు కందిపోయె
లలిఁబారిజాతమ్మ గిలిగింత పెట్టెనో
  తూగాడుకొమ్మనే తూలిపోయె
రాదంచుమోటు పరాచిక మాడెనో
  ముగుదకల్వయు మోము ముడుచుకొనియె

రుద్రజటముక్త కంచుకారూఢయయ్యె
చంద్రకాంతమ్మ చిఱునవ్వు సంతరించె
నొక్కఁడొకఁడు స్వభావంబు పిక్కటిల్ల
నబ్జబంధుని బానిసలైనపూలు"

వారి ప్రకృతి పరిశీలన మెంత పరిగాఢమైనదో దీనివలనఁ దెలియవచ్చును. వారు సృష్టియందలి సర్వపదార్థములను వివిధ జీవులను వారి స్వరూప స్వభావములను రామాయణమున వర్ణించి యుండిరి. దేనిని వర్ణించినను దాని సమగ్రస్వరూప తత్త్వములను వారు ప్రత్యక్షము చేయుదురు.

రసపోషణమున విశ్వనాథవారు చూపు ప్రతిభకు మేరలులేవు. "పాగ్విపశ్చిన్మతంబున రసము వేయిరేట్లు గొప్పది నవకథాదృతిని మించి" యను రహస్యము వా రెఱిగి

నదే, కరుణవీర శృంగార శాంతరౌద్రరసములు రామాయణమున చక్కగా పోషింపఁబడినవి. హాస్య మక్కడక్కడ నాకులలోఁ బూవువలెఁ దొంగి చూచుచుండును. విశ్వామిత్రుఁడు మేనక చెక్కిటఁ చెక్కిలి చేర్చి గడ్డము గ్రుచ్చుకొన్నదాయని గ్రుచ్చిగ్రుచ్చి యడుగును. "తన హస్త మామె హస్తము మీద బోర్లించి నీచేయి లేదని నిహ్నవించు" విశ్వామిత్రుని చేయి యంత మోటు. మఱి రాముఁడు కూడ సీతచేయినట్లే చేసి "ముదురాకు చివురాకుఁబడును"అనును. అతని చేయి మునిచేయియంత మోటుకాదు; సీతచేయియంత సున్నితముకాదు. ముదురాకువంటి దాతనిచేయి. రాముఁడు తన చెక్కిలి సీత చెక్కిటఁ జేర్చి గడ్డము గ్రుచ్చుకొన్నదా యని యడుగఁడు; ఏవో రహస్యంబు లెత్తిపోయును. బాలకాండమున సీతారాముల శృంగారము మనోహరముగా వర్ణింపఁబడినది. కవిగారచ్చటచ్చట భావి వియోగమును సూచించుచు జెప్పు వాక్యములు చదువునప్పుడు పఠితల గుండెలు కళుక్కుమనును. రాముఁడు తన ప్రేమప్రవేగు చూపించుచునే "ఒక్క సమయానమనకు వియోగమైన ప్రేమ యేమగునంచు" వారించుచుండును. అరణ్యకాండము కరుణ వీరములకును, సుందరకాండము వీర కరుణములకును, యుద్ధకాండము వీర రౌద్ర కరుణములకును ఆటపట్టులు ఇంద్ర జిన్మరణానంతరము రావణుడు రావణవధానంతరము మండోదరీ విభీషణులును, లక్ష్మణుఁడు మూర్ఛితుఁడైనప్పుడు రామచంద్రుఁడును విలపించిన ఘట్టములు కరుణరససముద్రములు. లక్ష్మణుఁడు మూర్ఛిల్లిన సమయమున రాముఁడు సుషేణునిఁగాంచి—

"ఇతఁడు చనిపోవలేదని యీవు చెపుమ
యితని బ్రతికింతు ననుచును నీవు చెపుమ
యితఁడు బ్రతుకక యున్నచో బ్రతుక నేను
నాకు రాజ్యమ్ము వలదు జానకియు వలదు."

అని చెప్పిన మాటలలో కరుణ రసప్లావితమైన యాతని మానసస్థితి ప్రత్యక్షమగుచున్నది. పలువురు రాక్షస వీరులు మరణించిన పిమ్మట వారి దారపుత్రికాదులు రావణు నుద్దేశించి.

"మస్తకముల్ ముసుంగులయి మాబ్రతుకుల్ మఱియేమి, యేమి మా
నిస్తులమైన యీలువులు నేటను త్రేపట నయ్యో రాహుసం
గ్రస్తములైన మావగు మొగంబులు చూడుము రాజ నీకు మా
పుస్తెల త్రాళ్ళమీఁదఁ బగ పూనిన జానకి యెందు గన్పడెన్"

అని కన్నీరు మున్నీరుగా నేడ్చిరి. ఇచ్చటి కరుణము పరోక్ష నిందాగర్భమై రావణునికి దుఃఖమును కోపమును గల్గించినది రావణుఁడు యుద్ధభూమి కరుదెంచి వీరవిహారము కావించెను. అప్పుడు కవిగా రతఁడు కపులను పఱిచిన పాటిట్లు వర్ణించియుండిరి.

"రక్షః శరాంతకావ్యముగ చెవుల్ తెగి
పడిన సంగీతమ్ము పాడె నొకఁడు
అసురేశ్వరుని వాలుట మ్మూరువులను ఛే
దించ మద్దెలను వాయించె నొకడు
అసుర శరాతి సర్వాంగమ్ములను రట్టు
సేయఁగా నాట్యమ్ము చేసె నొకడు
అరచేతులను దైత్యవరుఁడు మండింపఁగా
విల విల తాళంబు వేసె నొకఁడు

రామ భూపాల రాగ పర్యాప్తగళులు
వేలకొలఁదిగ పాడిరి ఘనుకహంగు
రావణుఁడు శరాంత కార్యముగ రామ
భజన చేయించె వానరవ్రజముచేత."

ఈ పద్యము హాస్యచ్ఛాయతోఁగూడిన వీరకరుణ రససంగమ సన్నివేశము. రసపరిపోషణమున విశ్వనాథవా రద్వితీయ ప్రజ్ఞాధురంధరులు.

రామాయణ మొక మహాసముద్రము. అనంత జీవిసముదాయమునకందు ప్రవేశసంచారములుకలవు. వాల్మీకి యందలి పాత్రల తీర్చిదిద్దినతీరు నిరుపమానము. ఆ విషయమున నతని కీడు రాజాలిన వారుండరు. విశ్వనాథవా రొక్కరందు కపవాదభూతులు. వారి పాత్ర చిత్రణరీతి వివరించుట కొక గ్రంథము కావలెను. వారిందలి ప్రతి పాత్రను సుస్పష్టరేఖలతోఁ దీర్చి దిద్దిరి. రాముఁడు తత్సోదరులు, దశరథుఁడు తద్భార్యలు, రావణుఁడు తత్సుతపుత్రి సోదరులు, వాలిసుగ్రీవులు హనుమ, వశిష్ఠ విశ్వామిత్రులు; ఇతర మునులు, జానకీ, మండోదరులు, మారీచుఁడు, జటాయువు, శూర్పణఖ, శబరి, మంథర, మాతలి, సుమంత్రులు మున్నగువారిని వారు చిత్రించిన తీర దృుతముగా నుండును. "రామో విగ్రహవాన్ధర్మః" అనుసూక్తి వీరి కావ్యమునకును అన్వయించును. సీత జగన్మాత. వశిష్ఠుఁడు తపోరాశియే కాదు పరబ్రహ్మమూర్తి. విశ్వామిత్రుని పాత్రము వారి యద్భుతసృష్టి. లక్ష్మణ భరతులు భ్రాతృభక్తి పరమావధులు. కైక యిందు దుష్టురాలు కాదు. దశరథుఁడు కౌసల్యా సుమిత్రలను జూచిన పిమ్మట, కైకయింటి కేగి సంతానప్రాప్తి విషయము ముచ్చటించెను. ఆమె "నాతోనే మగు నాకోసల భూనాయకసుతకు మొదటఁ బుట్టఁగవలయు"నని పల్కెను. ఆమె సమభావమట్టిది. సీతారాము లందామెకుఁగల ప్రేమ యపూర్వము. అహల్యపడిన వేదన రామునందామె చూపిన వాత్సల్యము మఱపురానివి. వాలి సుగ్రీవులలో విశ్వనాథవారు చూపిన భేదమిది.

"అతఁడు పురుషకారమం దధి కా దరుం
డీవు విశ్వసింతు దైవమందు
నతఁడు రాజభావ మందతి తీక్ష్ణుఁడు
నీకు బంధుభావమే కడింది."

అనునవి శ్రీరాముఁడు సుగ్రీవునితో నన్నమాటలు. హనుమంతుఁడు విశ్వనాథవారి దృష్టిలో పరమేశ్వరుఁడు; సాకారబ్రహ్మము. రావణుఁడు మహావీరుఁడు. సాహంకారుఁడయ్యును హృదయశూన్యుఁడు కాఁడు. హనుమంతుఁడు లంక కరుదెంచి యంత రట్టుచేయుట, రాముఁడు వానరులతో తనపైకెత్తి వచ్చుట. ఆతని కాశ్చర్యము కలిగించెను. మండోదరి పాతివ్రత్యనిధి. విభీషణుఁ డుచితానుచితజ్ఞుడు. భక్తిసేవధి. మారీచుని పాత్ర మిం దద్భుతముగా చిత్రింపబడినది. ఒక్క మారీచుఁడే యననేల అధికాల్ప భేదములేకుండ నన్నిపాత్రలును ఇందు సుస్పష్టరేఖలతో విశద హృదయ తత్త్వములతో గోచరించును.

విశ్వనాథవారు శబరి భక్తి నద్భుతముగా వర్ణించి యున్నారు. శ్రీరామాగమన వార్త విని శబరి పూలు పండ్లు మెట్టపళ్ళికలోఁ బేర్చి దానిని శిరమున నిడుకొని యాతని కెదురేగెను. ఆమె యతని పండ్లు తినుమనఁగా నతఁడు "నట్టడవిలో నన్ను నిలఁబెట్టి యివి తినుమన్న నె"ట్లని సందేహము వెలిపుచ్చెను. ఆమె మర్యాదా మహాంబోధియు నిత్య పవిత్రమూర్తియు నైన నీకు స్నానాదు లెందు కని తెల్పి

"చేతులునికిఁ బూలు తెచ్చితిని స్వామి
చెట్లు కలవని పండ్లు తెచ్చితిని స్వామి
సతను వగుటను నేను వచ్చితిని స్వామి
చిత్తముండుట నూహ చేసితిని స్వామి."

"నాదు ప్రాణములను నీకు మీదుఁకట్టి
నాదు నీవయి యిటువచ్చినావు స్వామి
మ్రొక్కు చెల్లింతు స్వీకరింపుము ప్రియాంగ
నా మహాయల్లకానల ధూమదేహ"

యని ప్రార్థించెను. తరువాత ఆమెకును శ్రీరామునికిని విచిత్రమైన సంభాషణసాగెను. రాముఁ డామెను "అవ్వ నివ్వరి వెన్నుల యట్లు ముగ్గుబుట్టవలె నయ్యె నీశిరంబదేమి" యని యడుగ నామె

"ప్రభువః నీయాత్మ వాకిట రంగవల్లి
నించుటకు నింతగాఁగఁ బండిన" దని

సమాధానము చెప్పెను. తరువాత నామె చితి ప్రవేశించి దివ్యలోకముల కరిగెను; ఇచ్చటి శబరిభక్తిలో మాధుర్యచ్ఛాయలు గోచరించును. ఆమె యతని "చిత్తజన్మ ప్రాణనాథ" యని సంబోధించును. ఈ శబరీఖండమంతయు భక్తిరసమయమై మకరందప్రవాహమువలె సాగిపోయినది.

విశ్వనాథవారిరచన పెక్కుచోట్ల ధ్వనిప్రధానమై యుండును. ఒకటి రెండు ఉదాహరణములు మాత్ర మొసంగెను. గంగానదిని దాటుటకై సీతారామలక్ష్మణులు గుహుని పడవయెక్కినప్పుడు రాముఁడనిమి తట్టునఁ గూర్చుండి తన పాదములను జలమందు కడుగుకొనునప్పుడు వారు "తానసహస్రసహస్రవత్సరము వేగ వెలసెనది విష్ణుపాదోద్భవీత్వరేఖ" నని వర్ణించియుండిరి. శ్రీరాముఁడు గంగలో పాదములు పెట్టగనే దానికి విష్ణుపాదోద్భవ యను నామము సార్థకమయ్యెను. శ్రీరాముని విష్ణ్వవతారత్వ మిట వ్యంగ్య మొనర్పఁబడినది. లక్ష్మణుఁ డాదిశేషుని యవతారమను విషయమును వారు పెక్కుచోట్ల ధ్వనింపజేయుచుందురు. యుద్ధకాండమున సారణుఁడు రావణునికి రామునిసేన యందలి వీరులను గూర్చి తెల్పుచు

కనులులోన మలంచు కాలాహు లౌకవేయి
పడగలు ముడిచిన పగిది నుండు
నాతఁ డన్నగారి కస్త్రశస్త్రములందు
వ్రేలెఁ డట్టు లిట్లు వెలయునంద్రు.
ఒక్కసారి నన్ను నూగి కన్గొనినాఁడు
నాకు మేన నహులు ప్రాకినట్లు"

అని తెల్పియుండెను. ఇట్టి ధ్వనిమంతమైన రచన రామాయణము నందంతటను గోచరించును.

విశ్వనాథవా రచ్చటచ్చట దీర్ఘసంబోధనలను వాడుచుందురు. అవి యద్భుతములై జరిగిన కథనంతను సింహావలోకనము చేయుచుండును. ఇట్లే తర్కవేదాంతాది శాస్త్రములతో వారికిఁ గల పరిచయ మక్కడక్కడ చక్కగా ప్రదర్శింపఁబడుచుండును.

"మధుసూదన! నేను నుష
ర్బుధుఁడును దేవతల మనుట పోయి పదార్థ
ప్రథ మిగిలినాము. జ్ఞానాం
బుధి తర్కము ముదురుపాకమునఁ బడి యచటన్

మున్నగు పద్యము లిందుకు తార్కాణములు.

"లేని వున్నట్లుగాఁ గానిపించుట కెండ
మావులు తార్కాణ మలయఁజేసె
పైని పటారమ్ము లోని లొటారమ్ము
మేనంచు రూపించె మేడిపండు"

అను పద్యము వారి వేదాంతశాస్త్ర విజ్ఞానమునకు నిదర్శనము.

శ్రీ సత్యనారాయణగారి భావన యతి పటిష్ఠమైనది. నన్నయనుండి నేఁటివఱకు వఱలిన ఆంధ్రకవీంద్రుల నందఱిని పరిశీలించినను ఇంత భావనా మహత్త్వము కల వారెందఱో కనిపింపరు. వారు రచించిన ప్రతి పద్యమునం దొక అద్భుతమైన క్రొత్త భావ ముట్టిపడుచుండును. విశ్వామిత్రుఁడు తనకొల్వునకు రాఁగనే దశరథుఁ డాతనిఁ గాంచి

"నీవై సేరుట నా గృహంబులు త్రివేణీ సంగమస్నాన పు
ణ్యావిర్భావము కల్గె నాయెడల గాయత్రీ మహాదేవి శ్రీ
సావిత్ర్యాకృతి ద్రష్ట్రభేదముగ సాక్షాత్కార మిప్పించెనే
లా వేదమ్ములు నాల్గు నాలుగు మొగాలం బాడిన ట్లయ్యెడిన్.

ఇత్యాదిగా కొన్ని మాటలు చెప్పి తనయ నందమును ప్రకటించెను. గాధేయాగమము వలన నతఁడు పొందిన మహానందమున కక్షరమూర్తు లిచ్చటి పద్యములు. వసంత కాలము నందలి మన్మథమూర్తి "వైజయంతీ పుష్పవాసనా భరితమౌ వైకుంఠువక్షంబు నట్టివాఁడు"గా" మరల సృష్టినిజేయు మహిత ప్రాతర్వేళ బ్రహ్మదేవుని యూహవంటి వాడు"గా కవిగారికి కన్పించెను. సుందరకాండమున హనుమ సీతతో—

"ఆ యా యల్లక మీవుగాని జగదంబా చూచినన్ లోతుగా
నీ యాయల్లకమల్ల స్వామియనుగానీ పొందుచున్నట్లునా
నేయింతైనను నాకుఁదోచదుగదే యీమాట మన్నింపవే
మీయాంతర్యములందు మీరు స్థిరమై మేలే జగన్నాశముల్"

అని పల్కెను, సీతారాములు పరస్పరవియోగ సంజనితవేదన ననుభవించుట లేదని కాదిందలి భావము. వారెడగల్గి యున్నను ఒండొరుల యాంతర్యములందు సుస్థిరులై యున్నారని యిందలి పరమార్థము. విశ్వనాథవారి రామాయణమంతయు నొక యుదాత్తభావరత్నాకరము. అం దెన్ని రత్నములనని యెన్ని చూపుట!

ఇంక రామాయణమునందలి శైలినిగూర్చి యించుక ముచ్చటింతును. విశ్వనాథ వారి పదప్రయోగము వింతగా నుండును. ఏయే పదముల నెట్లు కూర్చిన జాతీయముగా మనోహరముగా, నౌచిత్యశోభితముగా నుండునో వారికిఁ దెలిసిన ట్లెందరికో తెలియదు, అయన సమాసములు వాడుదురు, వానికూర్పు కొంత విలక్షణముగా నుండును. పరి

చయమున్నవారికిఁగాని యవి సులభముగా బోధపడవు. వాని కూర్పులో నెంతో చమత్కారము, ప్రౌఢిమ గోచరించును. కేవల మృదుమధుర పదప్రయోగమే రచనకు సౌందర్యము తేఁజాలదు. రసానుగుణమైన పదప్రయోగ ముండవలయును. సంభాషణములపట్ల విశ్వనాథవారు వ్యవహారమునకు సన్నిహితమైన జాతీయములు వాడుదురు. అచ్చటి కూర్పెంతో రమ్యముగా నుండును.

"ఉండుమని యెంత బలవంతమో పౌనర్చె
రాజు- మీమానవులకు నారాక యొకఁడె
వేగు-నిలుచుట కాదని వెడలె నతఁడు
రాజునకును కన్నీళ్ళ పర్యంతమయ్యె"

యజ్ఞము చూచుట కరుదెంచిన జటాయువు తిరిగి వెళ్ళునప్పటి పద్య మిది. శ్రీరాముఁడు విశ్వామిత్రుని విశాలాపురము నేలు రాజర్షి వంశమునుగూర్చి యడుగుచు

"శ్రీవిశాల విశాలాపురీవరంబు
నేలు రాజర్షివంశ మదేమి స్వామి
యూది చెప్పవె-నీనోటినుండి వచ్చు
సిరిపలుకు క్షీరవారాశి తరఁగ చిలుకు"

అని పలికెను. విశ్వామిత్రుని మాటయే కాదు. కవిగారిమాటయు నట్టిదే. వారి రచనలో నచ్చటచ్చట శ్రవణసుభగమైన శబ్దాలంకారప్రీతి కనిపించును. సీసములు కొన్నిముక్త పదగ్రస్తముతోడను; కొన్ని యాద్యంత ప్రాసములతోడను గూడి యద్భుతములుఁగా నుండును.

"అగు శతానందుఁ డీవుగా నగుదొ లేదొ
యాశ్రితులము శతానందు లైతి మేము"

అనుచో శతానందపదమున యమకముతోఁ గూడిన చమత్కారము. ఇంక రమ్యములైన యుత్ప్రేక్షలు, అర్థాంతరన్యాసములు అసంఖ్యేయములు. వారి యుపమానముల యౌచిత్య మనన్యసామాన్యము.

"అన్నంపురాసులు చిన్నితోమాలెల
లై సన్నజాజులు పోసినట్లు
సన్నఖర్జూరపుఁ జాపలపై నూప
రాసులు గంధమ్ము తీసినట్లు
ఎఱ్ఱదాగుగను వేయించినప్పడములు
పునుగుకుంకుమ కుప్పవోసినట్లు

వంగపండుల పేళ్ళ వరుగుచోష్యవు గుబా
శింపుల త్తరుల నొల్కించినట్లు"

ఆ వంటకముల కుపమాన గౌరవముచే నెంతో యుదాత్తత చేకూరినది. యజ్ఞసంబంధు లగుటచే నవి పవిత్రములు. అందుచేతనే కవిగా రతని శ్రీరంగనాథప్రభువు పవళింపు సేవకై భద్రపఱిచినట్టి సంభారములవలె నున్నవని వర్ణించి శిథిలమైన గౌతము నాశ్రమము

"కడు పరిభ్రష్టమైన యోగంబువోని
యాశ్రమముఁ జూచి రాముని యక్షులందు
బాష్పములు గుత్తులై రామభద్రుముఖము
హరివదలి చన్న వైకుంఠమట్లు దోఁచె."

నిజముగా వైకుంఠ మప్పు డట్లె యుండును. నారాయణుఁడు వైకుంఠమును వదలి రాముఁడై భూమి కవతరించినాఁడు కనుక ఫలపుష్పముల మెట్టపళ్ళిక శిరసున నిడుకొని మెల్లగా రాముని కభిముఖముగా వచ్చుచుండిన శబరి

"తుట్టతుదిదాఁక నెండిన చెట్టుకొమ్మ
శేఖరంబునయందుఁ బుష్పించినట్లు"

గోచరించెను. బక్కచిక్కినమేనితోఁ గూడిన శబరిని ఆమె నెత్తిమీఁది పళ్ళికలోని పచ్చని పుష్పఫలాదులను ఈ యుపమానము పఠితలకు సాక్షాత్కరింపఁ జేయుచున్నది. ఇట్టియుపమానములు రామాయణము నందంతట కుప్పతెప్పలు.

విశ్వనాథవారి పద్యముల యెత్తుగడలో నొకయద్భుత సౌందర్య ముట్టిపడుచుండును. ప్రతిపద్యము నొక క్రొత్తపోకడగాఁ గన్పించును. ఈ శిల్ప మితరుల కందుకో నలవి కానిది. పూర్వమహాకవులందరును పెక్కుకృతులలో ప్రదర్శించిన పద్యరచనాశిల్పము వారియొక్కరి రచనలలో సర్వతోముఖ సాక్షాత్కార మొసంగును. వారి వృత్తౌచిత్య మఖండమైనది. వారు వాడినన్ని వృత్తము లాంధ్రవాఙ్మయమున ఛందశ్శాస్త్రకర్తలు తప్ప మఱెవ్వరును వాడలే దనుకొందును. ఎంత క్రొత్తవృత్తము నైనను నేర్పరియైన సారథిగుఱ్ఱములనువలె సమసుందరముగా నడపింతురు. మఱియు వారివృత్తవైవిధ్యము భావానుగుణముగా నుండును. వెన్నెల వర్ణించునప్పుడు చంద్రకళ' గజగమనమును వర్ణించునప్పుడు గజవిలసితము. మధ్యాక్కరల నాంధ్రమున మున్ను నన్నయ యొక్కఁడె వాడెను. ఎఱ్ఱన తద్రచనయకా గోచరించుటకై మఱికొన్నిటిని వాడెను. విశ్వనాథవారు రామాయణమున నెన్నిటినో వ్రాసిరి. మధ్యాక్కరలలో పదిశతకములే వ్రాసిరి. సాధారణముగా నెవ్వరికిని నడవని వృత్తము మధ్యాక్కర. అది నన్నయకు నడచును శ్రీ సత్యనారాయణగారికి నడచును. వారి సీసపునడకలు

విచిత్రముగా నుండును. వారు చూపని నీనగతి లేదు. అది వారి రచనలో నతి శ్రీనాథమై యొప్పారును.

"మాకందతరు శాఖికా కోకిలాలాప
కౌతూహలాకార కలనఁజేసి"
"ధరణీసుతాపయోధరలగ్న కస్తూరి
కాలేపసంరూషితాసితాంగ"
"ప్రబ్బుకొన్న శరత్తు, మబ్బులేని వియత్తు
బెబ్బులి రవములై పిడుగులొత్తు"
"లంకాదహనకార్య శంకారహితధుర్య
మహితులారా మదోన్మత్తులార"

మున్నగున వందుకు నిదర్శనములు.

కవిసమ్రాట్టులు శిల్పిచక్రవర్తులు. కవితా శిల్పమంతయు వారి క్రీగంట మెలఁగును. వా రూహింపని భావము లేదు. కల్పింపని శిల్పచిత్రము లేదు. రసోచితముగా వాడని పదము లేదు. వారి రామాయణకల్పవృక్ష మాంధ్రసహృయులపాలిటి కల్పవృక్షము.

కావ్యాత్మతాసిద్ధి గన్న వ్యంగ్యమునొంపు
కలయఁజూచెడి కాంక్ష కలుగునేని
పరిణతగేయకావ్యస్థ సౌందర్యంబు
పరికించు నభిలాష పరఁగునేని
గీర్వాణరూపకాపూర్వ శిల్పపుశోభ
తెలుఁగులో నరయంగఁ దలఁతువేని
విద్వన్మనః పద్మవికసనార్కాలోక
ములు విమర్శలు కాంచ వలతువేని

ఓయి తమ్ముఁడ! విశ్వనాథోదరాశి
పూర్ణిమాహిమభానుఁడై పురుషమూర్తి
నవతరించిన వాగ్దేవియైనవాని
సత్యనారాయణుని జేరఁజనఁగదయ్య.



# మహాకవి శ్రీశ్రీ

## డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

ఆంధ్రభారతి క్రొత్తగా మత్స్యాంసరాలను అలంకరించుకొన్న రోజు లవి. ప్రజలభాషలో సన్నగా సంగీతం సాహిత్యంలో వినిపించిన కాల మది. 'దేశమంటే మట్టి కాదోయ్! దేశ మంటే మనుషులోయ్' అన్న గురజాడవారి గొంతుక విని సాహిత్యజగత్తులో మనిషి మేల్కొన్న తరుణ మది. పదేళ్ల ఇరవయ్యోశతాబ్దం బాల్యావస్థను దాటి పదిమందిలో తిరుగనేర్చిన పర్వ మది. భావకవిత్వం ఒక శ్రీకారం చుట్టితే భవిష్యదభ్యుదయం మరో శ్రీకారం జాతకలిపి లిఖించిన చారిత్రక ఘట్ట మది. 'శ్రీవాణి'తో ప్రారంభమైన ప్రాచీనమార్గం శ్రీశ్రీవాణితో మహాప్రస్థానం సాగించటానికి మరోనాందిని పలికించే సూత్రధారుణ్ణి సృష్టించుకొన్న సంధికాల మది. ఆ కాలాని కొక సంకేతం శ్రీరంగం శ్రీనివాసరావుజననం.

ఇరవయ్యోశతాబ్ది పయిలాపచ్చీసుల్లో భావగీతికలు పాడింది. పండు వెన్నెల్లో తిరిగింది; పైరగాలి పైట విసురుకుంటూ అందని అంచులకోసం అర్రులు సాచింది ఎవ రేమనుకున్నా ఆత్మాశ్రయఫణుతుల్లో ప్రణయతత్త్వం పాడుకుంటూ భావాంబర వీథుల్లో విహరించింది. ఫలించని ప్రణయంలో పరితాపం వినిపించింది. 'దుర్భరశోక విషమగీతు లేడ్చివైతు- ఎలుంగెత్తి యేడ్చివైతు'నని రోదనిగర్భం మారుమ్రోగేటట్లు కృష్ణశాస్త్రి కంఠంతో రోదించింది. ఆ కాలమంతా కృష్ణపక్ష ప్రభావంలో మునిగి పోయింది. 'ఎవ్వ రనుకొందురో నన్ను ఏ ననంత- శోకభీకరతిమిరలోకైక పతిని' అని ఆక్రందించింది ప్రకృతినిండా బహుళపంచమిజ్యోత్స్న పొగలాగా క్రమ్ముకొని ఉంది. సౌందర్యారాధనం సన్నని వెన్నెలతీగల్లా సాగినా తీగల వెనుక ఏదోశోకం సముద్రంలా ఘోషిస్తున్నది సాహిత్య జగత్తులో.

ఈ ఘోషాహేషలమధ్య తలయెత్తి చూచాడు శ్రీశ్రీ. సముద్రఘోషలా వినిపించింది హృదయఘోష.

"నా కనారత మానందశోకగతులు
కలుగుచుండును నా కింత తెలియరాదు
నా చరిత్రము నాకె యన్వయము కాదు'

ఆనందశోకాలు జీవితాన్ని ప్రజ్వలింపజేసే సమిధలు. వాటి సంఘర్షణ శ్రీశ్రీ హృదయంలో ప్రతిభాతేజస్సును ప్రభవింప చేసింది. అంతరాత్మ ఆనందంకోసం పరితపిస్తోంది ప్రతిభానేత్రం ప్రకృతిగర్భంలో ఆనందవీచికై అన్వేషించటం ఆరంభించింది. నవనవోన్మేషమైన ఆతని ప్రజ్ఞకు ప్రకృతి నవ్యప్రపంచంగా దర్శన మిచ్చింది.

"దివ్యానందమయ ప్రపంచ మిట మూర్తీభావముం దాల్చి నా
కవ్యాజప్రణయాతిరేకమునఁ దానై స్వాగతం బిచ్చెడున్
నవ్యం బీ ప్రకృతీలలామ మృదుకంఠం బిందు మద్గీతికా
కావ్యస్రజ్నివహంబుఁ గూర్చెద నలంకారప్రభాస్ఫూర్తితోన్"

'ఇది మనోజ్ఞప్రకృతిధామ మిచటఁ జేరి
అమృత పేశలనవమాధురిముఁ గూర్చు
విహగకలకూజిత ధ్వనీ విధములందు
స్వీయకంఠారవము మేళవించుకొందు'

ప్రకృతిగానంలో పారవశ్యాన్ని చెంది పద్యగీతులు పాడడం ప్రారంభించాడు శ్రీశ్రీ.

"మైమరచిపోతి నంత సమస్తభువన
సముదయ మలర్చె నపుడె విస్తారమధుర
గాన నిస్వన కల్లోల కలిత లలిత
భావకవితా వియద్వాహినీ విధాన"

'ప్రకృతికాంతాశరీరసౌరభాకృష్టమధురసంస్పర్శనం'తో పులకించిన కవితాగానం 'ప్రకృతీదేవి ప్రహృష్ట హృత్ప్రపూర్ణానురాగవాహిని'గా ప్రవహించింది. వేగవంతమైన ఆయన వాగ్ధార హృద్యపద్యాలగతుల్లో తురంగలించినా గీతపద్యం ఆయనహృదయ గీతగా లాస్యం చేసింది.

"ఒక అనిర్వచనీయ మహోన్నత మగు
హాయి యున్నది గీతపద్యములయందు !
దరు లొరసి పారు గాంగనిర్ఝరిణి కరణి
చెంగుచెంగున గీతి తురంగలించు"

ఆధునిక ఖండకావ్యప్రక్రియకు ప్రాణప్రదమైన ఛందం గీతపద్య మని ఆయన నిష్కర్ష.

"ఆధునికదివ్యఖండకావ్యములయందుఁ
బ్రాణసన్నిభమై గీతి పరుగులాడు !
విస్తృతవనాంతరోదగ్ర వీథులందుఁ
గ్రేళ్లుఱుకులేడివలె గీతి తుళ్లలాడు"

గీతాన్ని ఊతంగా చేసుకొని ప్రకృతితత్త్వాన్ని భావనామయంగా కీర్తించాడు యువకుడైన శ్రీశ్రీ.

ప్రకృతి పరిణామశీల మైనది. పరిణామంలో పుట్టుక వెంట చావున్నది. మృత్యువులోనుంచి పునర్జన్మ పుట్టుకొస్తున్నది. ఈ చావుపుట్టుకలకు అతీతమైన ఒక స్వేచ్ఛాశక్తి అనంత విశ్వాన్ని ఆవరించిఉంది. దాన్ని అందుకున్నప్పుడే ఆనందాన్వేషణం అక్షర మౌతుంది. అందుకోసం శ్రీ శ్రీ ఆకసంవైపు తలయెత్తి చూచాడు. ఆనందం అంబరంలా కనపడింది. దానిఅంచుల్లో స్వేచ్ఛావిహంగంలా స్వామి సాక్షాత్కరించాడు అందరాని ఆవధుల్తో ఆయన; ఆశలతో అకలిచూపులతో తాను - దివికీ భువికీ వంతెన కట్టాలన్న పరివేదన.

"నీవు నభోవిటంకమున నిర్మలపాండుపయోదమాలికల్
త్రోవ యొసంగ పక్షములు దూయుచు హాయిగ సంచరించు స్వే
చ్ఛావిలసద్విహంగమవు స్వామి ! క్షుధావిల మైన చూడ్కులన్
నీ విహరించు మార్గమున నిల్పి కనుగొనుచుందు నే నిటన్".

పరివేదనంలోని పారవశ్యం శ్రీశ్రీని భావవిహంగంగా మార్చింది. మృత్యువునుండి మహాయానం చేయాలని స్వేచ్ఛామార్గాన్ని స్వీకరించాడు.

"ప్రకృతియాగారమున నశియింపఁబోక
గాలి యొసగెడు క్రొత్తరెక్కలు ధరించి
అతినిరాఘాటముగ విహాయసపథాల
నెఱుకపడరాని యెచటికో ఎగసిపోదు"

నని వైనతేయుడులా వియత్తలానికి లంఘించాడు. మార్గమధ్యంలో మేఘశకలం ఎదురైంది.

"ఈ ప్రకృతిగాఢరహస్య మెఱుఁగలేక
చంచలమనస్కత, బరిభ్రమించు నాకు
విశ్వపథముల నడయాడి వేసరిలుట
యన్నివిధముల భావ్యమే యగును గాని-
ఓ వలాహకశకలమా! నీవు కూడ
నావలెఁ బరిభ్రమించుచున్నా వదేల?'

అని ప్రశ్నించాడు. దానికీ తనకూ భేదం లేదని తెలుసుకున్నాడు. ఈ అనంతవిహాయసయానంలో మృత్యుంజయమైన స్వేచ్ఛను సాధించి అమరత్వాన్ని అన్వేషించే కవికి మృత్యుప్రబోధం వినిపించింది.

"ఓయి మనుజుడ! నీ నిస్సహాయ దీన
హీన దుస్థితి గతుల నూహింప లేక
ననుఁ బ్రతారింప వ్యర్థయత్నము లొనర్చి
నాకనులముందె తిరుగఁచున్నావు గాని
ఎఱుఁగవే నన్ను లోకభీకరమహోగ్ర
ఫణి విషస్ఫీతమృత్యురూపిణిగ నీవు?
నీహృదంతరసదనసంస్థితకరాళ
శిఖిశిఖాచ్ఛట నని గ్రహించెదవా లేదొ?
భీప్రదక్రకచోగ్రదంష్ట్రాప్రభూత
విస్ఫుర త్తేజమున దాండవించు నన్ను
మృత్యుదేవతగా మది నెఱుఁగవేమొ?"

ఆనందాన్వేషికి మృత్యుగర్జనం అమరసందేశంలా వినిపించింది. మానవుడు ప్రపంచంలో అనుభవిస్తున్న నిస్సహాయదీనహీనదుస్థితిగతుల నూహించలేక పలాయనమంత్రం పఠిస్తూ పరమానందాన్వేషణలో పరుగులుతీయటం మహాపరాధంగా తోచింది శ్రీశ్రీకి. ఆయన హృదంతరాళంలో కరాళశిఖిశిఖాచ్ఛట లున్నాయని తెలిసివచ్చింది. అదే కార్చిచ్చులా మండుతున్న లోకశోకానలం. శోకతత్త్వం తెలియందే ఆనందం అనుభూతికి రాదన్న సత్యం స్ఫురించింది, స్వర్గంలో మృత్యువు లేదు. బాధ లేదు. బాధ లేనిచోట బోధలేదు. హాలాహలం చవిచూచిన శివుడికే అమృతంలోని విలువ తెలుసు. జీవిత మొక మహాసంధ్య. ఉదయాస్తమయాల కది ఉజ్జ్వలప్రతీక. చీకటికోరలమధ్య నలిగిన వెలుగుకణాలు వెల్రగక్కే రక్తారుణిమలు సంధ్యాచ్ఛవిలో తాండవిస్తాయి. షోడశకళాప్రపూర్ణుడుగా వెలుగవలసిన చంద్రుడుకూడా కృష్ణపక్షంలో చీకటిగంతలో మునిగిపోతున్నాడు. శోకార్ణవంలా అమవస ఆసన్న మౌతోంది కృష్ణపక్షం చివర ఉన్నాడు శ్రీశ్రీ. వెలుగురేకలకంటె చిమ్మచీకట్లే జగత్తును జయిస్తున్నాయి. ప్రణయగీతం పరాస్తమైపోయింది. ప్రళయగీతం పొటమరించింది.

"ఏ నెరుంగుదు ప్రేయసీ నూత్నయౌవనా
ధీనుడై ప్రియుడు వర్తిలిన వెన్నెలవేళ
తీయనై నాటి సందీప్తి తోచెను గాని
ఈ అమావాస్య హెచ్చునే వరియింతు
నేను దట్టపుమంచుసోనలే కురియింతు'. "

శ్రీశ్రీగళం గద్గదమైంది. శోకవిషణ్ణ మైపోయింది. అన్వేషణం ఆకాశంలో కాదు. అవనీతలంమీదనే అని నిశ్చయించుకున్నాడు. స్వేచ్ఛావిహంగం భూతలానికి దిగింది. చీకట్లో చికీర్ష ప్రారంభమయింది. భూగర్భంలోనుంచి ఏదో నీరవాహ్వానం వినిపిం

చింది- గతచరిత్రకు నిశబ్దవ్యాఖ్యానాన్ని చెప్పే కంకాళసంపుటాలస వ్వడి అది. సుప్తాస్థి కల మూల్గు. శ్రీశ్రీ మేను కంపించింది. మనసు ద్రవించింది.

"అవి ధరాగర్భమున మానవాస్థికా ప
రంపరలు- సుప్తనిశ్శబ్దసంపుటములు
అట నొకే దీర్ఘయామిని: అనిశాశ్మ
శానశయ్యకు ప్రాతః ప్రసక్తి లేదు.
ఆ యగమ్యతమోరహస్యాంగణాన
తాండవించును మృత్యుశైత్యల్య మొకటె-
అది నిశాంత హేమంతహృదంతరంత
రనుభవాళి ఘనీభవించిన సమాధి.
అమనుష్యాస్థికలు నిద్రలో మునింగి
సంచరించును భైరవస్వప్నవీధి ;
అవి చలించును తమ చర్మకవచ మెపుడొ
బ్రదికినదినాల తలపోత బరువుచేత.

నా కనుంగవ కన్నీళులై కరంగు
నవి యొనర్చెడు నీరవాహ్వాన మెరిగి-
ఇంత శోషిల్లు నాలొ నాహృదయపుటము
వణకు నేటికొ నాఅస్థిపంజరమ్ము."

మానవజీవితంలోని అతివాస్తవిక మైన సత్యం కవి మనోనేత్రగోచర మైంది. చరిత్ర కెక్కని సామాన్యజీవితాలెన్నో భూగర్భంలో సుప్తమై పోయాయి వాటిని త్రవ్వి చెప్పకపోతే మానవచరిత్ర సమగ్రం కాదు. కవి అస్థిపంజరంలోని ఎముకలచప్పుడు చరిత్రగర్భంలోని అనాథజీవుల సమాధుల్ని ప్రశ్నించి చూచింది.

"చారిత్రకవిభాతసంధ్యల
మానవకథ వికాస మెట్టిది ?
ఏదేశం ఏకాలంలో
సాధించిన దేపరమార్థం?"

అన్న జిజ్ఞాస మొదలైంది. ఆంధ్రసాహిత్యంలో ప్రప్రథమంగా ప్రపంచమానవుణ్ణిగూర్చి సమాలోచనం తలయెత్తింది: సౌందర్యపిపాస సన్నగిల్లి సంఘర్షణ మొదలైంది. పారవశ్యం పోయి ఆవేశం ఆవహిల్లింది. 'పుడమితల్లికి పురిటినొప్పులు' కొత్త సృష్టిని స్ఫురింపచేస్తున్నాయి. అభ్యుదయపథంలో అడుగులచప్పుడు వినిపిస్తున్నది.

• • • •

'ఇప్పుడు మనం 20వ శతాబ్దంలో ఉన్నాం. ఈ శతాబ్దం నాది. (తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు). నేను 1910లో పుట్టాను.(తోకచుక్కలాగ). మూడు సార్లు మృత్యువుతో పోరాడి గెలిచాను. 1918లో మొదటిగీతం వ్రాశాను. (గణయతి ప్రాసలంటే ఏమిటో తెలియకుండా) 1920లో మొదటినవల (వీరసింహ విజయ సింహులు) రాసిపారేశాను. 1925లో మొదటనవలిక (పరమాణు రహస్యం) అచ్చయింది. 1928 లో మొదటి ఖండకావ్యసంపుటి (ప్రభవ)... అచ్చు వేయించాను. 1930లో నేను 63 రోజులు టైఫాయిడ్ జ్వరంతో బాధపడ్డాను. జీవితం మృత్యువుతో ఎలా పోరాడుతుందో స్వయంగా తెలుసుకున్నాను... 1930 దాకా తెలుగు సాహిత్యం నన్ను నడిపించింది ఆ తర్వాతనుంచీ దాన్ని నేను నడిపిస్తున్నాను. అప్పటి నుంచీ తెలుగుసాహిత్యచరిత్ర శ్రీశ్రీ స్వీయచరిత్ర"-ఇవి శ్రీశ్రీ 'మహతి'కి చెప్పినమాటలు.

శ్రీశ్రీ జీవితంలో 1930 ఒక పెద్దమలుపు. ఒక మహానాటకానికి పూర్వరంగంలా ఆయన ఇరవైయేళ్ళజీవితం కనపడుతుంది. ఒకమహాగ్ని ప్రజ్వరిల్లాటానికి ముందు విస్ఫులింగాలు ప్రస్ఫుటమయినట్లు ప్రభవలో ప్రకటింపబడిన కవిత ప్రత్యక్షమౌతుంది. ప్రభవలోని పద్యాలు భావకవిత్వప్రభావంతో వెలువడినవే. అందులో కూడా ప్రణయభావంకంటె ప్రకృతివర్ణనం ఎక్కువ. చూచిన ప్రతివస్తువులో తాదాత్మ్యంచెంది ఆత్మాశ్రయంగా అనుభూతిని వ్యక్తంచేశాడు ఆ కవితలో. పుట్టుకతోనే వచ్చిన కవితావాసన అక్షరాభ్యాసంతో ఆకృతి తాల్చింది. ఛందఃపరిజ్ఞానంతో ప్రస్ఫుటమైంది. ప్రాచీనకవిత్వమహత్వమంతా అప్రయత్నంగా అవగతమైంది. తిక్కన్నతెలుగుదనంమీద మోజు, శ్రీనాథుని ప్రౌఢిమమీద అభిమానం, రామకృష్ణుని పదగుంభనంమీద భ్రాంతి, గురజాడ ముత్యాలసరాలమీద మోజు, కృష్ణశాస్త్రి సమ్మోహనశక్తిమీద సాదరం, విశ్వనాథ సమాసఘటనంమీద సహభావం- ఇలా ఎన్నో అభిరుచులు ఆయనమీద పనిచేశాయి. పసితనంలోనే కన్నతల్లిని కోల్పోయి, పెంపుడు తల్లిలో వాత్సల్యాన్ని చవిచూచిన శ్రీశ్రీ ప్రణయంకంటె ప్రకృతిలో వాత్సల్యాన్నే చూశాడు. పెంపుడుతల్లి కరువైపోతే పెనుశోకం ముంచుకొచ్చింది. కరుణవాత్సల్యాలలో ప్రణయబీజాలు మొలకెత్తలేదు. అందువల్ల భావకవుల్లో కూడా ఆయన కొక ప్రత్యేకస్థానం ఏర్పడింది. ఉదయసంధ్యను చూచి ఉద్విగ్నతను ప్రకటించాడు. సాయంసంధ్యను చూచి సాధ్వసాన్ని ప్రదర్శించాడు. రజనీగానంలో గొంతుకలిపి పాడాడు. మేఘశకలాన్ని చూచి మనసు కలబోసుకొన్నాడు. ప్రకృతిని కాంతగా కంటె మాతగా ఆరాధించాడు అతని ప్రణయం పరమేశ్వరార్పితం. పరమేశ్వరునిలో కనపడింది విలయతాండవం చేసే కల్లోలమూర్తి. ప్రభవానంతరకవిత్వంలో కవి అంతర్ముఖమైన ప్రతిభ సమాధిని సాధించింది. ప్రభవలో కనవచ్చే పదాడంబరం శిల్పసంభరితం కాజొచ్చింది. మధుమూర్తి నొకవైపు కీర్తిస్తూనే మహాంధకారంలోని లోతులు దర్శించటం జరిగింది. స్వేచ్ఛావిహంగం వర్తమానాన్ని అధిగమించి భావిదృష్టి సారించింది. అతనిలో సంఘర్షణ అగ్నిహోత్రంగా ప్రజ్వలించింది.

"ఏ పరాత్పరమూర్తి సదాపవిత్ర
నాట్య లీలానుకూల నిశ్వాసములను
నెరపుచున్నాడొ ఆ హరునిటలమందు
దాగి యడగిన అగ్నిహోత్రమును నేను"

అని ఫాలాక్షునిప్రళయాగ్నిగా ప్రత్యేకప్రతిపత్తిని సాధించింది శ్రీశ్రీ కవిత. అనుకరణశీలం ఆహుతి అయిపోయింది. సొంతవెలుగు వేడిగా పైకురికింది. ఆ వెలుగులో భూతలంలో ప్రవాసం చేస్తున్న స్వర్గదేవతలు కనపడ్డారు.

"దేవతలు విచిత్రాకృతుల్ తీసికొనిరి
పల్లెటూళ్ళలో సూకరసాలకులుగ;
కాని వారల మురికిమొగాల యందె
దివ్యతారకాస్నిగ్ధదీధితులు మెరయు"

'స్వర్గదేవత' అనే ఖండకావ్యసంపుటిలో శ్రీశ్రీ సమాజంలో అట్టడుగున అణగారిపోయిన అనాథజీవితాల సంస్కరణం వినపడుతుంది; సంప్రదాయంగా వస్తున్న సమ్రాట్టుల కీర్తనానికి స్వస్తి చెప్పబడింది. సమసమాజస్పృహతో గతంమీద తిరుగుబాటు ధోరణి తలయెత్తింది. శ్రీశ్రీకి వచ్చిన టైఫాయిడ్ జ్వరం ఎంత భౌతికమైనా సాహిత్యపరంగా అదియొక ప్రతీక. మృత్యువుతో పోరాడి ఆయనఅస్థికలు పునర్జన్మను సాధించాయి. అప్పటినుంచీ ఆయన కవితాప్రపంచం మరోప్రపంచం. ఆయన మహాగ్నిజ్వాల.

ఆజ్వాలను రగిల్చిన మిత్రు లెందరో ఉన్నారు. కాళూరి నరసింహారావు ఇంధనాలు తెచ్చిపెట్టాడు 1926లో తలయెత్తిన సవ్యకవితాసమితి అగ్నిస్థాపనం చేసింది. పురిపండా అప్పలస్వామీ, వడ్డాది సీతారామాంజనేయులూ, అబ్బూరి రామకృష్ణారావు ఇంధనాలు సరిచేసి నిప్పును రాజబెట్టారు. కొంపెల్ల జనార్దనరావు ఆ అగ్నిలో మహాశక్తిని ఆవాహనం చేశాడు. శ్రీశ్రీ ప్రపంచాగ్నిగా ప్రజ్వరిల్లాడు. ఈ పరిణామంలో శ్రీశ్రీ కవితలో వినబడ్డ చిటపటలు ఆయన భావవిప్లవానికి ప్రతిధ్వనులు,

♦ ♦ ♦ ♦

"నేనుసైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను.
నేనుసైతం
విశ్వవృష్టికి
అశ్రు వొక్కటి ధారపోశాను;
నేనుసైతం
భువనఘోషకు
వెర్రిగొంతుక విచ్చి మ్రోశాను;"

శ్రీశ్రీ సొంతగొంతుక జయభేరి ప్రయోగించిన మొదటిగేయ మిది. ఇందులో మొదట గమనింపదగింది ఆయన ఇంటిని గెలిచి రచ్చ కెక్కటం. ఇల్లంటే సాహిత్యం. గ్రాంథికభాషావాదం అక్షరచ్ఛందం ఆంధ్రసాహిత్యంలో సామ్రాజ్యం చేస్తున్నవి. వాటిబంధాలు తెంచుకోవటం మొదటిమెట్టు కాల్పనికజగత్తులో కలలు కంటూ వాస్తవికజగత్తును చూడలేని మత్తుమందు ప్రభావంనుండి పైకిరావటం రెండోమెట్టు. విశ్వం నుండి విడదీయలేని సామాజికచైతన్యంలో తానొక భాగంగా గుర్తించుకోవడం మూడో మెట్టు. మూడు మెట్లెక్కి చూచిన శ్రీశ్రీకి ప్రపంచం ఒక మహాగ్నికుండంగా గోచరమైంది.

జాతీయఅంతర్జాతీయరంగాలలో మహాయుద్ధజ్వాలలు నాలుకలు సాచి విశ్వాన్ని భస్మంచేసే ప్రయత్నాలు చేస్తున్నవి. ఆర్థికమాద్యంతో ఆకలిమంటలుచ్చ రెచ్చి అఖిల జనావళి ఆర్తనాదం చేస్తోంది. జర్మనీలో నాజిజం ప్రపంచాన్ని పాశవికంగా కబళించాలని చూస్తోంది. వలసరాజ్యాల్లో సామ్రాజ్యవాదం ప్రజాశక్తిని పీడిస్తోంది. భారతదేశంలో సామ్రాజ్యశక్తులతో స్వాతంత్ర్య సమరం మొదలైంది. పారిశ్రామిక రంగంలో పెట్టుబడిదారులు కార్మికశక్తిని స్వలాభంకోసం పణం పెడుతున్నారు. కష్టించినవాడికి కడుపు నిండటం లేదు. స్వేచ్ఛాజీవిని శృంఖలాలు బంధిస్తున్నాయి. పదిమందిచేతుల్లో అధికారం ఆదాయం సమీకరింపబడుతోంది. దారిద్ర్యం ధరిత్రినిండా తాండవిస్తోంది. దమననీతి యుద్ధపిపాసతో స్వేచ్ఛను దగ్ధంచేస్తోంది. ప్రపంచంలోని ప్రజాశక్తులీ సత్యాన్ని గుర్తించి విప్లవానికి వ్యూహాన్ని పన్నుతున్నాయి. రష్యాచైనాల్లో విప్లవచైతన్యం విజృంభించింది భారతనాయకుల కది యొక క్రొత్త కను విప్పైంది. నాజీఫాసిస్టు సైన్యాన్ని రష్యా, జపాన్ సామ్రాజ్యవిస్తరణాన్ని చైనా ప్రతిఘటించాయి బ్రిటీష్ దమననీతికి జాతీయోద్యమం విశ్లథమై పోతోంది. ప్రపంచ కార్మికులు ఉద్యమించారు. దేశంలో దాని ప్రతిధ్వని వినిపించింది. ప్రపంచమంతా భయం, ఆగ్రహం, అలజడి, ఆందోళన, సమ్మెలు, సమరాలు - ఏదో ఒకమహాగ్ని ప్రజాచైతన్యంలో ప్రజ్వలిస్తున్న భీకరనాదాలు, వీరావేశాలు- ఇవన్నీ శ్రీశ్రీ చెవులలో రింగుమన్నాయి. ఆ ప్రపంచమహాగ్నికి తానూ ఒక సమిధ నిస్తా నంటున్నాడు శ్రీశ్రీ ప్రతీపశక్తుల మారణహోమానికి బలియైపోతున్న ప్రపంచసమాజంలో విషాదమేఘాలు క్రమ్ముకున్నాయి. అనంతశోకం జడివానగా కురుస్తోంది. ఆ వృష్టికి అశ్రు వొక్కటి ధారపోశాడు శ్రీశ్రీ. విశ్వశోకం విలయఘోషగా వినిపిస్తోంది. ఆ ఘోషలో తన గొంతును వీరావేశంతో శ్రుతికలిపి పాడాడు. విశ్వఘోష వ్యక్తి నాశ్రయించి తెలుగునోట తొలిసారిగా క్రొత్తగతిలో వినిపించింది. ఇది ఒక క్రొత్తకేక.

శ్రీశ్రీ ఈ గీతంలో ప్రదర్శించింది సామాజికదృక్పథం. దీన్ని జాతీయస్థాయి నుండి అంతర్జాతీయస్థాయికి తీసుకువెళ్లిన కవినాయకు డాయనే. జాతిని ముందుకు నడిపించేవాడు నాయకుడు. దానికి ప్రబోధం కావాలి. అది సమరసందేశంగా విని

పించాలి. సమాజాన్ని సైనికసంఘంలా సమాయత్తం చేయాలి. మాటల్లో మహోత్సాహం, గతిలో మార్చింగ్‌బాండ్ వినిపించాలి. గతితోపాటు గమ్యం చూపించాలి గర్జిస్తూ గమ్యాన్ని ఘోషించాలి. ప్రతిపదంలో ప్రగతిశీలం ప్రతిధ్వనించాలి. సమాజ చైతన్యాన్ని సంఘటితం చేసే శబ్దశక్తిని సమీకరించాలి. ఈ లక్ష్యంతో శ్రీశ్రీ మరో ప్రపంచాన్ని చూపిస్తూ నాయక గీతాన్ని పాడాడు. విజయభేరితో పాటు వీరగానం వినిపిస్తుం దాగొంతులో—

'మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది ;
పదండి ముందుకు
పదండి త్రోసుకు
పోదాం పోదాం పైపైకి.

కదం త్రొక్కుతూ
పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ-
పదండి పోదాం
వినబడలేదా
మరోప్రపంచపు జలపాతం !

దారిపొడుగునా గుండెనెత్తురులు
తర్పణ చేస్తూ పదండి ముందుకు...
ఎముకలు క్రుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి !
నెత్తురు మండే
శక్తులు నిండే
సైనికులారా రారండి !
హరోం హరోం హర
హర ! హర ! హర ! హర !
హరోం హరా ! అని కదలండి !
మరో ప్రపంచం
మరో ప్రపంచం
ధరిత్రినిండా నిండింది.

పదండి ముందుకు
పదండి త్రోసుకు
ప్రభంజనంవలె హోరెత్తండి!
భావవేగమున ప్రసరించండి !
వర్షుకాభ్రముల ప్రళయ ఘోషవలె
పెళపెళ పెళపెళ విరుచుకు పడండి!...

త్రాచులవలెనూ
రేచుల వలెనూ
ధనంజయునిలా సాగండి!
కనబడలేదా మరో ప్రపంచపు
అగ్నికిరీటపు ధగధగలు
ఎర్రబావుటా నిగనిగలు
హోమజ్వాలల భుగభుగలు !

ఇది నిద్ర మేల్కొల్పే వైతాళిక గీతి కాదు- మేల్కొన్న జాతిని ముందుకు నడిపించే సమరగీతి. ఈ పాటలో జీవమంతా గతిలో ఉంది. మూడడుగులు ముందుకు వేస్తూ మరో పదడుగులు కలుపుకుంటూ పుంఖాను పుంఖంగా పదవిక్రాంతి కనబడుతుం దీగేయంలో. శబ్దం ముందు. అర్థం వెనుక. ప్రాసల్లో పాదాలకు ప్రాణ ముంది. 'మరో' అన్నప్పుడు భాసించే ఉత్ప్లుతిలో అడుగు లేచినట్లు వినపడుతుంది. 'ప్రపంచం'-గురువులైన రెండడుగులు వేసినట్లు కనబడుతుంది. అప్పటికి కుడియెడమల పాదకదనం పూర్తౌతుంది. 'పదండి' అన్న జగణప్లుతి-గతిలోని ఉన్మత్తీకరణాన్ని సూచిస్తుంది. అంత్యప్రాసలూ అంతఃప్రాసలూ అంతర్లయను పోషిస్తాయి. పద్యక్షరమైత్రి పల్లవిలాంటి పాదాల్లోనే పాటింపబడడంవల్ల పరంపర భావం ప్రవాహతుల్యంగా ధ్వనిస్తుంది. పాదాల పునరావృత్తి భావావేశాన్ని ప్రకోపిస్తూ క్రియాంతంగా పాదం ముగిసినప్పుడు క్రియాశీలాన్ని వ్యంజింపజేస్తుంది. 'హరోం! హరోం! హర! హర! హర! హర! హర! హరోం! హరా అని కదలండి' అనప్పుడు అనర్గళమైన గతివిన్యాసం చెవులకు వినిపిస్తుంది. 'ప్రభంజనంవలె నన్నప్పుడు హోరూ, 'పెళపెళ పెళపెళ' అన్నప్పుడు విరుచుకపడే శబ్దం, 'ఉరకండి!' అన్నప్పుడు పరుగూ అనుభూతి కందుతుంది.

ఈ ప్రచండగతివేగంలో సోమరితనానికి తావు లేదు. అడుగు వెనక్కు పడితే నలిగి చావ్వలిసిందే. ఎముకలు కుళ్లిన రోగులూ, వయసుమళ్లిన వృద్ధులూ ఈ సైనిక వాహినిలో నిలువలేరు. వృద్ధులకు శాపంలా వినపడ్డా గేయగతి వాళ్ళకూ నూత్నయౌవ్వనాన్ని యిస్తుంది. శబ్దం భావావేశాన్ని కల్పించే రచనాశిల్పం పుష్కలంగా సంతరించుకొన్న సమర గీత మిది. అయినా ఇందులో అర్థానికి అంగబలం ఉంది. దాని

ఊపిరి ఉపమానాల్లో ఉంది; రూపం రూపకాల్లో ఉంది. 'ప్రభంజనంవలె' 'వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె' 'త్రాచులవలెనూ' 'రేచులవలెనూ' 'ధనంజయునిలా' అన్నప్పుడు యుద్ధసైనికుల విజయయాత్రలో కానవచ్చే అవస్థాంతరాలు ఆకృతి కడతాయి. ఉపమానంకంటె రూపకం భావనామయమైంది. 'హృదంతరాళం గర్జిస్తూ' అన్నప్పుడు 'హృదయాన్ని బెబ్బులిగా భావించాలి' 'నెత్తురు మండే' అన్నప్పుడు వర్ణసామ్యంచేత నెత్తురును మంటలా ఊహించాలి. అలంకారాలకు మించినవి ప్రతీకలు. ఇవి రసవద్గుళికలు. 'అగ్నికిరీటం' 'ఎర్రబావుటా' 'హోమజ్వాల'-ఇవి మరోప్రపంచాన్ని గుర్తించే చిహ్నాలు. గమ్యాన్ని చూపించి శ్రీశ్రీ గేయాన్ని ముగించాడు, గీతానికి మహాప్రస్థానమని పేరు పెట్టాడు. అంతకంటె ధ్వనిమంతమైన శిల్పం మరొకటి లేదు.

ఈకవిత కవితకోసమే వ్రాసింది కాదు సామాజికప్రయోజనంకోసం ఉద్దేశింపబడింది. ఉపరంజకత్వంతో పాటు ఉపదేశం కావ్యానికుండాలని ప్రాచీనులూ చెప్పారు. వారి లక్ష్యం పురుషార్థ చతుష్టయపరిజ్ఞానం కలిగించటం. పరమార్థంగా మోక్షాన్ని నిర్దేశించటం. శ్రీశ్రీ లక్షించిన అభ్యుదయ మార్గంలో సంప్రదాయబద్ధమైన ఆముష్మికచింత లేదు. ఆముష్మికదృష్టిలో జగం మిథ్య. మోక్షం నిత్యం. ఈమిథ్యావాదాన్ని అభ్యుదయవాది అంగీకరింపడు. ఆర్థిక అసమానత్వంతో వర్గసంఘర్షణంతో కళ్లయెదుట కనపడే వాస్తవజగత్తు సత్య మంటాడు సమసమాజ భావనం జగత్కల్యాణ మంటాడు:

'జమీందారు రోల్సుకారు
మాయంటావూ? బాబూ
ఏమంటావు?
'మరఫిరంగి! విషవాయువు
మాయంటావూ? ఏం
ఏమంటావు?
'పాలికాపు నుదుటిచెమట
కూలివాని గుండెచెరువు,
బిచ్చగాని కడుపు కరువు
మాయంటావూ?
తుఫానులూ, భూకంపం
తిరుగుబాట్లు, సంగ్రామం
సంగ్రామం, సంగ్రామం
మాయంటావూ? ఏయ్
ఏమంటావు?'

అని మిథ్యావాదిని కవ్వించి అడుగుతాడు శ్రీశ్రీ.

ఒక క్రొత్తమతాన్నిగానీ సాంఘీక సిద్ధాంతాన్నిగానీ సమాజానికి బోధించాలంటే, దాని మనసునూ, మెదడునూ క్రమంగా జయించాలి. మనసుకు కావలసింది ఆవేశం, మెదడుకు కావలసింది ఆలోచన. శ్రీశ్రీ తన అభ్యుదయభావాన్ని ఆవేశంతో 'మహా ప్రస్థాన' గేయంలో ప్రతిపాదించాడు. అది అందరినీ ఆకర్షించింది. వీరావేశం ఆయన కవితకు ఆలంబన మైంది. శబ్దం అర్థాన్ని మించి సప్రయోజనంగా ఆయన రచనల్ని శాసించింది. ఆవేశానికి వెన్నెముకగా ఆలోచన నిలవాలి. లేకపోతే సిద్ధాంతం కల కాలం నిలపడలేదు; మేధావివర్గం మెప్పుకోలు పొందలేదు. పాల్కురికి సోమనాథుడు కూడా వీరశైవప్రచారంలో ఇదేపద్ధతి అనుసరించాడు. బసవపురాణం భక్త్యావేశ ప్రధాన మైంది. పండితారాధ్యచరిత్ర శైవతత్త్వసమాలోచనం లాంటిది. శ్రీశ్రీ ఆధునిక యుగంలో పాల్కురికిలాంటి వాడు. మహాప్రస్థానం సామాన్యుల మనోలోకాన్ని ఉద్దే శించి వ్రాసిం దయితే- ఆయన 'దేశచరిత్రలు'- బౌద్ధికలోకా న్నుద్దేశించి వ్రాసింది. ఈరెండూ ఆయన మహాప్రస్థానికి రెండంచులు. ఆ అంచుల మధ్య ఎన్నో భావశబలా లైన గీతా లున్నాయి.

'దేశచరిత్రలు' రచనం మార్క్సిస్టు దృక్పథానికి కవితారూపకల్పనం. రష్యాలో ప్రజావిప్లవాన్ని తెచ్చిన కమ్యూనిస్టుపార్టీకి కార్ల్‌మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్ మూల పురుషులు. వారు చరిత్రను గతితార్కిక భౌతికవాద దృక్పథంతో దర్శించారు. డార్విన్ పరిణామసిద్ధాంతం హెగెల్ భావవాదాల పరిణామం వారి సిద్ధాంతం. "ప్రతి చారిత్రకశకంలోనూ ఆర్థికఉత్పత్తి విధానమూ, దానినుండి విధిగా ఉత్పన్నమయ్యే సామాజికవ్యవస్థా కలిసి ఆ శకంయొక్క రాజకీయచరిత్రకూ, బౌద్ధిక (intellectual) చరిత్రకూ పునాదిగా వుంటాయి. అనీ, తత్ఫలితంగా (భూమిమీద ఆదిమసమ సమాజం విచ్ఛిన్నమైనప్పటినుండి) చరిత్రఅంతా వర్గపోరాటాల చరిత్ర, దోపిడిదార్లకూ దోపిడీ చేయబడ్డవాళ్ళకూ జరిగే పోరాటాలచరిత్ర, భిన్నసామాజిక అభివృద్ధి దశ లలోవున్న పాలిత పాలకవర్గాలమధ్య జరిగే పోరాటాలచరిత్ర అనీ; కానీఅణగద్రొక్క బడిన పీడితవర్గం (కార్మికవర్గం) తన్ను అణగద్రొక్కి పీడించే (బూర్జువా)వర్గంనుండి విముక్తి పొందడం అనేది మొత్తం సమాజ మంతటినీ దోపిడీనుండీ పీడననుండీ. వర్గ పోరాటాలనుండీ శాశ్వతంగా విముక్తి చేస్తే తప్ప సాధ్యంకాని దశకు వర్గపోరాటాల చరిత్ర యీనాడు చేరిందనీ" కమ్యూనిష్టుపార్టీప్రణాళిక చెపుతుంది. ఈ మూలభావం మార్క్స్ ప్రతిపాదించిందే నని ఫ్రెడరిక్ ఎంగెల్స్ 1883 నాటి జర్మన్‌కూర్పునకు వ్రాసిన ముందుమాటలో పేర్కొన్నాడు. (ఆంధ్రానువాదం)

మార్క్సిస్టుదృక్పథంలో సామాజికపరివర్తనానికి మూలహేతు వైనది విరుద్ధ శక్తులమధ్య అనవరతంసాగే సంఘర్షణ. విరుద్ధశక్తు లుండటం ప్రకృతిధర్మం. ఒక వ్యవస్థలో ఉన్న పాలకపీడితవర్గాలమధ్య ఏర్పడే సంఘర్షణంవల్ల క్రొత్తవ్యవస్థ పుడు తుంది. అప్పటి కదే గుణం. కాని ఆవ్యవస్థలోకూడా వర్గకలహం రావటం సహజ

పరిణామం. పీడితవర్గాలవిప్లవంవల్ల మరలా నూత్నవ్యవస్థ ఏర్పడుతుంది. ఇలాఏర్పడ్డవే వలసరాజ్యవిధానం, జమీందారీవిధానం, పెట్టుబడిదారీవిధానం. ఇప్పుడు పెట్టుబడిదారీ విధానాన్ని కార్మికవ్యవస్థ కూలద్రొయ్యాలని చూస్తున్నది. రాజ్యాలమధ్యజరిగినయుద్ధాలకూ, రాజులరణపిపాసకూ, జమీందారుల ధనపిపాసకూ, పెట్టుబడిదారుల లాభకాంక్షకూ. కార్మికులసమసమాజ స్థాపనోద్యమానికీ- చరిత్రలో సమన్వయసూత్రంగా నిలిచేది గతితార్కికభౌతికవాదమే. సమసమాజవ్యవస్థలో పాలక పాలితవర్గా లుండవా అన్నది తరువాతి ప్రశ్న. దానికి సమాధానంగా కమ్యూనిష్టుపార్టీ మానిఫెస్టో ఇలా పేర్కొంటుంది- అసలు రాజకీయ అధికార మనేది, సరైనఅర్థంలో, ఒకవర్గంలో పీడించటానికి మరొకవర్గం ఉపయోగించే సంఘటితశక్తి మాత్రమే. కార్మికవర్గం, బూర్జువావర్గంతో తాను పోరాటం చేసేకాలంలో, పరిస్థితుల ప్రాబల్యంవల్ల తానే ఒక వర్గంగా సంఘటితం కావలసివస్తే విప్లవంద్వారా తానే పాలకవర్గస్థానం అధిష్ఠిస్తే,తన్మూలంగా పాతఉత్పత్తి విధానాన్ని బలవంతంగా వూడ్చి పారవేస్తే, అప్పుడు ఆ విధానంతో పాటు మొత్తం వర్గాలూ వర్గవిభేదాలూ బతకడానికి అవసరమైన పరిస్థితులనుకూడా వూడ్చి పారవేసి వుంటుంది. తన్మూలంగా తనవర్గాధిపత్యాన్నే రద్దుచేసుకొని వుంటుంది. వర్గాలూ, వర్గవిభేధాలూ గల పాతబూర్జువా సమాజానికి బదులు మన కొక నూతన సదస్సు లభిస్తుంది, ప్రతిఒక్కడూ స్వేచ్ఛగా అభివృద్ధి చెందినప్పుడే అందరూస్వేచ్ఛగా అభివృద్ధి చెందగల సదస్సు అది. (ఏ ఒక్కడు స్వేచ్ఛగా అభివృద్ధి చెందకపోయినా, ఆమేరకు ఇతరు లందరి స్వేచ్ఛాభివృద్ధీ కుంటుపడుతుం దని అర్థం. ఒకకుటుంబంలో ఒకడు శారీరకంగా గానీ, మానసికంగాగానీ జబ్బు పడితే, యితరులందరి సుఖశాంతులూ దెబ్బతిన్నట్లు)" (రెండవప్రకరణంచివరిభాగం- ఆంధ్రానువాదం)

శ్రీశ్రీ 'మరోప్రపంచం'లో సూచించింది మార్క్సిజం వ్యవస్థలో ఉన్న మానవ సమాజాన్నే. ఈ క్రింద వినిపిస్తుంది దాని ఆలోచనా విధానం.

'ఏ దేశచరిత్ర చూచినా - ఏమున్నది గర్వకారణం ?
నరజాతి చరిత్ర సమస్తం - పరపీడనపరాయణత్వం.

వర్గకలహం చరిత్రగతికి మూలకారణ మని తాత్పర్యం.

'బలవంతులు దుర్బలజాతిని - బానిసలను కావించారు
నరహంతలు ధరాధిపతులై - చరిత్రమున ప్రసిద్ధి కెక్కిరి.'

రాజరికాలనూ, వలసరాజ్యవిధానాన్ని గర్హిస్తూ 'జెంఘిజ్‌ఖాన్, తామర్లేనూ, నాదర్షా ఘజ్నీ. ఘోరీ, సికిందరూ ఎవడైతేనేం ఒక్కొక్కడూ మహాహంతకు' డని వ్యాఖ్యానిస్తాడు శ్రీశ్రీ.

'పరస్పరం సంఘర్షించిన - శక్తులతో చరిత్ర పుట్టెను'

అని గతితార్కికభౌతికవాదసారాన్ని సూత్రప్రాయంగా సంధించాడు.

'ఏ యుద్ధం ఎందుకు జరిగెనో - ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో
తారీఖులు దస్తావేజులు - ఇవి కావోయ్ చరిత్ర కర్థం'
ఈ రాణీ ప్రేమపురాణం - ఆ ముట్టడి కైన ఖర్చులూ
మతలబులూ కైఫీయతులూ - ఇవి కావోయ్ చరిత్రసారం'
ఇతిహాసపు చీకటికోణం - అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావా లిప్పుడు - దాచేస్తే దాగనిసత్యం.
నైలునదీనాగరికతలో - సామాన్యుని జీవన మెట్టిది?
తాజ్ మహల్ నిర్మాణానికి - రా ళ్లెత్తిన కూలీ లెవ్వరు?
సామ్రాజ్యపు దండయాత్రలో - సామాన్యుల సాహస మెట్టిది?
ప్రభు వెక్కిన పల్లకి కాదోయ్ - అది మోసిన బోయీ లెవ్వరు?

వీళ్లగాథలను తీర్చిదిద్దిందే నిజమైన చరిత్ర అంటాడు శ్రీశ్రీ. సామ్యవాదసిద్ధాంతం సామవేదంలా వినిపించింది శ్రీశ్రీ మహాప్రస్థానంలో.

మార్క్సిస్టు సిద్ధాంతాన్ని నమ్మినా శ్రీశ్రీ మహాకవి. రమణీయార్థ ప్రతిపాదక శబ్దం ఆయనకావ్యం ఆయన శబ్దశక్తిసారాన్ని ఆపోశనం పట్టిన అగస్త్యుడు. శబ్దంచేత ఆకృతులు నిర్మింపకలడు. అర్థంచేత చిత్రాలను గీయగలడు. శబ్దంమీద ఎంతశక్తి ఉందో రసంమీద అంత అనురక్తి ఉంది. వస్తు వేదైనా ఆవిష్కరణంలో అనుభూతికి అగ్రతాంబూల మిస్తాడు.

'ఉండాలోయ్ కవితావేశం
కానీవోయ్ రసనిర్దేశం
దొరకదటోయ్ శోభాలేశం
కళ్లంటూ ఉంటే చూసి
వాక్కుంటే వ్రాసీ-
ప్రపంచ మొక పద్మవ్యూహం!
కవిత్వ మొక తీరని దాహం!

ఆవేశం లేనిది వస్తువు కవితామయం కాదు ఆవేశం అనుభూతి లేనిదే రాదు. అనుభూతి నావిష్కరించటానికి ప్రతిభ కావాలి. అపూర్వవస్తునిర్మాణక్షమమై నవనవోన్మేషంగా ప్రతిభ ప్రకాశించాలి. అప్పుడే శోభాలేశం దొరుకుతుంధి ప్రతిభ వ్యుత్పత్తితో కూడుకున్న వాక్కులో పుష్టిమంతంగా ప్రతిబింబిస్తుంది కవి దర్శనానికి ప్రపంచమే ప్రాతిపదిక. ప్రపంచానుభవం రసానుభవంగా మారి భావనామయంగా కవితారూపంలో జాలువారుతుంది. అందుకనే ఏబర్ క్రోంబే 'The poet first derives inspiration from the world by the power of imagination, the art of Poetry then imitates the imaginative ins-

piration in language' - అని అంటాడు. ఎంత తోడినా తరుగని ఊట లాంటిది కవిత్వం. ఎంత త్రావినా తీరని దాహం లాంటిది కవిత్వం. ఈ మాట కవికీ వర్తిస్తుంది. సహృదయుడికీ వర్తిస్తుంది. కవితానిర్వచనాన్ని అనుభవైక వేద్యంగా చెప్పిన మహాకవుల్లో శ్రీశ్రీ ఒకడు. ఆయన రసవాది కావటం దానికి కారణం.

కవితకు ప్రాణమైన రస మున్న తరువాత దానిరూపం ఎలా ఉన్నా ఫరవా లేదు. రూపం ఎన్నుకున్న వస్తువునుబట్టి, చెప్పదలచుకున్న భావాన్ని బట్టి యేర్పడు తుంది. బహిరాకృతి భిన్నం కావచ్చు ఆంతరమైన చైతన్యం మాత్రం అనుభూతి. శ్రీశ్రీ తనకవితాస్వరూపాన్ని చెప్పుకున్న కావ్యఖండిక లున్నాయి. వాదాన్ని చెపు తున్నా హృదయసంవాదాన్ని కల్పిస్తాడు కవితలో. ఆత్మాశ్రయంగా చెప్పినా కవితా వేశంతో విశ్వజనీనత్వాన్ని ప్రసాదిస్తాడు ప్రకటనలో.

'సిందూరం రక్తచందనం
బంధూకం, సంధ్యారాగం
పులిచంపిన లేడినెత్తురూ
ఎగరేసిన ఎర్రనిజెండా
రుద్రాలిక నయనజ్వాలిక
కలకత్తా కాళికనాలిక
కావాలోయ్ నవకవనానికి'

చెపుతున్నది లక్షణసూత్రం. కాని అది వాచ్యం కాదు. ఎర్రదనం కావాలని తాత్పర్యం. తాను నమ్మిన సాంఘికసూత్రంలోని సూక్ష్మవిశేషాలన్నీ చెప్పటం శిల్పం. వాటిని వ్యంగ్యసుందరంగా చెప్పటం మహాకవి లక్షణం. సిందూరం కార్యదీక్షకూ, రక్త చందనం త్యాగానికీ, బంధూకం విప్లవానికీ, సంధ్యారాగం సంఘర్షణకూ, పులిచంపిన లేడినెత్తురు ధనికవర్గపు దౌర్జన్యానికీ, ఎగరేసిన ఎర్రనిజెండా కార్మికఉద్యమానికీ, రుద్రాలిక నయనజ్వాలిక కలకత్తా కాళికనాలిక సామ్రాజ్యవాదుల రక్తదాహానికి ప్రతీక లుగా నిలుస్తాయి. రమణీయవ్యంగ్యార్థాన్ని అందిస్తాయి. అందుకే ప్రాసక్రీడల్లో అంటాడు శ్రీశ్రీ- 'సాహిత్యసభాంగణాన వ్యంగ్యానిది మొదటిపద్దు'.

"కదిలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ
మునుముందుకు సాగించేదీ
పెనునిద్దుర వదిలించేదీ
పరిపూర్ణపుబ్రతు కిచ్చేదీ-
కావాలోయ్ నవకవనానికి"

వ్యంగ్యం రసానుభూతి నందిస్తుంది. కవిలో కదిలే భావానుభూతులు సహృదయుడిలో అనుస్పందిస్తాయి. రసానుగుణంగా కవివాక్కు నిత్యనూతనత్వం భజిస్తుంది. రాగ మాధురి వినిపిస్తుంది. అభ్యుదయాన్ని ప్రబోధిస్తుంది. జాతిలో నూతనోత్తేజాన్ని కల్పిస్తుంది. పరిపూర్ణమానవజీవితస్వరూపాన్ని రమణీయంగా చిత్రించిన కవితాలక్షణ సూత్ర మిది. అందుకే Kellet అంటాడు. 'There is nothing like a poem absolute. The Poetry is a function of sympathy between the author and his audience'. సమాజంకోసం సాహిత్యం సృష్టించిన శ్రీశ్రీ కవితాశక్తిని కమనీయంగా వ్యాఖ్యానించగల సత్తా!

శ్రీశ్రీ నవ్యకవిత్వాన్నిగూర్చి చెప్పిన కావ్యఖండాలలో 'కవితా!ఓకవితా!' అన్న గేయం కలికితురాయి వంటిది. కవితాతపస్సులో ఆయన దర్శించిన కవితామూర్తికి అందించిన వేడుకోలు.

'మరి నిన్ను స్మరిస్తే
నా కగుపించే దృశ్యాలా ?
వినిపించే భాష్యాలా ?
అగ్నిసరస్సున వికసించిన వజ్రం!
ఎగిరే లోహశ్యేనం!
ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం!

నవకవిత్వం భావాల్లోనే కాదు నవ్యంగా సృష్టించే పదబంధాల్లో నవ్యంగా భావించే రూపచిత్రాల్లో, ప్రౌఢంగా చెప్పే ప్రక్రియా విన్యాసంలోకూడా ఉంటుందని పై చరణాలు ధ్వనిస్తున్నాయి. 'అగ్నిసరస్సు' 'వికసించేవజ్రం' లోహశ్యేనం ఎగరటం, ఫిరంగిజ్వరంలో మృదంగనాదం- పరస్పరవిరుద్ధాలు- భీకర మనోహరాలు. క్రొత్త సృష్టిలో సమాజశక్తుల్లోలాగా సహజవైరుధ్యం చిత్రించే ప్రౌఢశిల్పం. కరుణార్ద్రమైన వస్తునిర్దేశంపట్ల కవిత క్రమంగా ప్రసరిస్తుంది.

"కడుపు దహించుకపోయే
పడుపుకత్తె రాక్షసరతిలో
అర్ధనిమీలిత నేత్రాల
భయంకర బాధలపాటల పల్లవి"

సమాజంలోని చీకటికోణంలో చిచ్చులు మ్రింగి చివికిపోయే జవరాలిగాథను టార్చి వేసి చూపించి మనకన్నులకు కడవలు కట్టిస్తాడు. జనప్రియగీతంగా తన కవితను రూపొందించ మని వాగ్దేవిని కోరుకుంటున్న ఘట్టం పఠితలకు పులకాంకురితాలు కల్పిస్తుంది.

10

"నేడో, నా ఊహాంచల
సాహసికాంసం కప్పిన నా
నిట్టూర్పులు వినిపిస్తాయా ?
నే నేదో విరచిస్తానని
నా రచనలలో లోకం ప్రతిఫలించి
నా తపస్సు ఫలించి,
నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ
నాజాతి జనులు పాడుకొనే
మంత్రంగా ప్రయోగించాలని
నా ఆకాశాలను
లోకానికి చేరువగా
నా ఆదర్శాలను
సోదరులంతా పంచుకొనే
వెలుగుల రవ్వలజడిగా
అందీ అందక పోయే
నీ చేలాంచలముల విసరుల
కొసగాలులతో నిర్మించిన
నానుడి నీగుడిగా
నాగీతం నైవేద్యంగా, హృద్యంగా
అర్పిస్తా నో
నా విసరిన రసవిస్మృమర
కుసుమపరాగం
ఓహో! ఓరసధుని? మణిఖని? జననీ! ఓకవితా!
కవితా! కవితా! ఓకవితా!

ఈగీతం చదివినప్పుడు అధ్యక్షస్థానంలో ఉన్న విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీశ్రీని చెమ్మగిల్లిన కన్నులతో కౌగిటజేర్చుకొని గౌరవించారట ! ఆదర్శాలలో వారిద్దరూ వేరు కావచ్చు. అనుభూతిలో ఇరువురూ ఒక్కటై లీనమైపోయారు. శ్రీశ్రీ కవిత ఆ అనుభూతిలోనే అమరమై నిలిచిపోతుంది.

• • • •

శ్రీశ్రీ రచనల్లో మహాప్రస్థాన కావ్యసంపుటి మకుటాయమానం ; అభ్యుదయాంధ్రసాహిత్యమార్గానికి మహాకావ్యం.

'మహాకావ్యానికి క్రైటీరియా
సైజూ బరువూ కావయా
నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే
నేటిమహాకావ్యం పద్దెనిమిదిపేజీలే?

పద్దెనిమిదిపర్వాల కావ్యం మహాభారతం. అది వీరరసప్రధానం. జాతిని ఉత్తేజపరిచేదీ ప్రవృత్తిని ప్రేరేపించేదీ వీరం. నవరసాల్లో ఉజ్జ్వలం వీరం. సర్వజీవమనఃప్రవృత్తికి మూలబీజం వీరం. శ్రీశ్రీ మహాప్రస్థానంలో వీరరసప్రస్తారం విస్తారంగా చేశాడు. పీడిత వర్గం స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకోసం ధర్మవిప్లవం సాగించాలన్న ప్రబోధమే ఆయన కవితల్లో కనవచ్చే ఉత్సాహం. తిరుగుబాటులో ఎంత ఉత్సాహ ముందో కష్టజీవుల దుర్భర జీవితంలో అంత కరుణం ఉంది. వారిగాథల్నీ మనోవేదనల్నీ చిత్రించినప్పుడు శ్రీశ్రీ కరుణరసాన్నీ, కరుణారసాన్నీ జాలువారేటట్లు రచిస్తాడు. లలితరసాల్లో శృంగారం తరువాత కరుణం ప్రధానం. అది రౌద్రరసజన్యం. పెట్టుబడిదారుల దారుణ కృత్యాలను సృష్టిస్తే అందులో రౌద్రం భాసించేది. శ్రీశ్రీ ఆఅంశాన్ని అధికంగా స్పృశించకుండా బాధాసర్పదష్టుల విషాదవేదనల్నే విపులంగా సృష్టించాడు. మహాప్రస్థానంలో ఒకవైపు ఉవ్వెత్తుగా ఉదధి తరంగాల్లా లేచే ఉత్సాహగీతాలు, ఒకవైపు విషణ్ణమూర్తులను చిత్రించే కరుణార్ద్రగీతాలు కనపడతాయి, కరుణం స్త్రైణం కాబట్టి కవితలో ఆవేశం ఉండదు. అచ్ఛమైన భావ నివేదనం ఉంటుంది. వీరం పౌరుషరసం కాబట్టి గేయంలో కదనుతొక్కే గతితోపాటు పదను దేరిన పదజాలం ఉంటుంది. నలుపు తెలుపుల్లాగా ఈరెండురసాల సన్నివేశం సమాజ నిజస్వరూపానికి ఛాయాచిత్రాన్ని సంతరిస్తాయి.

1941లో ఫాసిస్టు శక్తులమీద రష్యా తిరుగబడి విమానదాడి చేసినవార్త విన్న శ్రీశ్రీ సవనోత్సాహంతో 'గర్జించురష్యా' గేయం వ్రాశాడు.

'గర్జించు రష్యా! గాండ్రించు రష్యా!
పర్జన్యశంఖం పలికించు రష్యా!
దౌర్జన్యరాజ్యం ధ్వసించు రష్యా!
లే లే రష్యా! రా రా, రష్యా!
రష్యా! రష్యా!, రష్యా!, ఓరష్యా!...
'సుప్త కంకాళాలు మేలుకొంటున్నాయి!
ప్రపంచం పడగెత్తి బుసకొట్టి లేచింది !
కార్మికులు, కర్షకులు, తాడితులు.. పీడితులు—
కెరటాలుగా పొంగి తిరగబడుతున్నారు!
ప్రపంచం నీకోసం పరిపక్వంగా ఉంది.

కోటిగొంతులు నిన్ను కోరి రమ్మన్నాయి;
కోటిచేతులు నిన్ను కౌగిలిస్తున్నాయి!
సైఁ అంటూ రష్యా! జై అఁటూ రష్యా!
లె లే లే, రష్యా! రా రా రా రష్యా!
రష్యా! రష్యా! రష్యా! ఓరష్యా!

ప్రపంచ ప్రజాశక్తికి ప్రతినిధిగా పొలికేకలు వేశాడు శ్రీశ్రీ. ఆనందోత్సాహాల కా పిలుపులు శబ్దసంకేతాలు. 'సుప్తకంకాళాల'వంటి ప్రతీకలు ధ్వని సంకేతాలు. కవితా గౌరవంతో పాటు హృదయోద్వేగం చిత్రించిన ఈకవిత—

'మెదడూ హృదయం మిళితమయే గుణం
అదే మహాకావ్యానికి ఏకైక లక్షణం — అన్న లక్షణానికి లక్ష్యం.

ఇటువంటిదే శ్రీశ్రీ 'ప్రతిజ్ఞ'—

'నాలో కదిలే నవ్యకవిత్వం
కార్మికలోకపు కల్యాణానికి
శ్రామికలోకపు సౌభాగ్యానికి
సమర్పణంగా
సమర్చనంగా!......
కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం
జాలరి పగ్గం సాలెల మగ్గం
శరీరకష్టం స్ఫురింప జేసే
గొడ్డలి రంపం, కొడవలి, నాగలి
సహస్ర వృత్తుల సమస్తచిహ్నాలు—
నా వినుతించే, నా విరుతించే
నా వినిపించే, నవీనరీతికి
నా విరచించే నవీనగీతికి
భావం! భాగ్యం!
ప్రాణం! ప్రణవం!...

కార్మికశ్రామికలోక కల్యాణానికై కలంపట్టిన కవి వారివృత్తిచిహ్నాలనే మనఃప్రవృత్తి సంకేతాలుగా భావించి కీర్తిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. ప్రతిజ్ఞే కాదు ఆత్మప్రజ్ఞాప్రాభవాన్ని సగర్వంగా చెప్పుకొని కవి వీరుడులా లోకాన్ని మంత్రముగ్ధం చేస్తాడు.

'నే నొక దుర్గం !
నా దొక స్వర్గం !
అనర్గళం, అనితరసాధ్యం నామార్గం!'

శ్రీశ్రీ కరుణ(ణా)రస ఘట్టాలను చిత్రించే కవితల్లో ఆడంబరం లేని అర్థవంత మైన రచనాశిల్పాన్ని ప్రదర్శిస్తాడు. మహాప్రస్థానంలో 'ఆకాశదీపం', 'బాటసారి', 'భిక్షువర్షీయసి' కావ్యఖండాలు ఇందుకు నిదర్శనాలు.

ఆకాశదీపంలో - 'ఒక దురదృష్టజీవి - ఉదయం ఆరున్నరకు - ఆగదిలోనే ఆరిపోయాడు' అన్నది వస్తువు. ఈసంగతి ఆ గేయం నడిమిభాగాన చెపుతాడు కవి. 'దురదృష్టజీవి' అన్న విశేషణంతప్ప ఆ మృతవ్యక్తిని గూర్చి మరే అంశం మనకు తెలియరాదు. అతనిజీవితం వడ్డించినవిస్తరి కాదని శ్రీశ్రీకవితాసంస్కారం చెపుతుంది. ఉదయం ఆరున్నరకు దీపంలా అతడు ఆరిపోయాడు. 'దీపంలా' అని అనకుండా 'ఆరిపోయా' డన్న క్రియాశక్తిచేత దాన్నిస్ఫురింప చేస్తాడుకవి. ఎందుకంటే దీపాన్ని ప్రతీకగా గేయంలో తీసుకొని తర్వాతిభాగం నడిపించాడు కాబట్టి. మూడు ముక్కల్లో ముగించే యీ చిన్నవృత్తాంతానికి ముందువెనుకల ఉపోద్ఘాతోపసంహారా లున్నాయి. ఉపోద్ఘాతం సూటిగా మూడువిషయాలు చెపుతుంది. 1. 'గదిలో ఎవరూ లేరు ; గది నిండా నిశ్శబ్దం; సాయంత్రం ఆరున్నర - గదిలోపల చినుకులవలె చీకట్లు;' 2. చూపు లేని చూపులతో తెరిచూస్తున్నది గది; గదిలోపల ఏవేవో ఆవిరులు : 3. దూరాన నింగిన తోచిన ఒకచుక్క మిణుకుచూపులు మెలమెల్లగా విసరి గదిని తలపోతతో కౌగిలించుకొంటున్నది. ఈకథనంలో శిల్పం ఉంది. వాతావరణ వర్ణనంద్వారా వాస్త వాన్ని ధ్వనింపచేయటం ఇందులోని రహస్యం 'ఎవరూ లేరని' ప్రారంభించటంలోనే అది మొదలైంది. 'చూపులేని చూపులో' అది కొంత తేటతెల్లమయింది. 'నింగిని తోచిన చుక్క' ఆతాత్పర్యాన్ని మినుకుమినుకు మని సూచిస్తున్నది. ఇక ఉపసంహారభాగంలో ఒక దీపకథ ఉంది. ఆరిపోయిన ఆవ్యక్తికీ ఈదీపానికీ అభేదాధ్యవసాయమో, బింబ ప్రతిబింబభావమో సింబల్ద్వారా మనం గ్రహించాలి. దీపం మూల నక్కి మూలుగు తున్న దనటంలోనే అది స్పష్టమౌతుంది ఆమూలుగు ఆకలివేదనవలన; ప్రమిదలో చమురు త్రాగుతూండటం నీళ్లో, గంజో త్రాగి బ్రతుకు నిలుపుకోవటం, చీకటిబోనులో ఉన్నసింహం విధి వక్రించిన దురదృష్టజాతకం; కత్తిగంటుమీద నెత్తురుబొట్టు లాగుంది దీప మనటంలో. ఆవ్యక్తి ఆత్మహత్య కాలోచించాడని వ్యంగ్యం. అకస్మాత్తుగా ఆకాశ తారను చూడటం హఠాత్మరణాన్ని సూచిస్తుంది. ప్రతీకద్వారా గతచరిత్రను ధ్వనింప జేయటం ఇందులోని కథాకథనశిల్పం.

ఇదంతా ఒకయెత్తు చివరి రెండుపాదా లొకయెత్తు. 'దీపం ఆరిపోయింది - తారగా మారిపోయింది'. ఆ అభాగ్యునిజీవితంమీద వెలుగుపొడిగా చల్లిన కరుణావ్యాఖ్య ఇది. ఉదయం ఆరిపోయిన ఆదీపానికి సాయంకాలమయినా సానుభూతి చూపించే దిక్కు లేదని వస్తుధ్వని. దిక్కులేని ఆజీవిని రిక్కగా వెలిగించటం కవిసానుభూతి.

'బాటసారి' గేయంకూడా ఇలాంటిదే. కాని దాని రచనాశిల్పంవేరు. కవికథనం రన్నింగ్కామెంటరీగా ఉంటుంది. కూటికోసం, కూలికోసం పట్టణంలో బ్రదుకుదామని

బాటసారి బయలుదేరాడు. అతడు బాలుడని వర్ణనం వ్యంగ్యంచేస్తుంది. బయలుదేరి నప్పటినుంచీ జ్వరం కాస్తే ; భయం వేస్తే - ప్రలాపిస్తే ; చిమ్మచీకటి క్రమ్ముకొస్తే - దారి తప్పిన బాటసారికి ఎంతకష్టం ! - అని ముందు జరుగబోయే విషాదాంతసంఘట నకు విత్తులు నాటుకుంటూ పఠితమనస్సు నుమ్మఖీకరణం చేస్తాడు కవి.

ఆపైన కళ్లు వాకిట నిలిపి చూచే పల్లెటూళ్ళో తల్లి "పలవరింపును" పేర్కొం టాడు. తల్లిమాటలు చెవినిపెట్టక బయలుదేరిన ఆబాటసారి కేదో కీడు ముంచు కొస్తుం దని చెప్పి మనకు సానుభూతిని కల్పించటమే కాకుండా, పుత్రశోకవార్నిధిలా వాకిట నిలిచిన తల్లిని కన్నులకు కట్టించి కరుణరసాన్ని జాలువారిస్తాడు.

చివరకు చెప్పదలచుకుంది వాచ్యంచేసి వదలితే ముగింపుకు బిగువులేదు. అందువల్ల మృత్యువును సూచించే వాతావరణాన్ని వర్ణించి శిల్పం చూపించాడు శ్రీశ్రీ. ఈరచనలో సంవిధానశిల్పంతోపాటు అలంకారశిల్పం ఉంది. బాటసారిస్థితి 'నడిసము ద్రపు నావరీతిగ' ఉన్నదనే ఒక్క ఉపమానంవల్ల కథకంతా వెలుగు వస్తుంది. 'రాత్రి నల్లనిరాతి పోలిక గుండెమీదనె కూరుచుండగ' అన్న ఉపమానంవల్ల తల్లడిల్లే తల్లి మనసు తెలుస్తున్నది. 'పల్లెటూళ్లో తల్లికేదో పాడుకలలో పేగు కదిలింది' అని ముగించ టంలో పూర్వాపరకథాసంవిధానశిల్పం ద్యోతమానం అవుతోంది. బాటసారి కావ్య ఖండికమీద టాగూర్ప్రభావం కొంత ఉంది.

'భిక్షువర్షీయసి' శిల్పం వేరు. విభావవర్ణనం ద్వారా పాత్రమీద సానుభూతి కల్గించటం - ఆ పైన ఆ పాత్ర అలా కావటానికి హేతువునుగూర్చిన పర్యాలోచనం రేకెత్తించటం ఇందులోని సంయోజనశిల్పం. సన్నివేశం నుండి సమస్యను రేకెత్తించే కథనమర్మం ఇందులో ఉంది. అదే కార్యకారణసంబంధం.

"దారిపక్క, చెట్టుక్రింద
ఆరిన కుంపటి విధాన
కూర్చున్నది ముసల్దొకతె
మూలుగుతూ ముసురుతున్న
ఈగలతో వేగలేక"

'ఆరినకుంపటి విధాన' అన్న ఉపమానం ఈ గీతంలో వెలుగు.

"ఆ అవ్వే మరణిస్తే
ఆ పాపం ఎవ్వరి ? దని
వెర్రిగాలి ప్రశ్నిస్తూ
వెళిపోయింది.'

ఈ ప్రశ్నయే ఈ కావ్యఖండంలో ఆలోచనాతరంగం ; భావచైతన్యం.

"క్రమ్మె చిమ్మచీకట్లూ
దుమ్ము రేగె సంతలోన
'ఇది నాపాపం కా' దనె
ఎగిరివచ్చి ఎంగిలాకు !"

ఈ ముగింపు పఠిత ఊహించి ఉండడు కాబట్టి అబ్బురపాటు చెందుతాడు. 'ఎంగిలాకు' ఆమెనుగురించీ ఆమెచావుకు కారణమైన సమాజంగురించీ ఎన్నో కథలు వ్యంగ్యంగా చెపుతుంది. భిక్షువర్షీయసిలో ఎత్తుగడ ఎంత సహజంగా ఉందో ముగింపు అంత బిగింపుగా ఉంది. విమర్శకుల ప్రశంస లందుకొన్న ఈ గేయం శ్రీశ్రీకవితా శిల్పానికి పతాక!

శ్రీశ్రీ ప్రాచ్యపాశ్చాత్య కావ్యసంప్రదాయాల్లో ఉన్న శిల్పరహస్యాలు తెలిసిన మనీషి. తెలిసి వ్రాసిందే శిల్పం. 'ప్రౌఢశిల్పజగత్తున ప్రథమగణ్యు డగును కవి;కవితా శిల్ప మతని దగుట' - అని 1923 లోనే చెప్పాడు. గతం వర్తమానం ఆయనలో జీర్ణమై క్రొత్తకవితాశక్తిని అవిర్భవింపచేశాయి.

'లోకాలు- భవభూతి శ్లోకాలు- పరమేష్ఠి జూకాలు నా మహోద్రేకాలు' అన్నప్పుడు గీర్వాణసాహిత్యసమాలోచనమూ, పుష్కిన్, గొగోల్, షెకోవ్, టాల్‌స్టాయ్, డోస్టోవస్కి, గోర్కి, కూప్రిన్- శిల్పసమ్రాట్టులై జీవితం మథించి వ్రాసిన కావ్య తత్త్వాన్వేషణమూ ఆయన క్షుణ్ణంగా చేశాడు. సంస్కృతాంధ్ర పాశ్చాత్య సాహితీ సంప్రదాయాల త్రివేణీసంగమం శ్రీశ్రీ ప్రతిభాపరీవాహక్షేత్రం. శిల్పులైన అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీ ప్రథమగణ్యుడు !

• • • • •

"ఆధునికాంధ్ర కవుల రచనలను సరిగా అర్థంచేసుకోవడానికి వాటి వెనుక బాసటగా నిలిచిన ఇతరదేశాల సాహిత్య వ్యవసాయాలను గమనించక తప్పదు. నేటి రచనలను విశ్వపర్యాప్తమైన విశాలజీవితంతో సమన్వయించి నిజమైన కవిత్వ మేదో, కేవలం నిర్జీవ శుష్కానుకరణం ఏదో గుర్తించా"లని శ్రీశ్రీ 'నేటి తెనుగుకవిత- కొత్త పోకడలు' అన్న ప్రసంగవ్యాసంలో పేర్కొన్నాడు.

యూరప్‌లో ప్రపంచమహాసంగ్రామం సాగుతున్న రోజుల్లో ఇటలీలో సీనార్ మారినెట్టీ భావికళ (Futurism)ను ప్రచారంలోకి తెచ్చాడు. శిథిలాలనుండి నూతన సృష్టి వెలువడుతుం దని ఆయన సిద్ధాంతం. ప్రాచీనసాహిత్యాన్నంతా తగులబెట్టమనీ యంత్రాలనుండీ, చలనచిత్రాలనుండీ వార్తాపత్రికల శీర్షికలనుండీ కావ్యవస్తువులను స్వీకరించాలనీ ప్రబోధించాడు. ధ్వనులే సంగీతమనీ, మాటలే కవిత్వమనీ, రంగులే శిల్పచిత్రాలనీ పేర్కొన్నాడు. అదే సమయంలో ఫ్రాన్సుదేశంలో క్యూబిజం, జర్మనీలో ఎక్స్‌ప్రెషనిజం, అమెరికాలో ఇమేజిజం, తలయెత్తాయి, కళాక్షేత్రంలో మొదలై

కవితారంగంలో విహరించాయి. ఈప్రయోగరచయితలందరూ ఛందస్సు, అలంకారం, వ్యాకరణం, అన్వయంలాంటి కళాధర్మాల నన్నింటినీ త్రోసిరాజని క్రొత్తగమనాలతో లయలతో, సంగతులతో రచనలు సాగించారు. గతాన్ని నిరసించి ధ్వంసంచేసే సాహిత్యప్రక్రియల్లో డాడాయిజం శక్తిమంత మైంది. ట్రిస్టన్ జారా (Tristan Tzara) దీనికి మూలపురుషుడు. వస్తువు, భావం, రచనాక్రమం లేకుండా రచనలో అర్థరహితమైన వాక్యవిన్యాసం. అయోమయమైన శీర్షికలూ, ఏ మాటనైనా ఏ అర్థంలో నైనా ఉపయోగించే విశృంఖలత్వం వీరు ప్రకటించారు. సాహిత్యక్షేత్రంలో అరాజకం సృష్టించటమే ఈ ఉద్యమధ్యేయం. ఈ ప్రయోగం నిర్మాణాత్మకమైన సాహిత్యాన్ని సృజించ లేకపోయింది. కొలదికాలంలోనే అంతరించిపోయింది.

డాడాయిజంలో విశ్లథమైపోయిన శబ్దశిల్పం సర్రియలిజంలో ప్రాణంపోసు కొని నూత్నతేజస్సుతో క్రమశిక్షణతో ఉద్భవిల్లింది. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణశాస్త్రం, ఐన్‌స్టీన్ సాపేక్షసిద్ధాంతం (రిలెటివిటీ థియరీ) దీని మీద బలమైన ముద్రవేశాయి. ఈ ఉద్యమనాయకుడు అంద్రేబ్రెటన్. మానవుని వ్యక్తావ్యక్తావస్థ (sub-conscious) లో భాసించే అనుభూతులకు రూపకల్పనం చేయటమే ఈపద్ధతిలో ప్రధాన ధర్మం. సంప్రదాయాన్ని సహేతుకంగా నిరసించటం, వ్యంగ్యాధిక్షేపాలతో గతాన్ని అవహేళ నం చేయటం, నీతిధర్మ సూత్రాలను గర్హించటం ఈ కవితలో కనపడే వైలక్షణ్యం. 'రాజకీయాలలో నానాజాతిసమితి ఎటువంటిదో కళాప్రపంచంలో సర్రియలిజం అట్టిదని చెప్పాలి' అని శ్రీశ్రీ అంటాడు.

ఫ్రాన్సులో పుట్టిన మరొకవాదం సింబాలిజం. బాద్లేర్ ప్రతిపాదించిన ఈప్రక్రి యను తెలుగులో ప్రతీకవాద మని పిలుస్తున్నారు. వార్లేన్, మలార్మే వంటి వారు దీనిని పోషించారు. సంగీతంలో రాగానికి లాగానే కవిత్వంలో శబ్దానికి ప్రాధాన్యం, వ్యంగ్యశక్తి ఉంది. శబ్దం భావప్రకటనంకంటే భావసూచననే చేయ గలుగుతుంది. కవితలో విషయవివరణం కంటె వాతావరణకల్పనం ప్రధానంగా ఉండాలి. ఉపమాద్య లంకారాలు వ్యంగ్యాన్ని భంజిస్తాయి కాబట్టి ప్రతీకలద్వారా భావాన్ని భావనామధురం చెయ్యాలి. సంగీతంలాగా కవిత్వం వల్ల కూడా కలిగేది అవ్యక్త మాధుర్యమే-అని వీరి సిద్ధాంతము. ఇది కవిత్వాన్ని జీవితసమస్యలనుండి దూరంచేసి భావలోకాల్లో విహ రింప చేసింది. ఆడెన్ మొదలైన వామపక్షీయులు మార్క్సిస్ట్ దృక్పథంతో కవి త్వంలో మధ్యతరగతి ప్రజల, పీడితజనుల దుర్భరజీవితసమస్యలను వర్ణించటం మొదలుపెట్టారు. ఛందోవ్యాకరణ సంప్రదాయాలను అవసరమైనప్పుడు ధిక్కరించారు. వీరిది భౌతికవాదదృక్పథం.

శ్రీశ్రీకవిత్వంలో ఆధునిక పాశ్చాత్య కవితాప్రయోగాల ప్రభావం కనపడు తుంది. కాని, వీరి ప్రధానదృక్పథం భౌతికవాదం- "వీరు ఆకాశంలోకి వెళ్ళి నక్షత్ర

పథాల్లో విహరించినట్లే భూమికికూడా చేరువగా వచ్చి ఇదివరకు కవులు ప్రవేశించని చీకటికోణాలలోనికి కాంతికిరణాలు పంపిస్తున్నారు. నగరజీవితం, పారిశ్రామికపరిస్థితుల హృదయవిదారదృశ్యాలు, పతనోన్ముఖమైన ప్రాతసంఘపు వికిరనృత్యం, తమ కావ్యవస్తువులుగా చేసుకొన్నారు ఈమార్గంలో వీరికి రష్యన్ ఫ్యూచరిజం ఆదర్శమౌతున్నది. మయకోవస్కీ, పాస్టెర్నాక్ మొదలైనకవుల రచనలు పీడితలోకంలో వీరికి సానుక్రోశం కలిగించాయి. కుబేరవైభవం ప్రక్కనే కుచేల దారిద్ర్యం కనపడటానికి వీరు నిర్ఘాంతపోతున్నారు. ఒక్కసారి తనచుట్టూ చూస్తే సంఘదూషితులైన ప్రవాస జీవులు దరిద్రభిక్షువులు, జీవనోపాధికి శరీరకష్టం తప్ప వేరే ఆధారంలేని కష్టజీవులు కానవస్తున్నారు. తమకవితలో వారిదారుణదృశ్యాలు ప్రదర్శించి లోకం కళ్లు'' తెరిపిస్తున్నారు అభ్యుదయభేరి మ్రోగిస్తున్నారు.

శ్రీశ్రీ మహాప్రస్థాన కావ్యసంపుటిలో వస్తువు లెన్నుకోటానికి ప్రేరణ కల్పించింది గతితార్కికభౌతికవాదం. కవితాప్రకటనలో తోడ్పడింది ప్రతీకవాదం. ఆయన ప్రతీక వాదానికి ప్రతికావ్యఖండం ఉదాహరణమైనా అందులో మిన్నగా భాసించేది 'జగన్నాథునిరథచక్రాలు'.జగన్నాథునిరథచక్రాలు ప్రజాశక్తి సాధించే సమసమాజవ్యవస్థకు ప్రతీక. శనిదేవత రథచక్రాలు బూర్జువావ్యవస్థకు ప్రతీక। పీడితలోకాన్ని 'శనిదేవత రథచక్రపుటిరుసులలో పడి నలిగిన దీనులార। హీనులార।' అని సంబోధిస్తాడు. 'దగాదడిన తమ్ములార। మీకోసం కలంపట్టి, ఆకాశపుదారులంట, అడావుడిగా వెళిపోతే అరచుకుంటు వెళిపోతే, జగన్నాథునిరథచక్రాల్, రథచక్రప్రళయఘోష, భూమార్గం పట్టిస్తాను। భూకంపం పుట్టిస్తాను।' అని అభయహస్తం ఇస్తాడు. 'స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం, పునాదులై ఇళ్ళులేచి, జనావళికి శుభం పూచి, శాంతి శాంతి కాంతి శాంతి జగమంతా జయిస్తుంది, ఈ స్వప్నం నిజమౌతుంది, ఈ స్వర్గం ఋజువౌతుంది' అని సమసమాజ శాంతిపాఠం పఠిస్తాడు. సమసమాజం విశ్వశాంతికి మూలకందమని విశ్వసించిన శ్రీశ్రీ 'నేనుసైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను; నేనుసైతం విశ్వవీణకు తంత్రినై మూర్ఛనలు పోతాను; నేనుసైతం భువనభవనపు బావుటానై పైకిలేస్తాను,-అనిజయభేరితో ఆశాభాంకారాన్ని చేశాడు. ఆ కల నిజం చేయాలనే ఆయన కలం పట్టాడు- కాహళలా కవితను మ్రోయించాడు.

• • • •

శ్రీశ్రీ రచనకు స్వేచ్ఛ ప్రధాన గుణం. పద్యమైనా, గేయమైనా ఆయన చేతుల్లో వింతపోకడ పోయింది. బహిరాకృతికంటే భావలయ కాయన ప్రాధాన్యమిస్తాడు. వ్యక్తావ్యక్త చేతనలో నుండి ఉబికిన ఊహాచిత్రాలను గేయగతుల్లో విచిత్రంగా రూపిస్తాడు. గేయం నియతగతిలో నడవాలన్న నియమం ఆయనకు లేదు. అసలు నియమంమీద కంటే అంతర్లయసంయమనం మీదనే ఆయన ఊనిక ఇస్తాడు. సమమాత్రకాలైన పాదాలతో గేయం గమించిందంటే అది అంతర్లయలోని హార్మొనీని

తెల్పుతుంది. ఉద్వేగభావశకలాల కలకలావిష్కారాన్ని వ్యక్తం చేసేటప్పుడు గేయంలో వచనం, వచనంలో గేయం నిరాఘాటంగా చొచ్చుక పోతుంటాయి, గతివైవిధ్యం భావశబలతనే కాకుండా, భావవైరుధ్యాన్నిగూడా నిపుణంగా ప్రదర్శిస్తుంది. ఛందస్సుకు ప్రాణమైన ఋతం భరత్వం శ్రీశ్రీ హృదయవీణలో మ్రోగుతుంది. లోకంలోని అప శ్రుతులతో కలసి అంతర్వీణ ఘోషిస్తుంది- అపశ్రుతులమధ్య కూడా శ్రుతిసుభగత్వం అంతర్వాహినిగా ప్రవహిస్తుంది. అందువల్లే ఆయన వచనగీతాలుకూడా పఠితకు అనిర్వచనీయమైన హాయిని చేకూరుస్తాయి ఆధునికాంధ్ర వచనకవుల్లో శ్రీశ్రీ సాధించిన ఛందోహృదయజ్ఞానం అందరిలో కనపడదు, వచనగీతరచనం కత్తిమీదసాము వంటిది. శ్రీశ్రీ మాటల్లో-"వచనగీతం అంటే చేతికి వచ్చిన వ్రాత కాదు వ్యర్థపదాలు లేకుండా వచనం వ్రాయటం మరీకష్టం. పద్యరచనలో ఛందస్సీరాలు కవులను కాపాడి నడి పిస్తాయి వచనగీతంలో బైటినుండి ఇట్టి సహాయం రాదు. కవి తన అంతర్జగత్తులో నుండి మాత్రమే వల్లికలు కల్పించుకోవాలి. వచనగీతం తనరూపం తానే నిరూపించు కుంటుంది... వచనగీతానికి ప్రాణప్రదమైన లక్షణం గమనవైవిధ్యం. ఇది సంభాష ణలో యాసలూ, కాకూవులూ, ఉచ్చారణ విశేషాలమీద ఆధారపడి ఉంటుంది. శైలికి రీతికి సంబంధించిన సమస్యలెన్నో దీనినుండి బయలుదేరుతాయి'. గీతంలోలాగే వచ నంలోకూడా అనితరసాధ్యమైన కవితామార్గాన్ని నిర్మించుకొన్న మహాకవి శ్రీశ్రీ.

శ్రీశ్రీ స్వేచ్ఛఛందంలోనే కాదు. భాషలో ప్రయోగంలో కూడా కనపడుతుంది. తిరుగుబాటు ధోరణికి స్వేచ్ఛ ఊతకర్ర. 'కవితా ఓ కవితా' గేయంలో 'మాటలకై వెదుకాడబోతే- అవి - పుంఖానుపుంఖంగా- శ్మశానాలవంటి నిఘంటువుల దాటి, వ్యాకరణాల సంకెళ్లు విడిచి- ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి- వడిగా-వడివడిగా పరుగెత్తుతా యంటాడు.

'విప్లవం మున్ముందు మనుష్యుని మనస్సులో ప్రారంభమవుతుంది.
మనఃప్రపంచానికి బాహ్యస్వరూపం భాష
భాషావిప్లవమే భావవిప్లవం" అని వ్యావహారికాంధ్రభాషనే తన గేయాల్లో

వాడాడు- 'వ్యవహారాంధ్రం జీవ
త్ప్రవాహ మది వదలిపెట్టి పాతదయిన స్థా
ణు వయిన గ్రాంథికభాషను
చెవి నెవ్వడు పెట్టు నేడు? సిరిసిరి మువ్వా?

అని ప్రజాభాషకు సాహిత్యంలో ప్రాభవాన్ని కల్పించాడు.

భాషలో, భావంలో, ఛందంలో, పదబంధంలో, అలంకారంలో, ఉక్తిచమత్కా రంలో క్రొత్తపోకడలుపోయి తనదైన ఒకజగత్తును సృష్టించుకొన్నాడు శ్రీశ్రీ. ఆయన దర్శనంలో చంద్రుడు- 'ఫంపుతేరినకత్తి', 'ఆకాశపుఎడారిలో కాళ్ళు

తెగిన ఒంటె', 'ఆకాశంమీద రాకాశికోర'. శ్రీశ్రీ సృష్టిలో ప్రతివస్తువూ అపూర్వవ్యక్తి. స్వేచ్ఛలోనుంచి పుట్టిన అంతర్వ్యక్తి!

శ్రీశ్రీ తన 'ఖడ్గసృష్టి' 'మహాసంకల్పం' ఇతరకృతుల్లో ప్రయోగానురక్తి అధికంగా ప్రదర్శించాడు. సంప్రదాయ నిర్మూలనానికి ఆయన కలాన్ని ఖడ్గంగా సమాయత్తంచేశాడు. 'అందుకే సృష్టిస్తున్నాను, అధర్మనిధనం చేసే ఈ ఖడ్గాన్ని-కలంతో సృష్టిస్తున్న ఖడ్గం ఇది, జనంతో నిర్మిస్తున్న స్వర్గం ఇది" 'ఈ కత్తి బూజు పట్టిన భావాలకి పునర్జవం ఇవ్వటానికి కాదు- కుళ్ళిపోతున్న సమాజవృక్షాన్ని సమూలచ్ఛేదం చెయ్యడాని" కని నిక్కచ్చిగా చెప్పాడు. వీరవాది ఉగ్రవాది లక్షణాలను ప్రదర్శించాడు అధివాస్తవిక ధోరణిలోనే అధిక్షేపానికి అభిమానం చూపించాడు.

"అర్థాన్ని అధ్వాన్నపు అడవిలో వదలి
గద్యానికి పద్యానికి పెళ్లి చేదాం
కాదన్న మాదన్న యెవడన్నా ఉంటే
వేమన్న యేమన్నాడో చూడమందాం"

'26' అన్న శీర్షికలో డాడాయిజం. 'జోన్'లో క్యూబిజం, అలాగే కొన్నిగేయాల్లో ఇమేజిజం' బహుళంగా స్యరియలిజం శ్రీశ్రీ ప్రయోగించారు

"జీబ్రాకి algebra చిహ్నాల
లాంకోటూ పాంకోళ్ళూ తొడిగి
సాహిత్యపౌరోహిత్యం ఇస్తే
వెర్రికాదు Surrealism రా సోదరా!" పొమ్మన్నాడు.

పాశ్చాత్యప్రక్రియలతో పాటు ప్రసిద్ధకవుల రచనల్నికూడా తెలుగు చేసి, ఆంధ్ర సాహిత్యాన్ని సంపన్నంచేశాడు శ్రీశ్రీ. టెన్నిసన్, జార్జివిలియమ్‌రసెల్. W. H. డేవిస్, ఎడ్గార్ అలెన్‌పో, స్విన్‌బర్న్, ఎమిలే వెర్‌హెరెన్, అలెగ్జాండర్‌బ్లాక్, Paul Eluard, James Joyce, Andre Breten, Charles Baudelaire, Fancois Villon, Guillaume Apollinaire, Dylan Thomas, Henry Michaux, Salvador Dali, Walt Witman, E. E Cummings, Vladimuir Mayokovsky, Pablo Neruda, Alexander Pushkin మొదలైన పాశ్చాత్యుల రచనలు, హరీంద్ర చట్టోపాధ్యాయ వంటి భారతీయుల రచనలు శ్రీశ్రీ స్వతంత్రప్రతిభాశక్తితో తెలుగులో సజీవచైతన్యాన్ని సంతరించుకొన్నాయి.

జలపాతాల్లాంటి శ్రీశ్రీ ప్రసిద్ధగేయాలతోపాటు హాస్యరసశీకరాల వంటి శత కాలు కూడా ఉన్నాయి. దాన్ని విదూషకసాహిత్య మంటాడు శ్రీశ్రీ. అయితే ఇవి కేవలం నవ్వించటానికి మాత్రమే రాయలేదు. పత్రికాప్రపంచంలో కార్టూనులు నిర్వహించే విధిని ఈ కవిత్వంద్వారా నిర్వహించా నంటాడు. దీన్ని కార్టూనుకవిత్వ మని కూడా పేర్కొనవచ్చంటాడు.

సిరిసిరిమువ్వ, ప్రాసక్రీడలు, లిమరుక్కులు, రుక్కుటేశ్వరశతకం, ఈశాఖలో పేర్కొన దగినవి. సిరిసిరిమువ్వ శతకంలో—

"నాలాగ కందబంధ
జ్వాలాజాలాగ్ర సంవసత్ సద్గీతా
లాలాపించే కవితా
శ్రీలోల డు నహి నహీతి, సిరిసిరిమువ్వా!

అన్న వీరవాక్యాలతోపాటు-

'కోయకుమీ సొరకాయలు
వ్రాయకుమీ నవల లని అవాకు చెవాకుల్
డాయకుమీ అరవఫిలిం
చేయకుమీ చేబదుళ్ళు సిరిసిరిమువ్వా!

అనే పారడీ నీతివాక్యాలూ—

'రామాయణాలనే మ
ళ్ళీమళ్ళీ దెచ్చి వ్రమచ్చిలించే కన్నా
అమోస్తరు రచనల్లో
క్షేమంగద రామకోటి సిరిసిరిమువ్వా!

అన్న వేడి ఛలోక్తులూ-

'Gold వ్యామోహం చెడ్డది
Mild వ్యావారం శరీర మాద్యం ఖలుడా
Child వ్యాపారం కూడదు
Old వ్యూలను హోల్డుచేయకోయి సిరిసిరీ!"

అన్న మణిప్రవాళ సంకరపద్యాలూ- ఎన్నో కనపడతాయి.
లిమరిక్కు లో-'సమకాలిక జీవితమే- సత్కవితావస్తువు

అన్వేషీ, కుకవీ చచ్చిన- వంటే పడి చస్తరు ;

నవరసాల నాయకుణ్ణి - కవనం నా ఆయుధం
ఈ శతాబ్ది నేలుతుంటి - భీభత్సరసాయం

కరుణరసం, శృంగారం - వాడిన పూరేకులు
వీరరసం, బీభత్సం - ఈనాటి తుపాకులు ;

ఇలా ఆధునికకవిత్వ వివేచనాన్ని గూర్చి చెప్పినవాక్యా లొకవైపు వెలుగుల్లా ప్రకాశిస్తుంటే- వ్యక్తిదూషణ పార్టీదూషణ పరమైన వాక్యాలు మచ్చలుగా నిజంగా జుగుప్సనే కలిగిస్తాయి. ఎవరే మనుకున్నా శ్రీశ్రీ మాత్రం- తన Self Potrait ను

'విదూషకుడి Temperment
ఏదో ఒక discontent
బ్రతుకులో experiment
పదాలు patent రసాలు torrent
సదసత్సమస్యకి solvent శ్రీశ్రీ gaint'

అని చిత్రించు కొన్నప్పుడు వెలుగునీడల శ్రీశ్రీని చూచి నిబ్బరించుకుంటాం. శ్రీనాథుని చాటువులకూ శృంగారనైషధానికీ ఎంత తేడా ఉందో శ్రీశ్రీ విదూషక కవిత్వానికీ మహాప్రస్థానానికీ అంత అంతర ముంది. దాన్ని గుర్తిస్తే చాలు.

♦ ♦ ♦ ♦

శ్రీశ్రీకవితా జీవితం ఒకమహాస్రవంతి ప్రభవలో పర్వతాగ్రంనుండి జాలువారు తున్న నిర్ఝరిలా కనపడుతుంది. మహాప్రస్థానంలో గోదావరిలా ఉప్పొంగి ప్రవహిస్తుంది. ఆ తరువాత పాయలై ప్రవహిస్తుంది. నిర్ఝరిలో మనం నడిచిపోవచ్చు. గోదావరి గాంభీర్యాన్ని అందుకోవటానికి ఈదాలి, నావలో యానం చేయాలి, ఒడ్డు చేరుకోవాలి. పాయల్లో పాషాణాలు కాళ్ళకు గుచ్చుంటాయి. గాయాలు తగిలినా తగలవచ్చు- అందరో నడిచిం దల్లా మంచిదోవ కాదేమో? భద్రంగా దాటాలి. ఆ ద్యంతాలు వదలి పెడితే శ్రీశ్రీ వ్యక్తిత్వం నిండుగా, దండిగా మహాప్రస్థానంలో-కనపడుతుంది. అదే ఆయన్ని యుగకర్తగా నిలుపగలిగిన సాహిత్యం.

శ్రీశ్రీ వచనసాహిత్యం అపారం. కథలూ, నాటికలూ, వ్యాసాలూ, ఉపన్యాసాలూ, సమీక్షలూ, పీఠికలూ, లేఖలూ, ప్రతికారచనలూ-ఇలా ఎన్నో ఉన్నాయి. ప్రక్రియ ఆయన కలాని కొడిగించే కాని ఆయన మీద ప్రభుత్వం చేయలేదు.' 'పద్యం ఎక్కువా? లేక గద్యం ఎక్కువా అనే సమస్య అభేద్యం- ఐనా ఘంటావాద్యంగా నే నంటా నీరెండూ నాకే నైవేద్యం" అంటాడు శ్రీశ్రీ

శ్రీశ్రీ నవ్యసాహిత్యపరిషత్తు, ఆంధ్ర అభ్యుదయరచయిత సంఘం. సాహిత్య అకాడమీ, లాంటి సాహిత్యసంస్థలనూ, మద్రాస్ లెజిస్లేచర్ కౌన్సిల్, పౌరహక్కుల మహాసభ, వంటి ప్రజాసంస్థలనూ అలంకరించారు. వీణ, ప్రతిభ, లాంటి పత్రికల సంపాదకత్వం నిర్వహించారు. సినీరంగంలో పాటలు, మాటలు వ్రాసి అందులోనూ తమవ్యక్తిత్వాన్ని నిలుపుకున్నారు. కేంద్రసాహిత్య అకాడమీ, సోవియట్ ... బహుమతులు పొందారు, 'సాహిత్యాచార్యాది' బిరుదాలు పొందారు. ఇప్పుడు విప్లవ రచయితల సంఘానికి అధ్యక్షుడుగా ఉండి తాను నమ్మిన రాజకీయ సిద్ధాంతాన్ని సాహిత్యంలో ముద్రిస్తున్నారు.

"సాయుధవిప్లవ బీభత్సుని సారథినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝంఝుని ప్రసరిస్తా"-నని విప్లవగీతను వినిపిస్తున్నారు—

• • • •

అభ్యుదయాంధ్ర కవిత్వయుగకర్త శ్రీశ్రీ ప్రజాకవి. సమాజ చైతన్యాన్ని మేల్కొల్పి, దానిలోని వేడిరక్తాన్ని ఉడికించి, కవితను ప్రజావాణిగా పలికించి, ప్రపంచ పీడితజన బాధామయగీతాన్ని హృద్గీతగా పొగించి, జీవితానికీ సాహిత్యానికీ మంగళ సంవిధానాన్ని సాధించి, పండిత పామరజనరంజకమైన కవితాస్రవంతిని తెలుగునాట క్రొత్తతియందనాలతో పారించి, అభ్యుదయ పథాన్ని చూపించిన శ్రీశ్రీ ఆధునికాంధ్ర సాహిత్య రథసారథి. తిక్కన్న, వేమన్న, గురుజాడ-ఆయనలో కొత్తరూపం తాల్చారు- తెలుగు వారికి- తెలుగువాణికి ఒక అంతర్జాతీయకవిని సమర్పించారు-

'నిజంగా నేను
ప్రజల కవినేను -
ఎంచేతంటేను
వాళ్ళను చదివేను,
చదివిందే రాసేను' -

ప్రజలను చదివినవాడూ-చదవింది వ్రాసినవాడూ ప్రజాకవి.దానికి మారుపేరు శ్రీశ్రీ.






# యువభారతి

## పదకొండవ వార్షికోత్సవాలు

## ప్రతిభాలహరి ఉపన్యాసపరంపర

# ఎందరో మహానుభావులు

ఎందరో తమపనిగా, మనస్ఫూర్తిగా సహకరించినందుకు మా కళ్లు చెమరుస్తున్నాయి. వారికి మేం ఏమివ్వగలం ? మా నుండి ఏమాశించి ఇంత మంచితనం చూపారు వీరంతా ! ? మా ప్రచురణల ఉచితప్రతికోసమా ? కాదు. మా చిరునవ్వుల పలకరింపుకోసమా ? కానేకాదు, మంచిపనిలో తామూ పాలుపంచుకుందామనే మంచి మనసు వారిది.

మనసులోని కృతజ్ఞతాభావాలకు అక్షరరూపాన్ని కల్పించడంలో వారి మంచితనాన్ని లెక్కించగలమనీకాదు. ఓ మాటచెప్పి ఋణం తీర్చుకోగలమనీకాదు. భక్తిపూర్వకంగా శివార్పణం చేసిన ఒక్క బిల్వదళం మాదిరిగా-ఇది సహృదయచంద్రులకు మనస్ఫూర్తిగా సమర్పిస్తున్న నూలుపోగులు.

ఈ 'ప్రతిభాలహరి' కార్యక్రమానికి సంబంధించిన ఆలోచనలకు రూపకల్పన చేయడంలో మాకు సలహాలనందించి దీవించిన పెద్దలు యువభారతి గౌరవసభ్యులు శ్రీ దేవులపల్లి రామానుజారావుగారు, ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారు, డా॥ జి. వి సుబ్రహ్మణ్యంగారు వీరికి మా మనఃపూర్వకమైన అభివాదాలు.

తెలుగుభాషా సంస్కృతులను తమ ప్రతిభాప్రాభవాలతో సుసంపన్నం చేసి మార్గదర్శకులై నిలిచిన ప్రతిభామూర్తులపై ఉపన్యాసాలిచ్చి, వ్యాసాలనందించిన ప్రసిద్ధ ఆంధ్ర సాహిత్యాచార్యులు శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ దాశరథి, శ్రీమధునా

పంతుల సత్యనారాయణశాస్త్రి. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ జి వి. సుబ్రహ్మణ్యంగారలకు మా కృతజ్ఞతాభివందనములు. ప్రతిభామూర్తి పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి సాహిత్య వ్యక్తిత్వాలపై చక్కని వ్యాసమును రచించి, యువభారతికి ప్రసాదించిన శ్రీమధునాపంతులవారు తమ ఆరోగ్యము సరిగాలేక ఉపన్యసించడానికి రాలేకపోయారు. ఆ నాటి వేదికపై శ్రీ శాస్త్రిగారికి మారుగా ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు పానుగంటివారిని గూర్చి మధుర గంభీరంగా ఉపన్యసించారు. అవధానిగారి ఔదార్యానికి మా కైమోడ్పులు.

ఉత్తమ సాహిత్యాధ్యయనంపట్ల ఆసక్తిని పెంపొందించాలనే ఆశయంతో మేము రూపొందించిన కార్యక్రమాల విజయానికి తమ ఆశీరమృతాన్ని అందించి; ప్రతిభా లహరికి 'ఆశంస'ను సమకూర్చిన సహృదయులు, మా యువభారతి గౌరవసభ్యులు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారికి మా భక్తిపురస్సరమైన అభివందనాలు,

ప్రతిభాలహరి ఉపన్యాసమంజరీ సమావేశాలను నిర్విఘ్నంగా జయప్రదంగా నిర్వహించిన ఆయాసమావేశాల అధ్యక్షులు, ముఖ్య అతిథులు యువభారతి కృతజ్ఞత లకు పాత్రులు.

ఇది ప్రతిభాలహరికి సంబంధించిన విషయం. ఇక ఈ సంవత్సరంలో జరిగిన ఇతర కార్యక్రమాల గురించి ఒక్కమాట.

ఆనంద ఉగాది సందర్భంగా వివేకవర్ధనీ కళాశాల ఆవరణలో యువభారతి నిర్వహించిన సాహిత్యోత్సవానికి అధ్యక్షతవహించిన శ్రీ వి. పి. రాఘవాచారి ఎమ్.ఎల్.సి. గారికి, ముఖ్య అతిథులుగా విచ్చేసిన గౌరవనీయులు, ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు శ్రీ ఎమ్. వి. కృష్ణారావుగారికి 'వేమన్న వేదం' సరసంగా వెల యించిన శ్రీ ఆరుద్రగారికి, 'భోగినీలాస్యా'న్ని ప్రతిభావంతంగా రచించిన శ్రీమాన్ వానమామలై వరదాచార్యులుగారికి మా ప్రణుతిశతములు. ఈఉగాది సాహిత్యోత్సవ నిర్వహణలో మాతో సహకరించిన వివేకవర్ధనీ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ సూర్యారావు గారికి, ఉపన్యాసకులు శ్రీ నిడుదవోలు సర్వేశ్వరరావుగారికి, శ్రీ గుండాలరెడ్డిగారికి మా నమస్సులు.

17 జూలై, 1974 నాడు కుమారి రత్నపాపగారి నృత్యప్రదర్శన కార్య క్రమాన్ని రవీంద్రభారతిలో యువభారతి నిర్వహించింది. ఈ సందర్భంగా ప్రసిద్ధ పాత్రికేయులు శ్రీ రావూరు వేంకటసత్యనారాయణరావుగారి 'వడగళ్లు' (యువభారతి ప్రచురణ)ను ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు ఆవిష్కరించారు. ఈ కార్యక్రమ నిర్వ హణలోమాలో ఒకరై, మాకు చేదోడువాదోడుగా తమ సహకారాన్నందించిన సహృదయ మిత్రులు రవీంద్రభారతి డైరెక్టరు శ్రీ పాతూరి శ్రీరామశాస్త్రిగారు. యువభారతికి ఆర్థికస్తోమతును సమకూర్చడానికి ఏర్పరచిన ఈ నృత్యకార్యక్రమాన్ని తమదిగా

భావించి మాకు తమ సహాయ సహకారాలనందించిన సహృదయశేఖరులు నిస్వార్థసేవా పరాయణులు శ్రీ ఎ. శ్రీరాములు, ఎమ్. ఎల్. ఏ. గారు. వీరందరకు మాకృతజ్ఞతలు.

9 సెప్టెంబరు 1974 న వరంగల్‌నగరంలో మా యువభారతి గౌరవసభ్యులు ప్రజాకవి శ్రీ కాళోజీ నారాయణరావుగారి షష్టిపూర్తి సన్మానసభలో యువభారతి ఆయన రచనలనుండి కొన్నింటిని ఏర్చికూర్చి నా'గొడవ'గా ప్రచురించి ఉపాయనంగా సమర్పించుకున్నది. ఈ అవకాశాన్ని మా కిచ్చిన శ్రీ కాళోజీ ఔదార్యానికి మా నమస్కృతులు

సాధ్యమైనంత తక్కువవెలకు ఉత్తమసాహిత్యాన్ని వీలైనంత ఎక్కువమందికి అందిద్దామనే యువభారతి సంకల్పానికి చేయూతనిచ్చి, మేము కోరినవెంటనే 'సాహితీవాహిని' తరంగాలను సమకూర్చియిచ్చిన పండితమ్మన్యులకు మా నమోవాకములు. మా ప్రచురణలను సమగ్రమైన పీఠికలతో సమలంకరింపజేసిన సహృదయ విమర్శశేఖరులకు మా కృతజ్ఞతాభివందనాలు. మా ప్రచురణలను తమ కరకమలాలతో ఆవిష్కరించి, సాహిత్యాభిమానులకు పరిచయంచేసిన రసహృదయులకు మా నమస్సుమాంజలులు.

మా ప్రచురణల కన్నింటికీ ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్న డా॥జి.వి. సుబ్రహ్మణ్యంగారు సాహిత్యంలో ఎంత అభినివేశాన్ని సంపాదించారో అంతసాహిత్యానురక్తిని తమ హృదయంలో పదిలపరచుకున్నారు. విత్వత్కవులు, సహృదయ విమర్శకులు, ఆదర్శ అధ్యాపకులు, వాగ్మివతంసులు శ్రీ జి.వి.సుబ్రహ్మణ్యంగారి ఔదార్యానికి సాహిత్యాభిమానానికి అభిమానపురస్సరంగా మా అభివందనాలను సమర్పించు కొంటున్నాము.

మేము నిర్వహిస్తున్న పుస్తకప్రచురణ కార్యక్రమాలను తమ కళావిన్యాసములతో సమలంకృతం చేస్తున్న చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజుగారు. శ్రీ వీర్రాజుగారు మా యువభారతికి గౌరవసభ్యులు. తమ కళాసౌందర్యముతో హృదయసౌందర్యాన్ని మహోన్నతం చేసుకొన్న మనీషులు. ముఖచిత్రాలంకరణ, అక్షరాలంకరణలో మాకు తోడుపడుతున్న శ్రీ వీర్రాజుగారి ఔదార్య సహకారాలకు మా నమోవాకములు.

నేడు (1 డిసెంబరు 1974) మా యువభారతి రూపొందించిన క్రొత్తసాహితీ మిత్ర పథకానికి శుభారంభాన్నిపలికి ఆశీర్వదిస్తున్న పెద్దలు శ్రీ కె. వి. గోపాలస్వామి గారికి భక్త్యభివాదములు.

మా పదకొండవ వార్షికోత్సవ కార్యక్రమాల నిర్వహణ సందర్భంగా ఆర్థిక వనరులను సమకూర్చుకోవడానికి మాకు తోడ్పడిన ఉదారహృదయులు, సాహిత్యాభిమానులు శ్రీమతి ఇ వి. వసుమతీరెడ్డిగారు, శ్రీ జి. ఎల్. సంఘిగారు, శ్రీ వి. రామకిష్టయ్యగారు, శ్రీ రామ్‌ప్రసాద్‌గారు, శ్రీ ఎస్. పాండురంగారెడ్డిగారలకు మా కృత

జ్ఞతాభివందనాలు. సుదూరంలో ఉంటూకూడా యువభారతికి ఆర్థిక, హార్దిక విషయాలలో అండగా నిలుస్తున్న శ్రీ పి. యస్. శాస్త్రిగారికి మా అభివందనాలు.

అక్షరాస్యతకు, జ్ఞానప్రపదణానికి ప్రధానసాధనంగా ఉన్న కాగితం ఎందుకో క్షామాన్ని ఎదుర్కొంటున్నది. ఈ క్షామం మనదేశానికేకాదు. ప్రపంచానికే సమస్యగా తయారయింది. ఈ విపత్కర పరిస్థితులలో భారతప్రభుత్వంవారు మా ప్రచురణలకై సరసమైన ధరలకు కాగితాన్ని అందించి మాకు అండగా నిలబడ్డారు. ఇందుకై యువభారతి భారతప్రభుత్వం వారికి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికి కృతజ్ఞతలు తెలుపుకుంటోంది. ప్రభుత్వంవారు మాకై కేటాయించి యిచ్చిన కాగితాన్ని మా కందించిన ఆంధ్రపేపర్‌మిల్సు వారికి, హైదరాబాదు కార్యాలయ నిర్వహణాధికారులు శ్రీ బి.ఎన్. రాఠీగారికి మాకృతజ్ఞతలు ముద్రణకు అవసరమైన ఇతర కాగితాన్ని అందించడంలో సహకరించిన శ్రీ రాజ్యలక్ష్మి పేపర్‌మార్టు అధినేతలకు మా కృతజ్ఞతలు.

మా కార్యక్రమాలకు ఇతోధికమైన ప్రచారాన్ని అందించిన పాత్రికేయులు సర్వశ్రీ జి. ఎస్. వరదాచార్యులు, పి యస్ ఆర్. ఆంజనేయశాస్త్రి, పి. దామోదర స్వామి, రాజేంద్రప్రసాద్, పాపయ్యశాస్త్రి, సురమౌళిగారలకు, ఆకాశవాణివారికి, ముఖ్యంగా శ్రీ వేలూరి సహజానంద, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారలకు మరియు శ్రీ పి సతీష్, శ్రీ సుధామగారలకువందనాలు.

మా ప్రచురణ ముఖపత్రాలను కళాత్మకంగా ముద్రించిన శ్రీ విస్టాస్‌ప్రింటర్సు వారికి, బ్లాకులను అందంగా అమర్చి యిచ్చిన శ్రీ మోహన్ ప్రాసెస్‌వారికి, ప్రచురణ భారాన్ని కొంత స్వీకరించి చక్కగా ముద్రించి యిచ్చిన శ్రీ అశ్వినీ ప్రింటర్సువారికి, శ్రీ ప్రతిభా ప్రింటర్సువారికి, శ్రీ శివాజీప్రింటర్సువారికి, శ్రీ శ్రీనాథ ప్రింటర్సువారికి మా నమస్సులు.

మా ప్రచురణలలో అత్యధికమైనవాటిని కళాత్మకంగా ముద్రించి, సకాలంలో అందజేసిన శ్రీ నాగార్జున ప్రింటింగ్ వర్క్సు అధినేతలు శ్రీ ఎన్.వి.నారాయణగారిని మేము మరువలేము.అచ్చుపోసే పనులను అతిజాగరూకతతో, ఓపికతో నిర్వహించిన నాగార్జున ప్రింటింగ్‌వర్క్సు కూర్పరి శ్రీ పి. వి. గండయ్యగారికి మా కృతజ్ఞతలు.

వీలైనంత తక్కువ వెలకు ఉత్తమసాహిత్యాన్ని అందించాలనే యువభారతి పట్టుదలను సహృదయంతో అర్థంచేసుకుని, ఆమేరకు ఇతోధింగా వ్యాపార ప్రకటనల నిచ్చి ప్రోత్సహించిన సహృదయ వదాన్యులకు మా నమోవాకములు.

మాకార్యక్రమాలను తమ ఆవరణలో నిర్వహించుకొనే అవకాశాలను ఇతోధికంగా కలిగించి, మాతోసహకరించిన ఆంధ్రసారస్వత పరిషత్తు నిర్వాహకులకు-విశేషించి ఆంధ్రసారస్వత పరిషత్తు ఉపాధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, కార్యాలయ నిర్వాహకులు శ్రీ హరికిషన్‌రావుగారికి, శ్రీ సాకేతరాజుగారికి మానమ

స్సులు. వేలాది ప్రజలకు సాహిత్యోపన్యాసాలు వినడానికి వీలుకల్పించే విధంగా ఆవరణాన్ని సముచితాసనాలతో సమలంకృతం చేసిన శ్రీ యూసఫ్ కంపెనీ అధినేతలకు, సభాప్రాంగణాన్ని దేదీప్యమానంచేయడంలో తోడ్పడిన శ్రీ హనుమాన్ ఎలక్ట్రికల్స్ వారికి మా కృతజ్ఞతలు.

1972లో యువభారతి ప్రచురించిన 'చైతన్యలహరి' ని ప్రాచ్యభాషాపట్టభద్రులకు పాఠ్యగ్రంథంగా నిర్ణయించిన ఉస్మానియా విశ్వవిద్యాలయ నిర్ణాయక సంఘం వారికి మా మనఃపూర్వక నమస్సులు. భారతస్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా వెలువరిచిన సమీక్షావ్యాససంకలం 'మహతి' ని మనరాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల్లో ఎమ్. ఎ (తెలుగు) వారికి పరామర్శగ్రంథంగా నిర్ణయించి నందుకు వారందరకూ మా ప్రణతులు.

యువభారతి ప్రచురణలను రాష్ట్రంలోని అన్ని, కళాశాల విద్యాలయాలలోని గ్రంథాలయాలలో ఉండుటకు అర్హమైనవిగా స్వీకరించే నిర్ణయ పత్రాన్ని ప్రసాదించి నందుకు రాష్ట్ర విద్యావిషయాధికారి గారికి మా నమస్సులు. రాష్ట్రంలోని జిల్లా గ్రంథాలయ సంస్థలలో ఉండదగిన పుస్తకాలుగా యువభారతి ప్రచురణల గుర్తింపు కలిగించి నందుకు రాష్ట్ర ప్రజాగ్రంథాలయాధికారి గారికి మాకృతజ్ఞతాభివందనాలు.

మా ప్రచురణలను సాహితీప్రియులకు అందించడంలోనూ; మాసాహిత్యకార్యక్రమాలపట్ల అత్యంత అభిమానం చూపుతున్న శ్రీ ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ అధినేతలకు సర్వదా కృతజ్ఞతలు,

మాకార్యక్రమాలపట్ల అభిమానాన్ని పెంచుకొని మాకు చేదోడువాదోడుగా ఉంటున్న, హార్దికంగా తోడ్పడుతూన్న సహృదయ మిత్రులు శ్రీ డి. వీరమణిగారు, శ్రీ బి. వి కృష్ణమూర్తిగారు, శ్రీ ఎమ్. పాండురంగారావుగారు, శ్రీ వి. వి. బిహెచ్. అప్పారావుగారు, శ్రీ కె. వి. సూర్యనారాయణగారు, శ్రీ హెచ్. దక్షిణమూర్తిగారు, శ్రీ వై. ఆంజనేయులుగారు శ్రీ ఎమ్. వి. వి. సుబ్బరాజుగారు, శ్రీ ఎన్. వి. భాగారావుగారు, శ్రీ ఇ. వి. శర్మగారు, శ్రీ సి. హెచ్. కృష్ణమూర్తిగారు- అందరూ యువభారతి కృతజ్ఞతకు పాత్రులు.

మాయువభారతి సాధారణ పక్షసమావేశాలను, అడపాదడపా నిర్వహించే స్థానిక సాహితీమిత్రుల సమావేశాలను నిర్విఘ్నంగా నిర్వహించుకునే అవకాశం కల్పించిన శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషానిలయం వారికి, విశేషించి గౌరవకార్యదర్శి శ్రీ ఎమ్. ఎల్. నరసింహారావుగారికి మాకృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

లహరి పరంపరలో జరుగుతున్న ఉపన్యాస కార్యక్రమాలు జంటనగరాలలోని సాహిత్యోత్సవాలుగా, నయనానందకరంగా, జయప్రదంగా జరుగటానికి, వేలాదిగా హాజరై, సమావేశస్థలానికి ప్రత్యేకశోభను చేకూర్చిన సహృదయ సభాసదులదే ఆఘనత. పెద్దఎత్తున ప్రచురణ కార్యక్రమం తలపెట్టడానికి అవసరమైన ధైర్యాన్ని

మాకు కలిగిస్తున్నది ఈసభలే, ఈసహృదయ సభాసదులే; నిజానికి క్రమశిక్షణతో మెలిగి, మనస్ఫూర్తిగా సహకరించి—ఆ మంచి పేరును మాకు మిగిల్చి పెడుతు న్నారు. ఆ మంచితనానికి మా మనఃపూర్వక కృతజ్ఞతలు.

యువభారతి కేవలం పుస్తకాలను అచ్చువేసి, అమ్ముకొని, లాభాలు చేసుకొనే సంస్థకాదు. మాతృభాషా వికాసానికి తపస్సుచేస్తున్న యువకుల సంస్థ. సమాజంలో సౌమనస్యాన్ని పెంపొందించడానికి సాహిత్యంకంటే సాత్త్విక సాధనం మరొకటి లేదనే నమ్మకంతో కృషిచేస్తూ సాధ్యమైనంత తక్కువ వెలకు ఉత్తమ సాహిత్యాన్ని అందించడానికి ప్రయత్నం చేస్తున్నాము.

మాకు తమ సహకారాన్ని అందజేస్తున్నవారు మాకాప్తులు, సాహితీ మిత్రులు. వారందరినీ పేరుపేరునా ఉదాహరించడం సాధ్యంకాదు: హార్దికంగా మాతో సహకరిస్తున్న వారందరికీ మేము సదాకృతజ్ఞులమై ఉంటాము.

విస్తృత ప్రాతిపదికపై సాహిత్య కార్యక్రమాలను రూపొందించి, నిర్వహించ డానికి అర్థబలం, అంగబలం, క్రమశిక్షణ ఎంతో అవసరం. మాసభ్యులలో కొందరు విశేషశ్రమకోర్చి నెలల తరబడి తమ తీరిక సమయాన్ని త్యాగంచేసి యువభారతి భారాన్ని నిర్వహిస్తున్నారు. కొందరు సాహితీమిత్రులు సహకరించేందుకై ముందు కొస్తున్నారు. కార్యక్రమ నిర్వహణా భారాన్ని చిరునవ్వుతో కొనసాగించిన మిత్రుల సహకారంలేనిదే ఇంత పెద్దఎత్తున కార్యక్రమాలను ఆచరణలో పెట్టడం ఎంతకష్టమో అందరికీ తెలిసిన విషయమే. మాకార్యవర్గం వారి సహకారం, సభ్యుల త్యాగనిరతి, మాతృభాషాభిమానం మరువరానిది. అందుకే ఎందరో మహానుభావులు—

## అందరికీ మా వందనములు

సింగంపల్లి వెంకటేశ్వరరావు

1 డిసెంబరు, 1974 కార్యదర్శి

---

**యువభారతి పక్ష సమావేశాలు**

యువభారతి ప్రతినెలా,
మొదటి ఆదివారం, మూడవ ఆదివారం
సుల్తాన్‌బజారులోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో
మధ్యాహ్నం 2-30 గం॥లకు సమావేశమవుతుంది.
సహృదయులందరూ ఆహ్వానితులే!




---




# యువభారతి

# ప్రచురణలు

వెల రూ

| | | |
|---|---|---|
| * 1. | సరస్వతీసాక్షాత్కారం (కావ్యం) —ఆనుముల కృష్ణమూర్తి | 3-00 |
| * 2. | జీవనగీత (కావ్యం) —కాళోజీ | 2-50 |
| * 3. | వీచికలు (నలుగురు యువభారతీయుల కవితా సంకలనం) | 2-00 |
| 4. | పంచవటి (ఐదుగురు ప్రముఖ కథకుల కథలసంపుటి) | 2-00 |
| 5. | రచన —గోష్ఠి వ్యాసాలసంకలనం | 7-00 |
| * 6. | కావ్యలహరి (ఉపన్యాసమంజరి) —ఆచార్య దివాకర్ల వేంకటావధాని | 5-00 |
| * 7. | అక్షరాలు (పదముగ్గురు యువభారతీయుల కవితాసంకలనం) | 2-00 |
| 8. | చైతన్యలహరి (ఉపన్యాసమంజరి) | 6-00 |
| 9. | మహతి (నూర్గురు ప్రముఖరచయితల వ్యాస సంకలనం) | 20-00 |
| 10. | Free India Forges a Head (34 ఆంగ్లవ్యాసాల సంకలనం) | 10-00 |
| *11. | స్వరాలు (24 మంది యువభారతీయుల కవితా సంకలనం) | 3-00 |
| *12. | ఉషస్సు (సాహితీ మిత్రుల కవితాసంకలనం) | 3-00 |
| *13. | మళ్ళీవెలుగు (వచన కవితాకావ్యం) —శీలా వీర్రాజు | 4-00 |
| *14. | ఉదయం (యువభారతీయుల కథాసంకలనం) | 2-00 |
| *15, 16 | కథావాహిని 1, 2 సంపుటాలు (సాహితీమిత్రుల కథాసంకలనాలు) ఒక్కొక్కటి | 2-00 |
| 17. | మందార మకరందాలు (వ్యాఖ్య) —డా॥ సి. నారాయణరెడ్డి | 2-00 |

18. ప్రజాసూక్తం (తెలుగు సామెతల సంకలనం) 2-00
19. వికాసలహరి (ఉపన్యాసమంజరి) 6-00
20. వేమన్న వేదం (వేమనపద్యాలకు రసార్ద్రవ్యాఖ్య) —ఆరుద్ర 2-00
*21. భోగినీలాస్యం (పోతన చరిత్రములోని భోగినీనృత్యఘట్టానికివ్యాఖ్య) 2-00
—వానమామలై వరదాచార్యులు
22. వడగళ్లు (తలపులజల్లు) —రావూరు వెంకటసత్యనారాయణరావు 2-00
23. నాగొడవ (కవితాసంపుటి) —కాళోజీ 2-00
24. శ్రీనాథునికవితావైభవం (కవిసార్వభౌముని పద్యాలకువ్యాఖ్య)
—డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం 2-00
25. మేం (ఇద్దరు యువభారతీయుల కవితల సంపుటి)
—సుధామ, నాగినేని భాస్కరరావు 5-00
26. విశ్వనాథ కవితావైభవం (కవిసమ్రాట్టు పద్యాలకు వ్యాఖ్య)
జువ్వాడి గౌతమరావు 2-00
27. సిందూరం (ప్రముఖకవుల కవితాసంకలనం) 2-00
28. శిఖరాలూ-లోయలు
(జిబ్రాన్ కవితోక్తులకు స్వేచ్ఛానుసరణం) డా॥ సి. నారాయణరెడ్డి 2-00
29. భావన (దాదాపు 500 సుభాషితాల సంకలనం) 2-00
30. ప్రతిభాలహరి (ఉపన్యాస మంజరి) 6-00
31: మెరుపులు (కవితోక్తుల సంకలనం) —పొట్లపల్లి రామారావు 2-00
32. తిక్కన కవితావైభవం (వ్యాఖ్య) —డా॥ పాటిబండ మాధవశర్మ 2-00

* ఈ గుర్తుగల పుస్తకాల ప్రతులులేవు.

---

• చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది •









వీలయినంత ఎక్కువ మందికి, వీలయినంత తక్కువ వెలకు ఉత్తమ సాహిత్యాన్ని అందించగలిగినట్లయితే పాఠకులలో సాహిత్యాధ్యయనంపట్ల అనురక్తిని పెంపొందింపవచ్చునని, సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్వీక సాధనం లేదనే విశ్వాసంతో యువభారతి కృషి చేస్తున్నది.

సహృదయుల సహకారంతో ఇప్పటికి యువభారతి 32 ప్రచురణలను ప్రచురించి, రెండులక్షలకుపైగా ప్రతులను సరసమైనధరలకు అందించటానికి పూనుకున్నది. యువభారతి తనకృషిలో పాలుపంచుకునే మిత్రులకోసం ఎదురు చూస్తున్నది. సాహితీ మిత్రులుగా చేరి, సాహిత్యోద్యమ నిర్వహణలో బరువు బాధ్యతలు పంచుకునే సహృదయుల సహకారం ఆకాంక్షిస్తున్నది. ఇది సాహితీ మిత్ర పథక ధ్యేయం.

## యువభారతి సాహితీమిత్రులుగా చేరడంవలన కలిగే లాభాలు

* పదిరూపాయలు చెల్లించటంతో చేరిన నాటినుండి ఒక సంవత్సరంపాటు సాహితీమిత్రులుగా పరిగణింపబడుతారు. మీ సభ్యత్వ సంఖ్యతో 'సాహితీ మిత్రులు' అని వెల్లడించే సభ్యత్వ చిహ్నం అందుకుంటారు.
* చేరినవెంటనే యువభారతిలో ప్రచురణలనుండి (పుస్తకాలపై పేర్కొన్న వెల ప్రకారం) మీరు ఎన్నుకున్న 10 రూపాయల విలువగల పుస్తకాలను రిజిస్టర్డ్ పోస్టులో లేక అలాంటి భద్రంగాచేరే మరో పద్ధతిద్వారా కాని అందుకుంటారు.
* యువభారతి సాహిత్య కార్యక్రమాల వివరాలతోపాటు ఇతర ఉపయోగకరమైన విషయాలను, ఆలోచనలను రేకెత్తించే వ్యాసాలను, వ్యాఖ్యలను సంతరించుకొని వెలువడే 'నందిని'-చిన్న మాసపత్రిక వరుసగా పన్నెండు నెలలపాటు ఉచితంగా పంపడం జరుగుతుంది.
* సభ్యులుగా చేరిన తరువాత యువభారతి ప్రచురణలను, దాదాపు అన్నింటిని 25% మినహాయింపుతో సొంతం చేసుకొనే సదుపాయం మీరు చేరినవాటి నుండి ఒక సంవత్సరంపాటు ఉంటుంది. రిజిస్ట్రేషన్ పోస్టేజి చార్జీలు అదనం అని గమనించ ప్రార్థన.

## స్వయంగా మా కార్యాలయానికి వచ్చే మిత్రులకు
## ప్రత్యేక సదుపాయం : మరో రెండు రూపాయల అదనపు లాభం

* స్వయంగా యువభారతి కార్యాలయానికి వచ్చి పది రూపాయల సభ్యత్వ రుసుం చెల్లిస్తే మా ప్రచురణలపై పేర్కొన్న వెలకు మీరు ఎన్నుకున్న 12 రూ.ల విలువగల పుస్తకాలను పొందవచ్చును.

## స్వయంగా రాలేని వారైనా, పై ప్రత్యేక సదుపాయాన్ని పొందవచ్చు.

* ఐదుగురు వ్యక్తులు కలిసి ఒకేసారి సాహితీమిత్ర సభ్యత్వం రూ. 10-00 ల చొప్పున రు. 50 లు, మనియార్డర్ ద్వారాగాని లేక బ్యాంక్ డ్రాఫ్టు ద్వారా గాని (చెక్కులు స్వీకరింపబడవు) పంపే పక్షంలో ఒక్కొక్కరూ రు. 12-00 ల విలువగల పుస్తకాలను అందుకోవచ్చు.
* ఐదుగురు మిత్రులూ వారి సభ్యత్వ పత్రాలు పూరించి పంపాలి.
* ఐదుగురిలో ఏ ఒక్కరి చిరునామానో ప్రత్యేకంగా పేర్కొనాలి. అలా ప్రత్యేకంగా పేర్కొనబడిన సాహితీమిత్రుని చిరునామాకు (1) ఐదుగురు సాహితీమిత్రులకు రు. 12-00 ల చొప్పున పంపవలసిన 5×12=60-00 రూ.ల విలువగల వారు కోరుకున్న పుస్తకాలను, (2) ఐదుగురి సభ్యత్వ చిహ్నాలను, పోస్టులో భద్రంగా పంపుతాము.
* ఐదుగురికీ విడివిడిగా పంపనవసరంలేని కారణంచేత రు. 2-00 ల అదనపు విలువను ఆ ఐదుగురిలోని ప్రతిమిత్రుడూ పొందగలుగుతున్నాడన్నమాట. మాసపత్రిక మాత్రం సాహితీమిత్రుల చిరునామాలకు విడివిడిగా పంపించడం జరుగుతుంది.

## నూతన సాహితీమిత్ర పథకం శుభారంభ సందర్భంలో
## ప్రత్యేక ఆకర్షణలు

* డిసెంబర్ 1, 1974 నాడు ఆరంభింపబడుతున్న ఈ పథకంలో డిసెంబర్ 31, 1974 లోగా సభ్యులుగా చేరే మిత్రులు యువభారతి ప్రత్యేకంగా ప్రచురిస్తున్న 1975 సంవత్సరపు పాకెట్ సైజ్ డైరీని ఉచితంగా పొందుతారు.
* కొత్తసాహితీమిత్ర పథకానికి 5 గురు సాహితీమిత్రులను ఒకేసారి చేర్పించి, రు. 50-00 లు ఒకేసారి పంపే ఉత్సాహశీలురైన సాహితీమిత్రులకు యువభారతి కృతజ్ఞతాపూర్వకంగా ఒక పుస్తకాన్ని కానుకగా అందిస్తుంది.

మా స్నేహహ్వానాన్ని స్వీకరించండి ! సాహితీ మిత్రులుగా చేరండి ! మీ మిత్రులకు చెప్పి చేర్పించండి ! మా కృషికి మీ చేయూతనందించండి !!

సాహితీమిత్ర సభ్యత్వపత్రాలకు, వివరాలకు వ్రాయండి !!

1-12-1974 యువభారతి

1975
లహరి






కవితాలహరికై ఎన్నికైన కవితామూర్తులు

* నాచన సోముడు
* పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు
* జాషువా
* దేవులపల్లి కృష్ణశాస్త్రి
* దాశరథి



సహృదయుల సహకారంతో
ఈ డిసెంబర్ 1, 1974 నాటికి
32 ప్రచురణలను ప్రచురించి
2,00,000 లకు పైగా ప్రతులను
సరసమైన ధరలకు పాఠకులకు
అందించటానికి పూనుకొన్నది.




* సాహితీమిత్రులు * భారతీమిత్రులు
* భారతీభూషణులుగా చేరి యువభారతి
సాహిత్యోద్యమ నిర్వహణలో తోడ్పడండి.

యువభారతి




సాహితీ వాహినిలో
ఇంత వరకు వెలువడిన
తరంగాలు

| | | |
|---|---|---|
| 1. | మందార మకరందాలు | రూ॥ 2-00 |
| 2. | వేమన్న వేదం | ,, |
| 3. | భోగినీ లాస్యం | ,, |
| 4. | వడగళ్ళు | ,, |
| 5. | నాగొడవ | ,, |
| 6. | శ్రీనాథుని కవితావైభవం | ,, |
| 7. | విశ్వనాథ కవితావైభవం | ,, |
| 8. | సిందూరం | ,, |
| 9. | శిఖరాలూ - లోయలు | ,, |
| 10. | భావన | ,, |
| 11. | మెరుపులు | ,, |
| 12. | తిక్కన కవితావైభవం | ,, |

**యువభారతి**

సాహితీసాంస్కృతికసంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3